శ్రీరామచంద్రాయ నమః.

# శ్రీ భద్రాచల

# రామదాసుచరిత్రము.

కావ్యవ్యాకరణతీర్థులు,

పంచాగ్నుల - ఆదినారాయణశాస్త్రిచే

పరిష్కృతము.



1925.

మద్రాసు.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీవారిచే

ఆనందముద్రాలయమున

ముద్రితము

# పీ ఠి క.

శ్లో॥ తత్కార్య యస్నబంధాయ స్యాద్విద్యా యా విముక్తయే।
ఆయాసాయాపరం కర్మ విద్యాన్యా శిల్పనైపుణీ॥

సుఖపరాయణులకుఁ దత్ప్రతిపాదకమగు... చిరేప్సి

ము. ఆర్యులు నాగరకరత్నములు వ్యవహరించుకొను చతు
ర్విధ (స్వేద జాండ జోద్భిజ్జ జరాయుజ) భూతగ్రామముగానీ
యటియుఁ బూజ్యవ్యవహారగోచర మగు నయోనిజోత్కరము
గానీ ఎట్టివారికి నేని సుఖాన్వేషణదుఃఖనివారణ వ్యవసాయ
ముదక్క వే ఱొండుపని లేదు. ఎంతగా నెమ్ములు తవుడుచేసి
కొన్నను ఉపాయచింత ఉపేయచింత యువిదప్ప ఆబ్రహ్మకీ
టము ఉపాత్తమని యొం డెవనికిఁ గానరాదు. ఏమి? ఉపా
త్త మైనచో, అనఁగాఁ బ్రాప్తవ్యము ప్రాప్తించినచో నిఁక సుఖ
ముగా నూరకుండవచ్చుఁగా మఱి? ఏప్రాణియు నట్టుంట లేదు.
పై పెచ్చు స్వతంత్రతకుఁ బోవుట పరతంత్రత గట్టిచేసికొనుట
యొంగపురుగుసామెత. ఏదియో లాభించినట్టు భ్రమయేకాని

---

* స్థావరములకును గలదా దుఃఖనివారణయత్నము? అనుశంక వలదు

ఆశనినిర్ఘోషంబు నాకర్ణనము లేక
వికృతి నెట్టులు వొందు వృక్షమాక
పముల త్తిసూవె శ్రోత్రము నిదాఘంబునోఁ
కున వాఁడు జోఁకొయుం గుట సమీర

అది నిక్కమైనలాభమగుచో తదుత్తరక్షణమే తత్త్యాగేచ్ఛయు నన్యసంపాదనయత్నము నేల కలుగవలెని కావుననే ఎవఁడైన సరి భోగము భుజించినా నన్నది తప్పు. భోగమే జంతువులను భుజించి చక్కఁగా నమలి సారము పీల్చుకొని వట్టిపిడుచలు వెడలఁగాయుచున్నది.

బ్రహ్మాండకోటులచేనైనను గడుపు నిండదు. లౌకికముగాఁగాని వైదికముగాఁగాని సర్వోపాయములు ఆయాసప్రదములు, అనర్థకరములేగాని నిర్వృతిఁ గలుగనీయవు. పైగా కట్టుత్రాళ్లే! ఈసంగతి వైదికమార్గమువారి వేదశాస్త్ర పురాణేతిహాసముఖ్యమైనగ్రంథకుటుంబమే మొత్రాళ్లు చివుర్ప రాల్గరగఁగా నీశ్వరునకును అప్రతివిధేయమైనయుక్తిజాలముతో నిష్కర్షచేసి వర్ణించినది. సుస్తప్రబోధమాత్రప్రయోజకములని తలఁపక వానినే యిప్పటివారు చరిత్రఫలములని కఱచి

---

శక్తి మార్గముఁ గనిం చాఁగెడుఁ గనుట తే
జశ్శక్తి పాదపంసంజ్ఞఁ బరఁగు
పాదజిహ్వలఁ గొనిం పానంబుఁ జేయుట
జలశక్తి జిహ్వ నైంజంబు లైన
కుసుమధూపాదిగంధముల్ ంగొనుట నెలమి
దాల్చు నని చెప్పఁ దరువుకేందంబు ఘ్రాణ
మూర్విశక్తి నట్లయిదునుంనుల్లసిలుట
ననఘ భూజంబు పంచభూంతాత్మకంబు. భారతము.

ఇట్లు పెద్దలు ప్రశ్నోత్తరరూపములుగాఁ బ్రసంగించుకొని లోష్టపాషాణాదులకు నిట్లే తపముచే నింద్రియసద్భావము నెఱుఁగవలయుటఁ దెరువు చూపినారు

చవిలేదని చప్పరించుచున్నారు. వారు మూర్ఖులు; వీరుమునీము
లు. కాదామఱి! ఇచ్చినా ఇచ్చినపడవతో నేఱుదాఁటలేక
కొట్టుకొని పోవువానికిఁ బడవ యిచ్చినవాఁడు మూర్ఖుఁడేకాక
మఱియే మగును?

. జగదాసక్తిలో సుఖగంధమేనియు దొరకదు. ఈచల
నము మాని తూష్ణీంభవనమున కలవడినచో నిత్యప్రాప్తమైన
యానంద ముండనే యున్నది. తూష్ణీం అనఁగానే బెదర
వలసినది లేదు. అది శోకరహితస్థితికి సాధనమే గాని శూన్య
మువంటిది గాదు. శూన్య మని కన్నవాఁ డొకఁడుండునందాక
శూన్యమేది? భరితదిక్కుంజ మయినయీవస్తువును తాఱుమా
ఱుసేయు శాస్త్రకోటులుసయితము శక్తములు గానేరవు. కాని
ప్రమాదపడక సద్గురుసచ్ఛాస్త్రసాహాయ్యముచేఁ బ్రజ్ఞకు చికి
లీచేయుచు స్వప్నపరంపరలు దాఁటవలెను. జాగ్రత్త వలయు
ను. మాటలు చెల్లవు. మనసు చొరనేరదు. "చకిత మభిధత్తే
శ్రుతిరపి" "కం. గురువులు తమకును లోఁబడు, తెరువులు సెప్పె
దరు విష్ణుదివ్యపదవికిం, దెరువులు సెప్పరు చీఁకటిఁ బరువులు
పెట్టంగ నేల బాలకులారా!—(భాగ.) కాన ధీరులు గావలె.
ద్వేషింపనువలదు ప్రేమింపనువలదు.

రెండు మార్గములు. అభ్యుదయము, నిశ్శ్రేయసము.
స్వారాజ్యముఖము లభ్యుదయములోనివి. తుదకు మోక్ష
హేతు వయినశాస్త్రావళితోఁగూడ సర్వబ్రహ్మాండజాలమును
మ్రింగినచోటే నిఃశ్రేయసము. ఇక్కడకు రాఁగానే సర్వదర్శన
ములుఁ బండుకొనును. దుర్దర్శము. లోకభయంకరస్థితి! ఐదు
పదినేయనిశూరునిశూరత చాలదు. గుణ్ణము ద్రొక్కఁగలవీరఁ

టాలిధీరతయుఁ గొలఁగాదు. బ్రహ్మాండకోటులు ప్రాప్తమయిన ను తుప్పని యుమియఁజాలు తెంపు కావలెను. పౌరుషమే పౌరుషము. ఒకరిబాసట పనిలేదు. తుదకు దేవతలుగానీ, యితరుల చూపోపమియుఁ గొలఁగాదు. ధీరునకుఁ గుసుమాపచయముకంటెను సుకరము. పరాకుగా నున్నవానిని ప్రత్యక్ప్రవణునిఁ జేయుట కుపదేశమాత్రమేకాని యభ్యుదయమని యాకఁడు పరమార్థము కాదు.

చొరవ చిక్కినకొలఁది మానవుని వెనుకకుం ద్రోలవలయు నని వేద మవలంబించినప్రకారములు పెద్దవి మూఁడు—కర్మ, ఉపాస్తి, జ్ఞానము. తెలివి లేక చక్రభ్రమణముగాఁ దిరుగుచున్నవానికిఁ గొంచెము స్తిమితముకుదురనీయని అవసరము కొలఁది సకామముగాను, నిష్కామముగను నానారసాయనమైనకర్మ యుపదేశించును: ఇందుచే ఒకకర్మలో బద్ధుఁడయి నానాకర్మలనుండి విముక్తిఁ జెందుటచేఁ దెలివిచిక్కి భారము తగ్గి చిత్తము శుద్ధ మగుచున్నది. తరువాతఁ బిట్టకాలికి నుఱి బిగించినట్టు లురియాడుచిత్తమును కదలనీయమికై యుపాసనము. శుద్ధమయి యచలమయినతెరువాత చిత్తము, యోగ్యతానుసారముగా ముక్తికి సాక్షాద్ధేతు వైనజ్ఞానము. ఇంచుమించుగా మొదటివిరెండును నేకజాతీయములే! ఉపాయము కాఁబట్టి ఆద్యద్వయము సంఖ్యకు బహుతరముగా నగపడుచున్నది. ఉపేయ మైనందున నే కడపటిది మితముగా నున్నది.

వేదరాశి యైనవాసుదేవమూర్తి నిజాజ్ఞారూపనిగమాగమములచేఁ బ్రాణిజాలమును మనుచువిధ మి ట్లున్నది—ఓయీ! యేల యీయలజడి? “భవితవ్యతా భగవతీ వస్తు

ప్రియ మప్రియం వాపి, ఘటయితు మథ విఘటయితుం ప్రభ
వతి పురుషస్యకో దోషః'' "అవశ్యం భావిభావానాం ప్రతీ
కారో భవేద్యది, తే న దుఃఖై ర్నలిప్యేర న్నళరామయుధిష్ఠి
రాః'' "మజ్జత్వంభసి యాతుమేరుశిఖరం ... ఆకాశం విపులం
ప్రయాతు ఖగవత్కృత్వా ప్రయత్నం పరం నాభావ్యం
భవతీహా భాగ్యవశతో భావ్యస్యనాశః కుతః—ఇత్యాదులచే
నిష్టానిష్టసంపటమైనచిత్తమును లౌకికమునుండి మఱలించివైది
కోపాయపరతఁ గల్పించి నిష్కామకర్మచేఁ జిత్తశుద్ధి యయిన
కొలఁది తదాత్మసంప్రతిపన్నరీతితో 'వెఱ్ఱివాఁడా! పారలౌ
కికముమాత్ర మేమంతయెక్కువ? అదియు నిత్య నశ్వరము
అక్కడమాత్రమేమి ఈయైదింద్రియములె కాక పెచ్చున్నవా?
యేల యీమూర్ఖత? హరిపరాయణుఁడ వగుము. శాశ్వతుఁడ
వయ్యెదవు''-అని పట్టుపట్టును. అత్యంతప్రకృతమునకు వచ్చి
నాము. * శ్రీరామదాసస్వామియీఘట్టములో దొరకినాఁడు.
వాసుదేవపరాయణులజన్మము పాశ్చాత్త్యమని (కడపటిదని)
పెద్దలనిశ్చయము. 'మాతుః పయోధరరసం నపునః పిబంతి' అఁట
గా. కనుక నే అక్షరాభ్యాసమునాఁడే అక్షరమూర్తిని చిక్కించు

* ఈఛాందసులగోల జగత్తునకు సంహారకముగా నున్నదని శిశువులు
బెదుర నక్కఱలేదు. వైకుంఠమునుండి శ్రీమన్నారాయణుఁడు దిగివచ్చినను
వటతలమునుండి దక్షిణామూర్తి దేవుఁ డుపదేశించినను కోటికొక్కఁడేనియుఁ
జెవియొగ్గునా? భయము లేదు. కాయరు. కట్టివేయరు. నీళ్లుచూపరు. మేపు
వేయరు. ఇట్టివేవియు లేకయే పెట్టినేయ బద్ధావరు లయినరాసభస్వాముల
కన్నఁడుఁ గొఱఁత యుండదు. జగత్తు భరితమై యుండును.

కొన్నారు గోపన్నగారు. బాలరామాయణములోనే వగతెగి పోయినది. అవాప్తసర్వకాముఁడు; సర్వజగన్మంగళము; శ్రీని కేతనుఁడుతప్ప వేఱుగతిలే దని గట్టిచేసికొన్నాఁడు. వీనికన్నిఁ టికినేమిగానిముఖ్యముగాఁ దానప్పుడున్నచో ఆసీతమ్మచాటయి నకొఱఁతలో "నిత్యబుద్ధస్వభావుఁడవు కాదఁటయ్యా నీవు?——" అని హెచ్చరిక చేసెడివాఁడఁట. అందఱున్నను ఒక్కనికైన నింతమాత్రము తోఁచకపోయె నని విసుగుకొన్నాఁడు భక్తుఁడు.

జగదేకవీరుఁడు పూర్ణకాముఁడు దాశరథివంటి దైవ మేఁడీ! వీరుఁడన్నప్పుడెల్ల రఘువీరుఁడే యని యర్థము చేసినారు పెద్దలు. మహావీరుఁడన్నాఁడు భవభూతి. వర్ణనల కందని మహిమ! అందువలననే—వేదవేద్యే పరే పుంసి జాతే దశర థాత్మజే। వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయ ణాత్మనా—అని వాల్మీకి మహర్షి యత్నమును మెచ్చినారు కవులు. ఆమాత్రమే కాదు. రథ్యోదకము గంగయైనట్లు లీసప్రసం గములో నల్పవాక్కులు సయితము మహితములై పోవును. ఒకమాట; ఒకబాణము; ఒకపత్ని! రామనామము జపించు వా రందఱును జపించనివారు కొందఱుందురా యేమి? సచేతనులలో నుండరు. అందఱు దొడ్డరాజు; రణశూరుఁడు; పర దైవమన్నవారే. ఎందుచేత నింతపొగడు? మహేష్వాసుఁ డనియా? అపరాజితుఁ డనియా? కాదఁటగా!—

మహావీరుఁ డని చరితముకట్టిన అశ్రీకంఠుఁడే ఆనోటితో నే "సుంద స్త్రీదమనే ప్యకుంఠయశసః" అని వెక్కిరించినాఁడు. బుల్లిరాజులవుని చాటుచేసికొని; 'పుత్రాదిచ్ఛేత్పరాజయం' కొఱకా? మోదపఱుత మనియా? జగన్మంగళుని సామంగల్య

మునకు దృష్టి తగులుననియా? మఱి యేమికోఱకు? రససిద్ధుఁ డఁటగా కవి! ఇటువంటివానికోఱకుఁగాదు. అంపజోళ్లతోనే శూరత్వము పూర్తికాదు. ఆమాత్రమే యగునేని దోషము కూడ! క్రౌర్యమే చాలునేని సింహవ్యాఘ్రాదులును వర్ణ్య ములే కావో?

ధీరోదాత్తుఁడు, వారాశిగంభీరుఁడు; అగాధసత్త్వుఁడు. కార్పణ్యరహితుఁడు. ఎవఁడొప్పగింపఁగలఁడు ఈశతకోటి ప్రవి స్తరాలు? వీనిచే నని యందురు వీరుఁడు ప్రవీరుఁడు నని. ఇందు ఆధానుష్కతలోమాత్ర మున్నాఁడఁటలేయిట్టిఁడు! రాఘవేం ద్రుఁడుదప్ప మఱి లేఁడుమగవాఁడు. పురుషోత్తముఁడుకాఁ డూ! రాజ్యముకోలుపోయినరాజా యున్నది వనములో? మునిమోదవిధాయి; బ్రహ్మణ్యమూర్తి; స్మితపూర్వాభిభాషి; మారంగశాయిగాక!

అదివరలో విశేషితమయి హఠాత్తుభంగపడఁబట్టి యూ హాకుఁ జోటయినది. కాని, కానిచో సీతమ్మకుమాత్ర మెఱుఁగ నగునా యేమి? తానై చెప్పెడిదాఁక నీయభ్యుదయాంతరాయ ము? ఏమిశుచిభూషణుఁడు! ఎట్టిశ్రుతశాలి! భరతన్న వణఁకును. ఏల? కైకమ్మను తిట్టినారన్న ఫిర్యాదు ఆకాస్త దొరవారిదగ్గఱ కెక్కనే మోయని; చిన్నతమ్ముని వేగన్నులఁ గనిపట్టును.

ఇంతకు "భవితవ్యత భగవతి. పిన్నమ్మకు దూష్యత రా రాదు. అందును దసపేరుగా సుతరాంపనికిరాదు." అని రఘు పతియొక్క ప్రకటశీలము కాఁబోలు. ఓహో రాఘవా! యీయాండుసాలదే నీపతితపావనతకు! శ్వపచుఁడే నగుఁగాక, ఒక్కమాటుగా మేలిమిఁ జెందఁడే!

ఇదిమాత్రమా!—"దుఃఖసంవేదనాయైవ రామే చైత
న్య మాహితం" "నష్టం సీతేతినామాపి నచ రామో నజీవతి"
"అపిగ్రావా రోదత్యపిదళతి వజ్రస్యహృదయం"—ఈవిధ
ముగా సెగలు పొగలు వెళ్లుచు మంటలతో తోఁణుకు విడుచుచు
న్న దే! ఇటువంటిదా అగస్త్యుఁడు పీల్చినసాగరము? ఏమైన
చికిత్స చేసెనా? ఏఁడీయిట్టిపోటుబం టింకొకఁడు? ఇంతకన్న నే
మి నిదర్శనముకావలె మగతనానికి? రామా! యేమి నీతితీక్ష!

'పీడవదలిపోయినఁబోనీ, అపఖ్యాతి లేకుండఁబోవును'
అని తెంపుచేసికొని, సతీవిరహదుర్బలుఁడై త్రావినాఁడేమో
హరుఁడు విషము. అందుకని అంతగా అబ్బో అనుకొన్నారే
మో! కాకిరక్కసి పొంగించినకోపగరళములో దీనిగా ఎంత?
మారాజు మగఁటిమికి నింకేనేమికావలె సాక్ష్యము? నాట్య
ములో నటులిపే రెఱుఁగ వీలు గాదు. కవితలోఁ గవియు నగ
పడఁడు. ఇది యొక యధికారము.

'విజ్వరః ప్రముమోదహ''—ఇదియొక పెద్దప్రమేయ
ము. ఆవేళ యేటి నిద్రపోయినాఁడఁట, ఎడమచేయి బొమ్మపై
నిడుకొని! ఏవేళ? విభీషణుని రాజ్యాభిషేకమునాఁడు. సుగ్రీ
వునికి అప్పుటంటమట్టుకు చిటుకలమీఁదఁ దెలిపోయినది. కాని,
"లంకారాజ్యేభిషేక్ష్యామి"—అనఁగానే అప్పుడే అక్కడి
సరదారులందఱు దుయ్యాబారా పట్టుకొన్నారఁట. ఆసమయా
నికి ఏదో బోకరించినాఁడు. 'పో, అంతగాఁగాకున్న నయోధ్య
యే యిచ్చెద పొమ్మన్నాఁడు. అయోధ్య యిచ్చుటకు వీరికేదీ
ఫర్మానా? ఆవేళకు భరతన్నగారు మెదలకుండ నున్నచో నేమి

కావలె? ఈగుంజులాటయెట్లో కనుగొన్నాఁడు. వాల్మీకి మహర్షి. ఈగాంభీర్య మెవఁడు వర్ణింపనేర్చును?

సప్తకోటిమహామంత్రములకును శివపంచాక్షరము మూలభూతము; సారతమము నని శివపరాయణులు, నారాయణాష్టాక్షరికన్న ముఖ్యాతిముఖ్యము లేదని హరిభక్తులును నమ్ముదురు క్రమముగా రెంటిలోనను రెండువర్ణము లేతికొని తారకమైనది. దీనిముందవి రెండును చిన్నబోయినవి. కాదా? చూడుఁడు. రేఫ పోఁగానే 'నాయనాయ' పరగతికిఁ బనికిరాదు అనియు, ఆమకారముకొంచెము పోఁగానే 'నశివాయ'—శుభమునకుఁ గొఱగాదు అనియు నైనవి. దీని నే 'ఓం' అనియుఁ దత్త్వమసి అనియు నింకను బలుదెఱఁగుల పొందికపఱచుకొన్నారు.

మంత్రరాజ మగుతాగకమునుగానీ, తదభిధేయ మగు శ్రీసీతారామబ్రహ్మమునుగానీ, అందుఁ గలరుచి యెఱింగిన రామదాసాది భక్తవర్యులనుగానీ అస్మాదృశులు వర్ణింపఁబూనుట చిఱుచేఁప సాగరముఁదూనికవేయుటవంటిది.

భక్తవరులు భగవంతునికిఁ దమయార్తి యెఱింగించుకొనుటలో నవలంబించుప్రకారములు వర్ణనాతీతములు. ధన్యుఁడొకఁడు దన్ను కళత్రముగాను, రమాకాంతుఁ దనకాంతుఁగాను చేసికొని విరహోత్కంఠ వెళ్లఁబోయును.ఏడుగడయు వీరికి వాసుదేవుఁడే. వనమాలఁగాఁ బుట్టకపోతిని. తుదకు రమావరు మందిరము దేహళిఁగానైనఁ గాకపోతిని. శ్రీపతిమెట్టుబండనైనఁ గారాదా? ఇత్యాది ప్రకారకోటులు. మునిసుందరులు, గోపకామినులు మున్నగువారుపాటులు బడలేదా? అట్లు పెక్కులు

నైచ్యానుసంధానములు. ఆత్మార్పితమనోబుద్ధులయి సర్వము తనకే న్యసించి భజించునీభక్తులను నారాయణుఁడును సర్వప్రకారములఁ బ్రతిసంవరణము సేయును.

హరిభజనపరులు వాసుదేవునియం దైక్యమునే కోరుదురు. అంతర మణుమాత్రము సహింపరు—"అదర్శనే దర్శనమాత్రకామా దృష్ట్వా పరిష్వంగసుఖైకలోలా, ఆలింగితాయాం పునరాయతాక్ష్యా మాశాస్మహే విగ్రహయోరభేదమ్"—ఏవమాదులయిన లౌకికసుఖములలోనే భేదదర్శనముండువఱకు స్వచ్ఛసుఖోపలబ్ధి కానప్పుడు పరమసుఖములో భేదమన్నఁ బానకములోని పుల్లలు గాదా!

కావుననే ముక్తిసోపానగతులైన భాగవతోత్తములును ఆళ్వారులును, 'నీనే నేను' నే నేనీవు'—అని వాసుదేవుని భజించినారు. త్యాగయ్యగారును నీవే నేనని పాడినారు. జయదేవమహాకవి— 'మధురిపురహమితి భావనశీలా!''—అని రాధికాదేవిని వర్ణించినారు. ఇట్టివియు నింకను ననేకప్రకారములు భజనవిధులు రామదాసస్వామిజీవితమునఁ దొలకాడెడిని.

ఏమంత్రమేనియు నప్రయత్నముగా వాకునకుఁ దగులుచో నది సిద్ధించినట్లే గుఱుతని పెద్దల వ్యవహారము. ఆవిధముగా గోపన్నగారికి శ్రీరామతారకము ఆదినే జిహ్వాలో స్థిరమైపోయినదఁట! చెప్పికొన్నాఁడు. హరిభక్తులకు, తేలుకు మందు, పాముకు మందు, స్నానీయము వేఱు పానీయము వేఱు; అప్పిచ్చెడివాఁడొకఁడు; ఆదరించెడి ప్రభువొకఁడు, ఇన్ని యుండవు.

సీ. బలురోగములకు నీపాదతీర్థమెకాని
వలపుమందులు నేను వలవ నయ్యా!
చలిఁదిసోఁకిన నీకు సేవఁజేసెదఁగాని
వంచనార్థము శాస్త్రమెంచనయ్యా!
గ్రహాభయమునకుఁ జక్రముఁ దలంచెదఁగాని
ఘోరరక్షలు గట్టఁగోర నయ్య!
పాముకాటుకు నిన్ను భజనఁజేసెదఁగాని
దానిమంత్రము నేను దలఁపనయ్యా!
దొరకితివి నాకు దండివైద్యుఁడవు నీవు
వేయికష్టాలు వచ్చిన వెఱవ నయ్యా—భూ॥

[శేషప్ప]

అల్లో గోపన్నకు కోదుకుచావునకు కోదండపాణివైద్యుఁడు. తెలుగుట్టిన నదె మందు. లక్షలు కోట్లు అప్పుగావలెనన్న శ్రీరామచంద్ర మహారాజుగారికోటూరే! మరల తీర్పుటకును వాఁడే! తుదకు జవానుగిరికిని రామలక్ష్మణులే!

భక్తిభరితము లైనగోపన్నగారి కీర్తనలు శతకాదులు తెనుఁగువారిలో విశేషవ్యాప్తినిఁ గాంచినవే! సీతారాముల పెండ్లికిఁ దిరుపూరికడకు నెదురై పేరటాండ్రను పెద్దబ్రాహ్మణులను పిలుచుకొని పోవుచుండెడివారు గోపన్నగారనియు, నశ్వారూఢుఁడై గోపన్నగారు హరిముఖద్వారము సొచ్చిన యానవాల్లిప్పటికినిఁ గలవు మూలవిరాట్టులో ననియు, సేవ మాదిగాఁ జవులూర బరశ్నితకథాకథన దక్షులయినవారును రసభరితముగాఁ బాడుకొని, తత్కీర్తనాది తాత్పర్యము రసము చెడకుండ నాస్వాదించువారును నాంధ్రులలో వేనవేలు సహస్రా

దయులుండఁగా నేను మాటమాటకుఁ దాత్పర్యము చెప్పుటచే విశేషరుచి సంపాదనముచేయఁజాల నని యిఁక నొంకు రెండు మాటలలో విరమించెదను.

తారకము ఇటు నిష్కామకర్మఫలమైన చిత్తశుద్ధికిని అటు ప్రాణచింతనాద్యుపాయసాధ్యమైన మనోనైశ్చల్యతల్లయములకును నుత్తమసాధనమయినందునను, గురులింగమూర్తి గారి మార్గము ప్రకారము కృతకృత్యతఁ జెందినవారిలో, శ్రీరామదాసమసీమియు నొక్కరని నిశ్చయముగాఁ దలఁచు చున్నాను.

రామదాసుగారికి ఈజన్మలోనే యిట్లువిశేషవిష్ణుభక్తి గలిగిన దఁట! వీరితారకోపదేశ గురువుగారికేఁ గబీరుదాసుగారికి విష్ణుభక్తిలోఁ బలుజన్మము లేఁగినవఁట! అందుచే భగవత్ప్రసన్నతలో కబీరుగారికి ఆధిక్యమఁట ! ఆకారణమునఁ దీవ్రముముక్షువైనరామదాసుగారు బాహ్యభక్తి విశేషముచేసినారుగా నగపడును. వీరితోఁ బ్రవ చాలవఱకు నామసిద్ధాంత సంప్రదాయమునుగూడ పోలుచున్నది—ఇతిశమ్.

క్రోధన; విజయదశమి
చెన్నపురి.
పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రి.

# కథానాయకుని చరిత్రాదికప్రశంస.



మన యీరామదాసచరిత్ర కథానాయకుని నిజమగు పేరు కంచెర్లగోపన్నగారు. కాని జనసామాన్య మునకీపేరు అంతగాఁ దెలియదు. భద్రాద్రిరామదాసని గాని, బందిఖానా రామదాసనిగాని చెప్పిననే, వారికి త్వరగా నితఁడు గోచరింపగలఁడు. 'మణినావలయం—వలయేన మణిః' అన్నవిధముగా భద్రాద్రి రామదాసు చేతను, రామదాసు భద్రాద్రి చేతను అసదృశ మగుప్రఖ్యాతిని గడించెను. అందునను ఆంధ్ర దేశమును ఆంధ్రజాతియు నున్నంతవఱకును ఈదివ్యమూర్తుల కీర్తిమూర్తి పరిపూర్ణప్రకాశముతో వెలుంగునంతటి ప్రఖ్యాతిని వీరు సంపాదించినారు. గోపన్నగారి యింటిపేరు కంచెర్ల వారు. తల్లిపేరు కామమ్మ. తండ్రిపేరు లింగనమంత్రి. కాపుర స్థలము నెలకొండపల్లెయఁట! (ఇయ్యది నిజాము రాష్ట్రములో నిప్పటికి నున్నదందురు) ఈ పై వివరములు ఈరామదాసుచరిత్రమునందు 25-వ పేజీలో—ఇట్లు వివరింపఁబడినవి. చూడుడు

తోహరా.

శ్రీమించిన నెలకొండపల్లెలో శిష్టజనులు పొగడగను
కామాంబకు గోపన్న జనించెను కమలాక్షుని వరమునను
ఆత్రేయసగోత్రంబునఁ గంచర్లాంధార్యుల వంశమునన్
పుత్రుఁడగుచు లింగనమంత్రికిఁ దాఁ బుట్టెను గోపనయనఁగన్

ఈవిషయమును, తన ఇతరములగు కులగోత్రాది విషయములను ఈకవి తానురచించిన దాశరథిశతకమునందుఁ ఉల్లేఖించియే యున్నాఁడు. ఆపద్య మియ్యది—

ఉ. అల్లన లింగమంత్రిసుతుఁ డత్రిజగోత్రజుఁ డాదిశాఖ కం
చెర్ల కులోద్భవుండనఁ బ్రసిద్ధుఁడనైన భవదంకితంబుగా
నెల్లకవుల్ నుతింప రచియించితి గోపకవీంద్రుఁడన్ జగ
ద్వల్లభ నీకు దాసుఁడను శ్రీ దాశరథీ కరుణాపయోనిధీ!

[దాశ. శ. 103]

ఈపైపద్యమునుబట్టి యీతఁడు కంచెర్లఅను నింటిపేరు గలవాఁ డనియును,ఆత్రేయగోత్రము వాఁడనియును, ఆదిశాఖ వాఁడనియును తాత్పర్యమేర్పడుచున్నది. మఱియు నిట్టులనే దాశరథీశతకమునందలి మఱియొక్క పద్యమునందును [పట్టితి భట్టరార్య—యనుదానిలో] తనయొక్క గురువుల పేరును గూఁడ బేర్కొనుట చేత మనకు వియొక్క తలిదండ్రులు మున్నగువారి నన్వేషించుటలో కొంత తేలిక గల్గినది. కాని చరిత్ర కారులకు మాత్రము ఇతని ఆదిశాఖావిషయమున చాల సందేహములు జనించినవి. కొందఱు ఆదిశాఖవాఁడనఁగా ఆదివేదమగు ఋగ్వేదమునకుఁ జెందినవాఁడనియునుమఱికొందరు శుక్ల యజుర్వేద శాఖీయులగు ప్రథమశాఖవాఁ డనియును, భిన్నముగా వ్యవహరించుచున్నారు. కాని జనశ్రుతిలోఁ గంచెర్లవారు ప్రథమశాఖీయు లనియే వినఁబడును.అట్లైన చోఁ గోపన నియోగి యని చెప్పెడి (రామదాసు చరిత్రమునందలి) 'భూసురవరుఁడు నియోగియు' అనుకిందపద్యము సంగత మెట్లనియందురు. కాని ఇది అంత క్లిష్టతరమైన యంశము కాదు. నియోగిపదము—

రాజకీయోద్యోగనియమితుఁ డన్న యర్థమునఁ బర్యవసన్న
మగుటచేత నితని యాదిశాఖిత్వమున కెట్టి ఆటంకమును కలు
గదు. పైఁగా కేవలాంధ్రదేశమునందలి వాదులకును నైజాము
రాష్ట్రపు వాడుకలకును చాల భేదము కలదు. కావునను, ప్రస్తు
తము నియోగుల మని చెప్పుకొను నాంధ్రబ్రాహ్మణులలో-
వైదికులు శైవులు వైష్ణవమతానుయాయులు స్మార్తులు (స్మార్త
సంప్రదాయము వారు) గోలకొండవ్యాపారులు మున్నగు
పెక్కురు అవాంతరతెగలవా రుండి ప్రత్యేకత ఏర్పడకుండుట
చేతను, ఇది అంతగ క్లిష్టమగు నంశముకా దనియును, ఆతని
ఆదిశాఖిత్వమున కడ్డు లేదనియును తలంతును.

రామదాసు చరిత్రమును బట్టియును, జనశ్రుతిని బట్టి
యును గూడ, ఈగోపన్నను అక్కన్నమాదన్నల మేనల్లుఁ
డని మన మెఱుంగుచున్నాము. చెన్నపురి ఓరియంటలు లైబ్రరీ
లోని [లోకలురికార్డ్సు] స్థానికచరిత్రసంగ్రహమునం దొక
చోట నీఅక్కన్నమాదన్నలను గుఱించి ప్రస్తావించుచు,
అక్కన్నమాదన్నలయింటిపేరు పింగళివారనియు, వారివంశ్యు
లగు పింగళివారును సిద్దలూరివారును నిప్పటికిఁ గలరనియు
వ్రాయబడియున్నది. ఇందుల కుపబలముగా గూడ ఏనుఁగు
లక్ష్మణకవి వ్రాసిన తుల్యామాహాత్మ్యమునందు 'బింగళిమాదన్న
భానుజీవలస సమ్మానమొందె'—అని వత్సవాయ రాయ
జగపతి రాజును ప్రశంసించు సందర్భమునందు బింగళిమా
దన్నయని ఇంటిపేరుతోఁగూడఁ జేర్కొనుట కన్పించుచు
న్నది. కావున అక్కన్నమాదన్నల ఇంటిపేరు పింగళివా రను
టకు సందియము లేదు.

అక్కన్న మాదన్నలు క్రీస్తుశకము 1658 మొదలు 1687 వఱకును గోలకొండలో రాజ్యపాలనమొనర్చిన అబూహాసన్ కుతుబుశాహాయొద్ద దివానులుగా నుండిరి. ఈఅబూహసను కుతుబుశాహాకే తానీషాయన్నది మారుపేరు.ఇప్పుడు మనకీ రామదాసు చరిత్రమునఁ దానీషాయన్న పేరు తప్ప మఱియితరము గాన్పించదు; కాని [1]లక్ష్మణకవి మున్నగు ప్రాచీనుల పద్యములబట్టియును, చరిత్రజ్ఞులవ్రాతలను బట్టియును, తానీషాయన్నది మారుపే రనియును, నతని అసలు పేరు అబూహాసన్ కుతుబుశాహా అనిగాని, అబ్దుల్ హాసన్ సుల్తాను అనిగాని, అయియుండుననుట నిక్కము.కనుక నీతానీషా 17-వ శతాబ్ది ఆరంభమునం దుండుటనుబట్టి ఆతనిమంత్రిపుంగవులగు అక్కన్న మాదన్నలుకూడ 16-వ శతాబ్దిచివఱను 17-వ శతాబ్దినాదిని యున్నవారు. కాఁగా మనగోపన్నగారునువారికి మేనల్లు డగుటచేతఁ బదునేడవశతాబ్దివాఁ డని తెలుచున్నయది

సుప్రసిద్ధు లగుమహాపురుషులను గుఱించి జనులు అనేకము లగు చిత్రవిచిత్రకథలను చెప్పుచుండుట వాడుకయైనది. దీనివలన నిజమగుచరిత్రాంశము తెలుటలేకున్నను ప్రజలయొక్క అకృత్రిమమగు భక్తిభావనాభినివేశము మాత్రము బోధపడుచు నుండును. ప్రస్తుతము విచారించినచో మన అక్కన్నమాదన్నలనుగుఱించి కూడ అట్టికథలు కొన్ని జనులలో ప్రాకికొని స్థిరప్రతిష్ఠను గడించినవి—అం దిక్రిందికథ యొకటి :—

---

1. సీ—సుల్తనబ్దుల్హాసన్ క్షోణీశ్వరునిచేత
మాటిమాటికి బహుమానమందె. (తుల్యామహాత్మ్యము)

"అక్కన్న యన్నయనియు మాదన్న తమ్ముఁడనియు సామాన్యముగా జను లనుకొనుచున్నారు. కాని యక్కన్న నిజమైనయన్న కాఁడని యొక వైతిహ్యము కలదు. అక్కన్న యొక బీదవాఁడగు బ్రాహ్మణుఁడట! మాదన్న మంత్రిత్వము చేయుచుండగా అక్కన్న అతని ఇంటికివచ్చి ప్రవేశించెనఁట! తన భార్య బంధువుఁడని తలఁచి మాదన్నయును, భర్తబంధుఁవుడని తలఁచి యాతని భార్యయు అక్కన్నను మిక్కిలి మర్యాదచే యుచుండిరి. అక్కన్న వయస్సునఁ బెద్దవాఁడగుటచే మాదన్న యతనిని అన్నగారని పిలుచుచుండిరి. లోకులును అట్లే తలఁచుచుండిరి. ఇట్లు కొన్ని దినములు గడచిన తరువాత, ఒకనాఁడు మాదన్న భార్యతో అక్కన్నను గురించి ముచ్చటింపఁగా నాతఁడామెకు బంధువుఁడు కాఁడని తెలిపెను. అందుపై నతఁడక్కన్నతో మనకుగల బంధుత్వము తెలుపుమనఁగా—'నాయనా! వినుము. నేను పెద్దమ్మ కుమారుఁడను. నీవు చిన్నమ్మ కొమారుఁడవు; ఇట్లు మనమక్కచెల్లెండ్ర బిడ్డలముగాన నన్నదమ్ములము సుమా! ఈరహస్యము మనస్సులో నుంచుకొనుము. మన మెప్పటియట్లు యన్నదమ్ములవలెఁ బ్రవర్తించెదము' అని యనెనఁట. అక్కన్న బుద్ధిచాతుర్యమునకు మెచ్చి మాదన్న యతనిని అటుతరువాత నిజముగ అన్నగానే చూచుచుండెను"

అసలు అక్కన్నమాదన్నలను వ్యక్తులే లేరని కొందఱి మతము. కాని ఇది అవిచారితోక్తి. అట్టివారు మనయిప్పటి ఆంగ్లప్రభుత్వమువారు సేకరించిన అక్కన్న మాదన్నల పరిపాలనమును గుఱించిన యుత్తరముల రికార్డులను చూచినచో

సత్యబద్ధులు కాగల్గుదురు. ఈరికార్డులన్నియును, లెటర్సుబు పోర్టుసెంటుజార్జి యన్న పేరుగల గ్రంథములో దొరతనము వారు సేకరించియున్నారట! ఆరికార్డులలో—తానీషా 1682 సంవత్సరములో అదివఱకు తనకు సేనానిగా నున్న మహమ్మదు ఇబ్రాహీం అన్నవానిని తొలఁగించి-అతని సాహాలష్కర్ అధికారమును అక్కన్నకిచ్చినట్లు గలదు. ఇదియునుగాక శివదిగ్విజయమన్న గ్రంథమునందు 'గోల్కొండ రాష్ట్రమును ఔరంగజేబునోటిలోఁ బడకుండ, అక్కన్న శివాజీకినిఁ దానీషాకును సంధికలిపి కాపాడెనని యున్నది. మఱియును పైనిచెప్పిన రికార్డులందే అక్కన్న మాదన్న గార్లకును కంపెనీవారికిని వ్యవహారసంబంధమున గలిగిన అనేక విషయములు కూర్పఁబడి యున్నవి. ఇవి చాలవఱకు ఆకాలమున గోల్కొండలో కంపెనీవారికిఁ బ్రతినిధిగా నున్న వీరరాఘవుడను గుమాస్తా వ్రాసినయుత్తరములు. ఆయనయుత్తరములలోని సంగ్రహవిషయములిచ్చుటఁ జదువరులకొఱకు వ్రాయఁబడుచున్నవి—* "ఇట్లు గోలకొండలో సర్వాధికారముతో ప్రభుత్వముచేయుచున్న యీమంత్రిపుంగవుల యనుగ్రహము బడవలయు నని మన దేశమువారు గాక ఫ్రెంచివారు ఇంగ్లీషువారు గూడ విశ్వప్రయత్నములు చేయుచుండిరి. అప్పుడు ఈస్టు ఇండియా కంపెనీవారు చిన్నవర్తకులు. చెన్నపట్టణము ఒక చిన్నగ్రామము. ప్రస్తుతము జార్జిటౌన్ అనబడు స్థలము మాత్రము

---

* ఈయంశములు కీ. శే. లక్ష్మణరావుపంతులుగారి విజ్ఞానసర్వస్వము నుండి గైకొనఁబడినవి

కంపెనీవారి స్వాధీనములో నుండెను. మచిలీపట్టణములో వీరికి నొక గిడ్డంగి యుండెను. ఈస్థలము లన్నియు గోల కొండవారి రాజ్యములోనివి. కావున నీభూముల కై కంపెనీ వారు గోలకొండ నవాబునకు శిస్తు చెల్లించుచుండిరి. ఇంతియ కాక గోలకొండ రాజ్యములో నిరాటంకముగా వర్తకము చేసి కొనుటకు నవాబునాజ్ఞ కావలసియుండెను. కంపెనీవారికి నౌరంగజేబుతో వైరముండెనుకావున గోలకొండలో సర్వాధి కారులైన అక్కన్న మాదన్నల యనుగ్రహము సంపాదించు టకు చెన్నపట్టణములోని ఇంగ్లీషువారు విశ్వప్రయత్నములు చేయుచుండిరి. 1678లో తానీషాయు మాదన్నగారును మచిలీ పట్టణమునకు బోగా నచ్చటి ఇంగ్లీషువారు వారిని మిగుల గౌరవించి వారియనుగ్రహమును పడయుటకై వారికి ననేక బహుమతు లొసంగిరి. 1679-వ సంవత్సరపు ఫిబ్రవరి నెలలో చెన్నపట్టణపు ఇంగ్లీషువారు తమకు స్యాంథోం (మైలాపూరు) ఎగ్మూరు అను స్థలములు కౌలున కిప్పించునట్లు కోరిరి. 1680లో పోడేలలింగప్ప యనువాఁడు చెన్నపట్టణమునకు సరకులురా కుండ నడ్డగించినందున వాఁడట్లు చేయకుండ మాన్పవలసినద నియుఁ దమవర్తకమునకు భంగములేకుండ చేయవలసినదనియు కంపెనీవారు అక్కన్న మాదన్న పంతులవారిని గోరిరి. అంత వారు దయామయులై కంపెనీవారిని బాధపెట్టవలదని లింగ ప్పకు వ్రాసి యాతనినే తమప్రతినిధిగా నేర్పఱచి, అన్నివిష యములను గురించియు ఇంగ్లీషువారితో నుత్తరప్రత్యుత్తర ములు జరుపుచుండుమని యాజ్ఞాపించిరి. ఈలింగప్పనే1682లో మాదన్నగారు కృష్ణానదికి దక్షిణమునందున్న గోలకొండ

రాజ్యమునకంతకును సుబేదారుగా నియమించిరి. కావున నీలింగప్ప యప్పటి గొప్ప సరదారులలో నొక్కఁడని చెప్ప వలయును. 1682 సం॥ జూలైనెలలో మద్రాసు గవర్న రునకు పోడేలలింగప్పయొక యుత్తరము వ్రాసెను. అందు సంవత్సరపు పన్ను 2000 వరహా లీయవలసినదనియు, అక్కన్నగారి యోడలవిషయమై కొంత సాహాయ్యము చేయవలసిన దనియును వ్రాసెను. అందువలన అక్కన్న గారికి నోడ లుండెననియును, నాతఁడు సముద్రవర్తకము చేయుచుండె ననియును మన మూహింపవచ్చును. అదివఱకు కంపెనీవారికి నీయఁబడిన ఫర్మానాప్రకారము విశాఖపట్టణము మొదలయిన స్థలములలో కంపెనీవారికి వర్తకవిషయమైన వీళ్లు కలుగజేయుమని కంపెనివా రక్కన్నమాదన్నగార్లను 1682 సెప్టెంబరులోఁ గోరిరి. వారికనేక బహుమతులను బంపిరి. అక్క న్నగారికిని దుబాష్ వెంకటాద్రికిని 25వ సెప్టంబరు దినమున బహుమతుల నంపిరి. ఆసంవత్సరపు అక్టోబరునెలలోనే అక్క న్నగారు మచిలీ బందరు మొదలయిన స్థలములకు బోగా నచ్చ టి కంపెనివా రాతనిని మిగుల గౌరవించిరి. పోడేలలింగప్ప కంపెనీవారిపై చాడీలు చెప్పినందున అక్కన్నగారికివారిపైకోప పము వచ్చెను. 1682 నవంబరులో మాదన్నగారి కుమారుడు మల్లప్పకు వివాహమయ్యెను. అప్పుడు మాదన్నగారికి పీనెడు బంగారపుగొలుసులు కావలసి వచ్చెను. అందుకు వెల ఇచ్చె దనని ఆతడు తెలిపినను వలదనిచెప్పి చెన్నపట్టణపు ఇంగ్లీషు వారా బంగారపుగొలుసులు కానుకగా బంపిరి. 1682వ సంవ త్సరమునందు 1–వ జనేవరిదినమున సంవత్సరాది కానుక

కంపెనీవారు 400 వరహాలు మాదన్నగారికి బంపిరి. వారి యనుగ్రహము వడయుట కివి కంపబడెనని వ్రాయబడియున్నది. ఇంగ్లీషువారిని ననుగ్రహించుటకును పరదేశమునుండి వచ్చిన యితరాగంతుకులను గోలకొండ రాజ్యములోనుండి వెడలగొట్టుటకును అక్కన్నగారికి నెన్నియో పుట్లు రాగియు ధనమును ఇచ్చెదమని చెన్నపురిలోని ఇంగ్లీషు వారు 1683లో 14-వ ఆగస్టు దినమున దెలియఁజేసిరి. ఇట్లొక్కటా? రెండా? మాదన్నగారి కుమారుని యుపనయనమునకుఁ బెండ్లికి, మాదన్నగారి పేష్కారునకు ఆయనబిడ్డకు పినతండ్రికి బహుమతులు పంపి వారియనుగ్రహమును సంపాదించుటకై ఈస్టిండియా కంపెనీవారు ప్రయత్నించుచుండిరి." 'కీటోపి సుమనస్సంగా దారోహతి సతాం శిరః'—అన్న న్యాయము ననుసరించి మహాధర్మాత్ములును అనేకాన్నదాన సత్రాదులకు ప్రతిష్ఠాతలును ప్రభుభక్తిధురంధరులును ఆస్తికశిరోమణులును నగు (అక్కన్న మాదన్నలు) తనమేనమామలయొక్క నిరంతర సంసర్గమువలన మనరామదాసునకుఁగూడ బాల్యమునుండియే - ఆర్యవర్తనము - దైవభక్తి - ఆస్తికత్వము బ్రాహ్మణసమారాధనము-మొదలగు సుగుణపుంజ మలవడినది. అందునకుఁ గబీరుదాసంతటి వాని యుద్బోధనముచే శ్రీరామభక్తి శాఖోపశాఖలతో ప్రజ్వరిల్లినది. దానితో తాను ధన్యుఁడగుటయేగాక మనయాంధ్రదేశమును మనలనుగూడఁ ధన్యులంజేసినాఁడు. భక్తిచే పొందరాని వస్తు వున్నదా?

భారతవర్షమునందలి తక్కిన యన్ని దేశములతోఁబాటు ఆంధ్రదేశముకూడ భక్తశిఖామణుల యుత్పత్తికి అపారమగు

నాకరము. ఈయాకరమునందు (గనియందు) ఎన్నెన్నియో యుజ్జ్వలములగు మణులు ఉదయించియున్నవనుట నిక్కము. కాని తక్కుంగల భక్తరత్నముల కేరికిని రామదాస రత్నమునకు వచ్చినంతటి పేరుప్రఖ్యాతులు రాలేదు. కారణమేమందురా ?— ఈరత్నమునకు సాక్షాచ్ఛ్రీరామచంద్రుఁడే స్వయముగా శాణమై ఒరపిడి నిచ్చి తీర్చి దిద్దుట గలిగినది. ఆమహానుభావుఁ డెన్నెన్ని విధముల సానఁబట్టినను పగులక నొగులక యన్ని పరీక్షలకును తాళఁగల్గినది ఈయుత్తమరత్నము. కనుక నే చంద్రతారము దివ్యప్రకాశమును పొంది విలసిల్లుచున్నది.

ఆంధ్రదేశమునందలి పల్లెపల్లెయందును అక్షరాస్యులు అనక్షరాస్యులను భేదము లేకుండ రామదాసుకీర్తనలు వ్యాపించియున్నవి. ఆకీర్తనలను తాళపత్రములలో వ్రాసి పెట్టికొని మొన్నమొన్నటివఱకును మనవారు దేవార్చన గృహపీఠములందు భద్రముసేయుచు జాగ్రత్తగా కాపాడుచు వచ్చినారు. పూర్వము రామదాసు కీర్తన మొక్కటియైనను రాని ఆంధ్రుఁడు కన్పించెడివాఁడు కాఁడు. కాని నేఁడా ఆంధ్రదేశము నాంధ్రుఁడును మారిపోయినాఁడు. జాతీయాచార వ్యవహారముల కతఁ డిప్పుడు సంపూర్ణముగా విముఖుఁడైనాఁడు. అతనిని రామదాసు భక్తికీర్తనలు గానముసేయుటయనఁగా గావలయు నంత అభిమానము లజ్జ ఆవరించినవి. కనుక నతఁడు పూర్తిగా వదలివైచినాఁడు. ఒక్క రామదాసుకీర్తనలన్న మాటయేమి? ప్రాణమునకంటె మిన్నఁగా గాపాడుకొనుచు వచ్చిన సనాతనములయిన వేదాదులకే దిక్కు కనఁబడుట లేదుగదా!

# చరిత్ర విమర్శనము.

ఈకారణముననిపుడాంధ్ర దేశమునందుప్రాచీన గేయము లకు ఆనుపూర్విగ రాగము తాళము లయ మున్నగు శాస్త్రలక్షణములు పూర్తిగ నెఱుంగఁజెప్పగల గాయకులు అరుదగుచున్నారు. ప్రస్తుతము కీర్తనలందు ముద్రితగ్రంథములం దుల్లేఖింపబడిన రాగతాళ ములరీతికిని, అచ్చటచ్చట మిగిలియున్న సంప్రదాయాగతధోర ణికిని భేదము అనంతముగా నున్నది. దానిని సరిజేసికొనుటకు మముబోటివారికిచాలగష్టముగా నున్నది.ఇయ్యదిఇంతటనైనను విజ్ఞులు గమనించి చేయవలసిన దిద్దుబాటని మనవి.

ప్రస్తుతము రామదాసుచరిత్ర మని వాడుకలో నున్న గ్రంథములు తాళపత్రములలో రెండువిధములుగా గన్పడు చున్నవి. ఈ రెండునుగాక ముద్రితమైనది మఱొక్కవిధముది. మొట్టమొదటివానికి ప్రాయికముగా రామదాసుకీర్తనము లని యేపే రుండును. అందులో రామదాసుస్వామి కీర్తించిన కీర్తన ములన్నియును [ప్రాయికముగా కథానుసారముగా గాకున్నను మొత్తమున నన్నియు] వ్రాయబడి యుండును. ఈప్రతులే దేశ మున విశేషభాగ మున్నవి. ఇఁకను రెండవవిధముది సంధాన గ్రంథము. అనఁగా రామదాసుబందిఖానాకథను గేయచరిత్ర ముగా గూర్చునప్పుడు సందర్భానుసారముగా రామదాసుగారి కీర్తనలను జతపఱచుచుఁ, గథసాగుటకై నడుమనడుమ తోహ రాలు భక్తిరసము నుద్బోధింపఁగల కొన్ని ప్రాచీనశతకరాజము లలోని పద్యరత్నములును అచ్చటచ్చటఁ జేర్చి— చేర్చుటకుగాని కూర్చుటకుగాని వీలుగానట్టితక్కినకీర్తనములను వదలివేయుచు, వారికథాఘక్కని కూర్పఁబడినట్టిగ్రంథమనిభావము. దీనిని రచిం చినకవి వరదరామదాసను మహానుభావుఁడు. ఈయన రామ

దాసుగారి తరువాత భద్రాద్రీశ్వరునికి అన్నివిధముల నతని యట్లు కైంకర్యములను జరిగించినవాఁడు, మహోదారుఁడు; భక్తుఁడు;.కంచి యితనిజన్మస్థలము. కాని ఇతనిజీవితములో దాదాపుగనంతయు భద్రాద్రిలోనే గడపినవాఁడు. కేవలమొక్కగడ పుటయేగాక తనకుగలఆభరణాదికమగు సర్వస్వమునుశ్రీభద్రాచలేశ్వరునికి అర్పణముఁజేసిన దాసరత్నము. ఈయన 1574-వ (శాలివాహన) సంవత్సరమునందు కంచినుండి భద్రాద్రికిఁ జేరినట్లును, అప్పటికి, తానీషావారు శ్రీరామదాసునకు ఒసంగిన ఫర్మానాపత్రికారము అతని తరువాతివారు భద్రాచలకైంకర్యాదులను సరిగా జరుపక నిలిపివైచి యున్నందున, ఈయన ఆకార్యభారమును వహించి అప్పటి పరిపాలకుఁడగు నవాబు నాసరుద్దౌలావారికిఁ దానును కొన్నిదివ్యమహిమలను జూపి వెనుక స్వామివారి కిచ్చినఈవులనన్నిటిని మఱల సాగించినారని యును,వినికిడిగలదు. ఇంతమాత్రమేగాక ఇటీవల కీ. శే.పండితవంగూరి సుబ్బారావుగారు ప్రచురించిన శాసనపత్రినిబట్టికూడ నిది ధ్రువపడుచున్నది. * బలవత్తరములగు నితరకారణములు బయల్పడు నంతదనుక దీనిని మనము విశ్వసింపక తప్పదు.

---

* కాని ఇట ఒకవిప్రతిపత్తుకలదు. ఆంగ్లేయ చరిత్రకారులలోను, తురుష్కచరిత్రకారులలోను, రామదాసు బందిఖానాలోనుండి పైకముచెల్లించనందున విడుదలగాక అందే మృతిచెందెనని కొందఱు వ్రాసిరనియును; కారణాంతరమున హైదరాబాదున కేఁగినప్పుడు తాము వ్రాఁతలను చదివించి వింటిమనియును ఉ. వే. శ్రీవిద్యారణ్య పంచానన విక్కిరాల రామచంద్రాచార్యులువారు సెలవిచ్చుచున్నారు. అట్లయిన భద్రాద్రిచలాధీశున

ప్రసకాను ప్రసక్తముగఁ జాలదూరమునకుఁబోయితిమి. ఇఁకను బ్రస్తుతమునకు వత్తము. వరదరామదాసు రచించిన రామదాసు చరిత్రము ననుసరించియే మన యిప్పటి రామదాసు చరిత్రము సంగ్రహారీతిని సంకలనము చేయబడినది.. దీనిని సంకలనము చేసినవారు సింగరిదాసఁట! ఈసింగరిదాసు ఎవ్వరో తెలియదుగాని వ్రాతప్రతులలో హరిభజన సింగరిదాసని యున్నది. ఈవిషయ మితనిగ్రంథమునందే కలదు. చూడుడు.

రామదాసుకథ వరదరామదాస్
 రచియించెను సూచనఁగా
ప్రేమతోఁడ సింగరిదాసీకథ
 ప్రకటనపరిచెను బాగా

కనుక సింగరిదాసు వరదరామదాసుగారి పెద్దదగు రామదాసుచరిత్రను చూచియే తామీకథను వ్రాసియుండె ననుట నిక్కము. కాని ఇందులో 'రచియించెను సూచనగా' అనునీ పదమునుబట్టి వరదరామదాసు గ్రంథమే చిన్నది యనియును; ఈ సింగరదాసు గ్రంథమే విపులమైనదనియును శంకింపరాదు. ఏమనఁగా నుభయుల గ్రంథములనుండి సమానమైన కథాంశములు గలయే ఒక్కఘట్టమును మనము చూచి నను ఈవిషయమునందలి నిజస్థితి మనకు దెలియుటయేగాక, సింగరిదాసుగారి రచనమునందలి నేర్పుకూడ బోధపడగల్గును.

కీసైజాఘువారిప్పటికిట్టి కైంకర్యాదుల చెల్లింపు నవసరమెట్లుకలిగెనను శంక గల్గినది. దానినపనయించుటకే కాబోలు—అది తానీషాగారి కుమార్తె రామదాసునుపలచి ఆమెక్రొత్తమనుచేసి విడిపించెననియును కొందఱువ్రాసిరఁట! ఇందలి సత్యమును చరిత్రజ్ఞులు విమర్శింపఁదగును.

మూడుడు—ఈక్రిందివి వరదరామదాసు చరిత్రలోని గ్రంథ భాగములు.

తోహరా.

సవాబు తానిషా తక్తు జేరియా నగరమేలుచుండా
మక్కువగు దివాను లాతనికి మాన్యులు బహు సజ్జనులు,
అక్కన మాదన్నయు సనియిద్దరు నన్నదమ్ములతి ప్రియులు.

క. అనఘుల గార్యవిధిజ్ఞుల
ననురక్తుల బితృపితామహ క్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులఁగా
నొనరించెను గార్యసంప్రయోగముకొఱకున్.

తోహరా.

ఈతుక్డీలో జేరిన గ్రామము నేలకొండ పలియందూ
ఖ్యాతిగ లింగనమంత్రి వసించెను గాపురముగ నందూ
లింగనమంత్రి వివాహంబయ్యెను మంగళవతి కామాంబ

* * * *

తోహరా.

చనిచూచిరి గోల్కొండ లష్కరున
చయ్యన మంత్రుల గృహము
కనుగొని యిట్లని పల్కెను గోపన
కావలివారలతోడా

గీ. నేలకొండపల్లె నివసించియుండుట
కరుణగలుగు తల్లి కామమాంబ

అమరఁదండ్రి లింగనార్యుఁ డటందురు
నాదుపేరు గోపనయని యండ్రు.

క. మామలు మంత్రులు నాకును
నే మచ్చికఁ జూడ గోరి యిటువచ్చితి మా
మామల కెఱిగింపుం డని
వేమరు వేడెద నటంచు వెస వచ్చి తమన్.

తోహరా.

తెప్పున లేచియు నెదురుగజని తమయప్ప సుతునితోడ
అప్పు డపరిమిత సంతోషంబునఁ గప్పిన మోహముతోడ.
వందనములు చేసిన తమయల్లు నవార్యమైన కృపతోడ
సుందరాంగ రమ్మని యక్కున నరుదందఁ జేర్చి వగతోడ.

ఇఁక నీవిషయము నిట్లుంచి యుంచుక సింగరిదాసు వ్రాసిన కథాభాగమును జిత్తగింపుఁడు.

తోహరా.

శ్రీమించిన నెలకొండపల్లెలో శిష్టజనులు పొగడగను
కామాంబకు గోపన్న జనించెను కమలాక్షుని వరమునను
ఆత్రేయసగోత్రంబున గంచెర్లాంధ్రార్యుల వంశమునన్
పుత్రుఁడగుచు లింగనమంత్రికిఁ దాబుట్టెను గోపన్న యనన్.

హైదరబాదున మేనమామలు అక్కన మాదనగారు
సాప్రతి తానీషాకు మంత్రులై సౌఖ్యముతో నున్నారు.
(44-45)

దీనివలన నిజస్థితి చదువరుల చిత్తమునకు వచ్చియుం డును. అయినచో సింగరిదాసు గ్రంథమున సంగ్రహాము మాత్రమేనా ? మఱేమియు విశేషములు అందులేవా ? యన వచ్చును. లేకపోలేదు. అతఁడు పురవర్ణనము మున్నగు స్థలము లందు (రగడలు మున్నగు వర్ణనలతో) ప్రబంధశయ్యను కొంత వఱకును, హరికథాఫక్కిని కొంతవఱకునుఁ బెంపుచేసియే యు న్నాఁడు. నిజమే: కాని అసలు చరిత్రవిషయమున నాయనచేసిన మార్పుగాని అభివృద్ధిగాని లే దనుటయే మేము చెప్పుచున్నది.

## సింగరిదాసు ఈచరిత్ర నిర్మాణమున నవలంబించిన కొన్నిరీతులు.



సింగరిదాసు హరిభజనపరాయణుఁడు. ఈయన ఈ చరిత్రమును సాధారణముగా హరికథాఫక్కికనే అనుసరించి రచించెను. ఆంధ్రదేశమునందు 15-వ శతాబ్ది చివఱనుండి యును ఆరంభమై 16-వ శతాబ్ది పూర్ణమగు లోపల హరికథా ఫక్కిక చక్కగా వ్యాప్తి నొందినది. అంతకుమునుపు సాధారణ ముగా పామరజనులు యక్షగానములవంటి గేయనాటకములను మాత్రమే ఆడుకొనుచునుఁ బాడుకొనుచు నుండెడివారు. కాని రానురాను అందును పాత్రను లధికమై ప్రదర్శనముల నిచ్చు

సందర్భమున గొంత క్లిష్టత కలుగుటవలన, హానిప్రచారము కొంచెము తగ్గఁజొచ్చినది. దీనికిఁ దోడుగా మన ఆంధ్రదేశము నకు మహారాష్ట్రప్రభుత్వపు రాకతోఁబాటు వారియభిరుచులు గూడఁ బ్రాకసాగినవి. మహారాష్ట్రులలో నామసిద్ధాంతానుయాయులు మెండు. మనయాంధ్రమునఁగూడ రామదాసు చరిత్రమునందు ఈసిద్ధాంతమున కనుగుణముగానే ఇతివృత్తపు కూర్పు గలదు. అయినను వీరు ఆంధ్రులయభిరుచిని మరువ లేదు. ఆంధ్రజాతికి సహజములై ఆ కాలమున వాడుకలో నున్న ఉత్తమోత్తమము లగు నన్నిరకముల గేయములకును తమ సంకలిత గ్రంథమునందు తావు నొసంగియున్నారు. అందునను వరదరామదాసుకంటెను సింగరిదాసు ఈవిషయమున నెక్కుఁడు పరిశ్రమమును చేసియున్నాఁడు.

యక్షగానములందు ఏలలు అర్ధచంద్రికలు చంద్రికలు దరువులు (ఇవి కీర్తనలలో నొకభేదము; కాని రామదాసు కీర్తనలే దరువు లయి పోవుచున్నవి.) చూర్ణికలు సంధిగతము లగు పద్యములు ద్విపదలు తరువోజలు షట్పదులు గీతములు మంగళహారతులు జోలపాటలు హెచ్చరికెలు జంపెలు కురుజంపెలు (జంపెనుండి కొలది మార్పులతోఁ జేసిన మార్పులు గల గేయములు) మొదలగు ననేకములగు గేయచ్ఛందములు కూర్పఁబడియున్నవి. ఇవియన్నియును ఆంధ్రజనసామాన్యము ఎన్నో తరములనుండి ఈనోటనానోట నలవరచుకొని పాడుకొని ఆనందించునట్టి గేయములు. శైవుల మతవిజృంభణ సమయమున వీనికన్నిఁటికి పూర్ణమగు ప్రచార ముండుటయేగాక ఇందు కొన్నికొన్ని గేయఛందస్సులలోనే గ్రంథమంతయును

వ్రాయుటకూడ నుండెడిది. ద్విపదలు రగడలు ప్రత్యేకముగా నిట్టి యుపయోగములకు తరుచుగ వారు వాడిరి. ఇందులకు ఉదాహరణముగా నిప్పటికి మనము ద్విపద కావ్యములను [అనేకముగ నీవాఙ్మయ మభివృద్ధి నెందినది) గంగోత్పత్తి రగడ ఇత్యాదిస్తుతిపరము లగు చిన్న చిన్న కృతులను కాంచగలుదుము. హరికథాగ్రంథకర్తలు జనసామాన్యమునకు గల యీ యభిరుచులను గుర్తించి, ఇందులో కొన్నికొన్ని ఛందములను వదలి, కొన్నిఁటిని మాత్రమే తీసికొని, సందర్భానుసారముగా మార్చుచు వచ్చిరి. మన యీ రామదాసు చరిత్రమునందు గూడ నట్లే కొన్ని ఛందస్సులు మాత్రమే గ్రహింపబడినవి. అవిజంపెలు ద్విపదలు మంగళహారతులు జోలపాటలు హెచ్చరికలు దండకములు మున్నగునవి యని యెఱుంగునది. ఈఛందస్సులలోఁ గూడ చిత్రవిచిత్రములగు కవితాపరిణామములు ప్రదర్శించుచు వచ్చినాఁడు ఈకవి. ఒక్క యుదాహరణమును చిత్తగింపుడు- ఈ రామదాసు చరిత్రలోనే కైంకర్యము చేసెను (పేజి) అను కీర్తనముఁ జూడుడు. అందులో పల్లవి చరణము మాత్రము దరువులో నుండును. తక్కిన చరణములు ముగియగనే ఒక్క మాటుగా ద్రుతగతితో పల్లవిలోనికి గేయము పర్వులిడుచుండును. కాని శ్రోతలు తన్మయావస్థలో నుందురు. గనుక, ఈవి భేదమును వెనువెంటనే గుర్తింపజాలకుందురు. మఱియొక దానినిగూడఁ జిత్తగింపుఁడు. వందేరఘురామ శుభనామ (63 పేజి) అని యొకకీర్తనమున్నది. ఇందులో మూర్ఛికలను చరణమునందు గూర్చి పల్లవిలోనికి వచ్చునప్పటికి మఱల దరువులోఁ గలపి వైచుట చిత్రముగాఁ గాన్పించును.

ఈగ్రంథమునందునుఁ దక్కినహరికథాగ్రంథములందు వలెనే కథాంశమును వివరింపవలసివచ్చినప్పుడు ప్రాయిక ముగా ద్విపదలలోను, తోహరాలలోను, కొన్ని యెడల వచన ములలోను, సంధిగతములగు విషయములు వర్ణింపబడుచునుం డును. ద్విపదలును వచనములును మనమెఱింగినవే గనుక వాటినిగుఱించి ఆట్టె వ్రాయనక్కఱ లేదు. కాని తోహరాలను గుఱించిమాత్రము ఒక్కవిషయమును చెప్పక తప్పదు. ఈ తోహరాలు మనభాషకు అప్పటికిఁ గ్రొత్తవి. అనఁగా సామా న్యదృష్టికి ఏవో విచిత్రవృత్తములుగాఁ గన్పట్టినవి. కాని ఇవి క్రొత్తవెంత మాత్రమును కావు. రగడలమీద నేర్పరచిన పరి ణామమేయగును. చూడుడు.

గోపన నప్పుడు బందిఖానకు కొనిపోవుటఁ జూచి
యాపట్టణమున నందఱు వగచిరి యను తాపముమదిఁదలఁచి
పోవుచుండ బ్రజలెల్లరు పురపుర బొక్కుచు దమమదిగుంది
దేవుని రాముని దూరుచునుండిరి దీనతతో వగఁజెంది

ఈ తోహరా చరణములలో ఒక్కొక్కదానిలోను యతివఱకుగల భాగములను ప్రత్యేకించినచో రగడలు అగును. చూడుడు—వెనుకటి తోహరానే! రగడగా మాఱుచున్నది.

గోపన నప్పుడు బందిఖానకు
యాపట్టణమున నందఱు వగచిరి
పోవుచుండఁ బ్రజలెల్లరు పురపుర
దేవుని రాముని దూరుచు నుండిరి.                [ఇత్యాది]

కనుక తోహారా మనకుఁ గ్రొత్తసృష్టికాదు.ఉన్న గేయములలో చేసినసంస్కరణము మాత్రమే. ఇట్లే ఈచరిత్రలో దాదాపు [50] ఏబదిరకముల దరువులు మనప్రాచీన గేయములగు ద్విపదలనుండియు రగడలనుండియును చూర్ణికలనుండియును గ్రహింపఁబడి విచిత్రసంస్కారములతోఁ గ్రొత్తరూపునఁ జెలగుచు మనకానందమునుఁ గూర్చుచున్నవి. ఈవిషయమును మఱొక్కమాఱు విస్తారముగా చర్చించెదము. కావున నిట నింతతో విరమింతుము.

—★{ రామదాసు చరిత్రమున నుద్ధరింపఁబడిన
గ్రంథకర్తల కృతులను గూర్చి }

సాధారణముగా హరిదాసులై హరికథలను చెప్పునప్పుడు నడుమనడుమఁ బ్రసక్తానుప్రసక్తముగ నితరగ్రంథములలోనుండియును, ఇతర గ్రంథకర్తల కృతులలోనుండియును ఆయా గ్రంథభాగములను ఉద్ధరించి కీర్తనసేయుచు శ్రోతలను హరికథాశ్రవణతత్పరులను జేయుచుండుట సంప్రదాయము. ఈ సంప్రదాయ మిప్పుడు పిట్టకతలను చెప్పుటగాను ఋతుపురాణములను చెప్పుటగాను, అపహాస్యపు ప్రసంగములు చేయుటగాను మారిపోయినప్పటికిని, మనప్రాచీనకాలమున మాత్రము సుప్రసిద్ధులై ఆయావిషయములందు నిష్ణాతులై, ప్రజలయును ప్రభువులయును గౌరవాదరములకుఁ బాత్రులైన కవులు గ్రంథ

కర్తలు మహాత్ములు హరిదాసులు విరాగులు మున్నగువారి సుభాషితములను శ్రోతలకు వినిపించి శ్రోతలకు భగవద్భక్తి కలుగునట్లులుగా అప్పటి హరిదాసులు చేయుచుండెడివారు. కనుకనే హరిదాసగత్నము అగు సింగరిదాసుగారు కూడ ఈ చరిత్రమునందు తనకు పూర్వులైన నారాయణతీర్థులు విట్టలదాసు ముకుందమాలగ్రంథకర్త యగుకులశేఖరాళ్వారు మున్నగు హరిభక్తిపరాయణులగు పెద్దల గ్రంథములనుండి గేయములనును, మానసబోధశతకము, జానకీపతిశతకము ఆర్తరక్షామణిశతకము భావనారాయణశతకము దాశరథి శతకము మొదలగు పద్యగ్రంథములనుండియును, అనేక పద్యములను గేయములను ఇందు ఉద్ధరించి యున్నాఁడు. ఇట్లుద్ధరించుటం జేసి ఆయనకు అట్టివారి కృతులయెడఁ గలగౌరవమును, ఆకాలపు ప్రజల యభిమానాదర నిదర్శనములును వెల్లడి యగునే కాని వేఱొండుకాదు.

ఈవిధముగా మన యీ సింగరిదాసు ఉద్ధరించిన గేయ కవులలో, నారాయణతీర్థులు గొప్పపండితుఁడు. ఈయనజీవితమును గుఱించిన విశేషములను నాలైదేండ్ల క్రిందట బ్రహ్మశ్రీ పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రులుగారు గ్రంథాలయ సర్వస్వములో తీర్థులవారి ప్రతికృతితోఁగూడ సేకరించి ప్రకటించినారు. ఇటీవల బ్రహ్మశ్రీ వేఁటూరి ప్రభాకరశాస్త్రులుగారును దీనినే భారతిలో సవిశేషముగఁ బ్రకటించినారు.

ఈరామదాసు చరిత్రమునందు సింగరిదాసు ఉద్ధరించిన పద్యములకు మూలము లగుశతకములలో మానసబోధ శతకము ఇప్పుడును దొరకుచున్నది. జానకీపతిశతకము అసంపూర్ణముగాఁ దప్ప పూర్ణముగా లభించుటలేదు. ఆర్తరక్షామణి శతకముగూడ నట్టులనే! దాశరథిశతకము ఈ గోపన్నగారు రచించినదే. భావనారాయణశతకము అసలే కన్పడుట లేదు. బహుశఃగి లుప్తములయి పోయినదేమో! ఈశతకములను గుఱించియును, ఇంకలిగ్రంథభాగములు ఈ రామదాసుచరిత్రము నందు ఏ యేవిధముగాఁ బొందుపరుపఁబడినవియును, మున్నగు నంశములను గుఱించియును చెప్పవలసినది చాల గలదు. గ్రంథవిస్తర భీతిచేతను, ఈవిషయమును మఱొకమారు చర్చింపదలఁచియు నుండుటచేతను ప్రస్తుతము ఈ విషయము నింతతో ముగించెదము:

—★ ప్రస్తుత ముద్రణమును గూర్చిన ప్రశంస. ★—

ఈరామదాసు చరిత్రమును ఈచెన్నపురిలో ననేకులు అనేకమార్లు ఇదివఱకే ముద్రించియును ముద్రించుచు నున్నారు. మేమును ఇంతకుముందు చాల పర్యాయములు ముద్రించియుంటిమి. ఆముద్రణములలో బజారుప్రతులందుగల స్ఖాలిత్యములను తొలఁగించి మంచికాగితములపైని మాకువీలున్నంత వఱకును చక్కఁగా ముద్రించుచునే వచ్చితిమి. కాని కీర్తనల రాగముల విషయములలోఁ దారుమార్లుగలయట్లు మామిత్రు లనేకులు హెచ్చరించి యుండిరి. ఇందులకై మేమీముద్రణమున

వ్రాతప్రతులతో సంపాదించి వానిరీతిని కొన్ని రాగముల మార్పాటులను సవరించితిమి. అయినను మాకు తృప్తి పూర్తి గాలేదు. రామదాసుకీర్తనలు ప్రాచీనసంప్రదాయముల నెఱిఁగినగాయకులు, ఎవ్వరైనను లభించినచో, నింకను సంస్కరింప వలయునని కోరికగలదు. దానిని సాధ్య మైనంతత్వరలో నొనర్తుము.

చదువరులకు-సంగీతధోరణి- అంతగా లేకున్నను, కీర్తనలు పాడుకొనుటకు వీలుగా నుండుటకై ఈముద్రణములో గేయములకు పల్లవి అనుపల్లవి చరణములు విడివిడిగా నుండి అనురంజనము గల్గించురీతిగా నిందు పాదములు విడఁగొట్టబడి కూర్పఁబడి యున్నవి. దీనివలనఁ జదువరులకు ఈకీర్తనముల పఠించుటలో మంచి అనుకూల మేర్పడునని మావిశ్వాసము. రాగల ముద్రణములలో నింకను సౌకర్యములు గల్గింతుము.

మఱియును ఈగ్రంథమునందు వచ్చెడి కీర్తనలకును పద్యములకు ననుబంధమునందు అకారాదిగ ననుక్రమణికలను చేర్చినాము. దీనివలన కీర్తనలు మున్నగువానిని సంపాదించుటలో చదువరులకు మంచి సదుపాయము ఏర్పడునని నమ్మెదము. మఱియును ఇట్టి మాయుద్యమమునకు ఆంధ్రదేశమునందలి మాన్యగణము తగినప్రోత్సాహము నీయగలదనియును, మాయీచేసిన అల్పమగు సేవచే నాంధ్రవాగ్దేవి సంతసించుగాత యనియును నాసించెదము. మఱియు నీగ్రంథమునకు విజ్ఞానపూర్ణమగు పీఠికను వ్రాసి తమయమూల్యమగు కాలమును వినియోగించి, తోడ్పడిన ఆత్మవిదులగు బ్రహ్మశ్రీ పంచాగ్నుల

దక్షిణామూర్తి శాస్త్రులు వారికిని దాము అమూల్యముగా నేకరించి యుంచికొన్న తమ రామదాసుచరిత్రప్రతిని మాప్రతితో సమీకరించుకొనుటకై దయతో నొసంగిన శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారికిని, తమతాలూకు అక్కన్న మాదన్నల ఫ్లాకులను గ్రామాంతరమం దున్నను మాకై శ్రమవహించి తెప్పించి యిచ్చి, మాయీముద్రణమునకు మఱింత వన్నె నేకూర్చిన శ్రీ శ్రీ దేశోద్ధారకులు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారికిని, పరశ్శతములుగ మాకృతజ్ఞతాభివందనముల నర్పించెదము.

ఇట్లు బుధవిధేయులు,

చెన్నపురి.
క్రోధన విజయదశమి.

ఆర్. వేంకటేశ్వర్ అండు కంపెనీవారు.
గ్రంథప్రకాశకులు.

# రామదాసుచరిత్రము.

## విషయసూచిక.

# పటముల పట్టిక.



శ్రీ భద్రాచలమునందలి శ్రీరాములవారి దివ్యాలయము.



శ్రీ ర స్తు.

శ్రీరామచన్ద్ర పరబ్రహ్మణే నమః.

# రా మ దా సు చ రి త్ర ము.

## శ్రీ భద్రాచలమాహాత్మ్యము

శ్లో. శ్రీరామం జనకాత్మజాకుచతటీశ్రీగంథపంకోల్లస
ద్వక్షోవీథి ముదార మాశ్రితమునిప్రాదుర్భవత్కల్పకమ్।
బ్రహ్మేశానముఖామరస్తుత మజం బ్రహ్మాండభాండాధిపం
వందే కోసలకన్యకానుత మహం వారాశిగర్వాపహమ్॥

శ్రీమద్భగవద్భక్తాగ్రగణ్యుం డగుభద్రాచలరామదాసు చరిత్రంబునకు మొదట శ్రీబ్రహ్మాండ పురాణస్థ గౌతమీమాహాత్మ్యంబునందు వివరించినప్రకారంబున సంక్షేపరూపంబుగాఁ దెలుపునట్టి భద్రాద్రిక్షేత్రమాహాత్మ్యం బెట్టి దనిన:—

సకలపురాణకథాశ్రవణకుతూహలాయత్తచిత్తులగు శౌనకాదిమునీంద్రులు పౌరాణికశ్రేష్ఠుండగుసూతునవలోకించి, యో మహాత్మా! సకలజనులకుఁ బ్రీతికరంబై యుండునట్టి యొక్క పుణ్యకథఁ దెలుపుమని యడిగిన నతండు సభ్యులంజూచి, మునీంద్రులారా! వినుం డీభూలోకంబున దండకారణ్యమధ్యంబున గోదావరీతీరంబున శ్రీరామక్షేత్రమున జననమరణవ్యాధిబాధాపీడితు లగునరుల కమృతపదం బొసంగుటకై తారకనామం డగుశ్రీరాముండు సీతాలక్ష్మణసమేతంబుగా వేంచేసియుండునట్టి

భద్రాచలం బనుపర్వతశ్రేష్ఠంబొకటి గలదు.అది పుణ్యప్రదంబు ను సేవకనికరాభీష్టప్రదంబును గాన నాక్షేత్రమహిమ నిట్టి దని యొఱింగి వక్కాణింప బ్రహ్మదేవునికైన శక్యంబు గాదు.ఐనను నానేర్చుకొలంది఼ దెలిపెద. సావధానచిత్తులరై వినుండని పలికి సూతుండు మరల వారల నాలోకించి, పూర్వకాలంబునందు సర్వపర్వతంబులకు నధిపతి యగుమేరుపర్వతంబు తనభార్య యగుమేనకాదేవితోడం గూడి పుత్రార్థియై బ్రహ్మదేవు నుద్దే శించి బహుకాలంబు వానగాలియెండలవలన఼ గలిగెడిశ్రమకు నోర్చి యత్యుగ్రం బగుతపంబు సలుపుటయు నప్పరమేష్ఠి య క్కేరు వొనర్చెడితపంబునకు మెచ్చి ప్రత్యక్షంబై నీకిష్టంబగు వరంబు గోరు మిచ్చెద ననవుడు నప్పర్వతశ్రేష్ఠం బాచతుర్ము ఖుని ననేకప్రకారంబులం బ్రార్థించి, దేవా! నాకు శ్రీరామ ధ్యానపరాయణుం డగుసుపుత్త్రుండు గలుగున ట్లనుగ్రహించి రక్షింపు మనినం గరుణించి బ్రహ్మదేవుం డవ్వరం బతని కిచ్చి యంతర్ధానంబు నొందెను.

తదనంతరంబునం గొంతకాలంబునకు మేరువునకు బ్రహ్మాను గ్రహప్రకారంబున మేనకాదేవివలన భద్రుం డనుపుత్త్రుండు పుట్టె నాభద్రుండు రామానుగ్రహంబు వడసి యాదేవునకు నివాసం బయ్యె. దీనికి మూలకారణం బగుపురాతనకథ యొ కటికలదు; తత్ప్రకారం బెట్టు లనిన:—

పూర్వకాలమునందు దశరథకుమారుం డైనశ్రీరామచం ద్రుండు తండ్రియాజ్ఞాప్రకారంబున వనవాసంబు సేయం జని దండకారణ్యంబు఼ బ్రవేశించి యయ్యరణ్యమునం దిరుగుచుండు కాలంబున నొక్కనాఁడు సీతాలక్ష్మణసమేతుండై పోవుచునొక

చోటువిశాలంబును నతినిర్మలంబు నై నొప్పుశిలనుజూచిమార్గా
యాసంబుపోఁగొట్టుకొనుటకై యాపాషాణంబుపయిం గూర్చుం
డి యందువలనఁ గలిగినసౌఖ్యాతిశయమునకానందించి యాశి
లను జూచి నీవు మాకిచ్చుట సంప్రాప్తం బైనమార్గాయాస
మును బాపితివి గావున, నీవీసుకృతవిశేషంబునం జేసి చిరకాలం
బునకు మేరుపర్వతమునకుం దద్భార్యయగు మేనకాదేవివలనఁ
బుత్త్రుండవై జన్మించి శైలరూపధారివై మా కత్యంతప్రియ
భక్తుండవు కాఁగల వని యానతిచ్చి యథేచ్ఛం జనియె. తర్వా
త నాపాషాణంబు జడస్వరూపం బయ్యును శ్రీరామప్రసాదం
బువలన జ్ఞానవంతం బై కొంతకాలంబునకు మేరుగిరికిం గుమా
రుండై పూర్వజన్మజ్ఞానము గలిగి తొల్లి సీతావల్లభుం డానతి
చ్చినవాక్యంబులం దలంచి భక్తపరాధీనుండును లోకనాయకుం
డును నగుశ్రీరామదేవుని నత్యంతభయభక్తియుక్తుండై ధ్యానిం
చుచు బహుసహస్రవర్షంబులు మహత్తరం బగుతపంబు చేసిన,
దయానిధి యగుశ్రీమన్నారాయణుండు శ్రీవైకుంఠంబున లక్ష్మీ
సమేతుం డై సనకసనందనాదినిత్యసూరులు పరివేష్టించి కొలువ
శేషశాయియై లీలావినోదంబులం దేలుచుండియు భక్తవత్స
లుండు గావున నిజభక్తుం డగుభద్రునిం గడతేర్చి రక్షింపం
గోరి శ్రీరామభద్రరూపంబు ధరించి శ్రీదేవియు నాదిశేషుం
డును సీతాలక్ష్మణు లై వెంట నంటి రాఁగా ధనుర్బాణములు
నమ్ములపొదియును జేకొని భద్రుండు తపోనిష్ఠుం డై యున్న
చోటి కరిగి యతనితో నీతపంబునకు మెచ్చితి వరంబు లడుగు
మిచ్చెద నని యానతిచ్చిన రామచంద్రునిగంభీరవాక్యములు
విని భద్రుండు కనులు దెఱచి తన కెదుట నీలమేఘచ్ఛాయగల

దేహంబుతోఁ గోటిమన్మథాకారుండై నీలమేఘమధ్యంబునఁ దళతళ మెఱయునట్టి మెఱుముపోలికఁ దనప్రక్క జానకీదేవి నిలువఁగా, స్వర్ణవర్ణశరీరుండును సర్వభూషణాలంకృతుండునగు లక్ష్మణుండును ధనుర్బాణంబులు కరంబులం బట్టి తనకెదుట నిలువ,జగన్మోహనుండును రత్నభూషణకిరీటాంగదహారహారా ద్యాభరణంబులు ధరియించి సాక్షాత్కరించినసీతాపతిం జూచి, నిజస్వామిఁగా నెఱింగి భయంబును హర్షంబును మనంబునఁ బెనఁగొనఁ గనుఁగొనల నానందబాష్పంబులు గురియఁ బుల కాంచితశరీరుండై భద్రుండు రామభద్రునకు సాష్టాంగదండ ప్రణామంబు చేసి కరంబులు ముకుళించి, స్వామీ! శంఖచక్ర గదాపద్మశార్ఙ్గాద్యాయుధంబులు ధరించి సమస్తలోకంబు లకును శుభములిచ్చుచు దయామూర్తివై నాబోఁటిదీనులకు మోక్షం బిచ్చి రక్షించుచు ననంతకోటిసూర్యప్రకాశతేజో మూర్తివై ప్రకాశించు చుండెడి నీకు నమస్కరించెద. నన్ను జడుం డనియును మూఢుం డనియును బరిహరింపక యనుగ్ర హించి మెచ్చి వరం బడుగు మిచ్చెద నని యానతిచ్చితిరి. బ్రహ్మరుద్రేంద్రాదులకయిన గన్పడనిమిమ్ముం గాంచి మీవలన ననుగ్రహింపఁబడితిని గావున నాకింతకంటె నెక్కుడువరంబు కోరుటకుఁ దోఁపలేదు; కాఁబట్టి జానకీలక్ష్మణసమేతంబు గా నాశిరంబున నివసించి యుండునట్టివరం బిచ్చి రక్షింపఁగోరుచు న్నవాఁడ నని మఱియును బ్రార్థించు చున్నభద్రునియందు దయగలవాఁడై రామచంద్రుండు "భద్రుఁడా!నీవు కోరినవరం బిచ్చితి. చంద్రసూర్యులును నక్షత్రంబులును భూమ్యాకాశం బులు నుండుపర్యంతంబును నన్ను మస్తకంబున ధరియించి

నాకు సేవఁ జేయునట్టి వారికి సకలసౌఖ్యంబులును గలుగఁజేయు
చు మిగులఁ బ్రసిద్ధుండవై పర్వతస్వరూపంబున నుండుము.
కల్పాంతంబున నాయనుగ్రహంబువలన నీజడస్వరూపంబువిడిచి
నిర్మలజ్ఞానసంపన్నుండ వై మత్పదం బగువైకుంఠంబుఁ జేరి
సుఖింతువు. నేఁడు మొద లెవ్వరేనియుఁ బ్రీతిపూర్వకంబుగా
నిన్నుఁ జూచిరేనియు నన్ను మస్తకంబున ధరియించియుండెడు
నీకు భానువారంబున స్నానానుష్ఠానంబులు సలిపి శక్తియుక్తులై
మూఁడుప్రదక్షిణంబులు చేసిరేనియు నిర్మలజ్ఞానసంపన్నులై
మదీయనివాసంబుఁ జేరి సుఖింతు రని మఱియు నగస్త్యోక్త
ప్రకారంబున నాకుఁ బ్రియంబగుసీతారామోత్సవంబు సలిపి
రేనియు నియమయుక్తులై యజ్ఞతపోదానాదు లొనర్చిరేని
యు సంతోషచిత్తులై యథావిధి నన్నదానంబు చేసిరేనియు
నట్టివా రాయురారోగ్యైశ్వర్యసంపన్ను లయి యంత్యకాలం
బున నన్నుఁ గాంచి సుఖింతురు. ఇంతియకాక పూర్వకాలంబు
నందు భగీరథుం డాకాశగంగను భూలోకంబునకుఁ గొనివచ్చిన
చందంబున గౌతమమహామునీంద్రుండు సహ్యామలయాచల
మధ్యంబునందుండి జగత్పావని యగుగోదావరినదిం దోడుకొ
ని రాఁగలండు; కావున నానది నీనికటంబున గౌతమి యనుపే
రం బ్రవహించుచు నిజసలిలధౌతదేహు లగుజనులకు సకలపా
పంబులం బోవునట్లు సేయుచుండుం గావున నానదియే విరజా
నది యనియును నేను నివసించి యుండెడి నీశిరఃప్రదేశంబే వై
కుంఠం బనియునుం దలఁచి యెవ్వ రిందు వసియించియుందురో
వారుపూర్వజన్మంబునం జేసినపాపంబులంబాసి పుత్త్రపౌత్త్రాభి
వృద్ధి గలిగి సమస్తసంపదలతో నిహంబున నెల్లభోగంబుల నను

భవించి యంత్యంబున మన్నిలయం బగునై కుంతంబున వసింతురు. అనియివ్విధంబున శ్రీరామభద్రుండు భద్రునితో నానతిచ్చి తదీయమస్తకంబున నివసించెఁ గావున నాదినము మొదలుభూలోకంబునఁ గలజనంబులకు సేవ్యంబై కలియుగనై కుంతంబనం బ్రసిద్ధంబై శ్రీరామచంద్రమాహాత్మ్యప్రాప్తివిశేషంబువలన భద్రాద్రియనునామధేయంబున శుభస్వరూపంబై వెలింగెం గావున నిప్పుడీలోకంబున నెవ్వరేని మేలుగోరునట్టివారు భద్రాచలంబున శ్రీరామనవమినాఁడు దేవాదిదేవుండై భక్తుల కభయం బిచ్చి రక్షించుచుండెడిశ్రీరామదేవుని దర్శించి తులసీదళపుష్పగంధాక్షతలచే నాదేవునిపాదారవిందంబు లర్చించిరామకీర్తనంబులు పాడుచు నారాత్రి జాగరణంబు సలిపిరేని శ్రీరామమాహాత్మ్యంబు నొందుదురు. నవమినాఁడు వసించి మఱునాఁడు పారణంబు సేయునపుడు బ్రాహ్మణులకుఁ బ్రియపూర్వకంబు గా భోజనంబుఁబెట్టిరేని గంగాతీరంబునను దివ్యక్షేత్రంబునను సహస్రబ్రాహ్మణసంతర్పణంబుఁ జేసినఫలంబు నొంది సప్తజన్మంబులం జేసినస్వర్ణస్తేయగురుసతీసంగను బ్రహ్మహత్యాదిమహాపాతకంబులెల్ల నశించి ముక్తు లగుదురు. మఱియు నాభద్రాచలంబుచుట్టును రెండుకోసులదూరంబునకు లోపలఁ త్రైలోక్యప్రశస్తంబులగుపుణ్యతీర్థంబు లన్నియు శ్రీరామాజ్ఞవలన సన్నిహితంబులై యుండును గావున నచ్చట మూఁడు రాత్రులు నివసించిననరులు శాశ్వతసుఖప్రాప్తి నొందుదురు. అది యెట్లు లనినఁ దొల్లి త్రిలోకసంచారి యగునారదుండు బ్రహ్మదేవునివలన నీక్షేత్రమాహాత్మ్యమువిని యారాఘవక్షేత్రంబునకు వచ్చి గోదావరీతటంబున రామకథాగానంబు

సేయుచు బహుకాలంబు నివసించి పిదప దేవలోకంబునకుం జనియెను.

కాఁబట్టి యీభద్రాద్రిమహిమంబు సవిస్తరంబుగా వర్ణించ సహస్రదివ్యసంవత్సరంబు లైనను జాలవు; గాన నాశక్తి కొలందిని సంక్షేపరూపంబుగా మీకుం దెలిపితి నిదిగాక మఱియు నొక్కవిశేషంబు గలదు వినుండు. ఈభద్రశైలంబున కాగ్నేయభాగంబున రెండుక్రోసులదూరంబునందు గోదావరీ గర్భంబున శేషేశ్వరం బనియు,ఊష్మకుండంబనియు నున్న యవి. వానిమాహాత్మ్యంబెట్టిదనిన, పూర్వకాలమునందు సర్వములకుఁ బ్రభు వైన శేషుఁడు నాగలోకమునకుఁ బ్రభువై యున్న కాలంబునఁ గ్రూరులగు రాక్షసులుకొందఱు రసాతలంబునకుఁ బోయి యానాగలోకంబు నాక్రమింపఁగా నారాక్షసులతోఁబోరాడఁ జాలకబ్రహ్మలోకంబునకుఁ బోయి బ్రహ్మతోఁ దనకు రాక్షసుల వలనఁ గలిగినపోరాట నెఱింగించెను. అప్పు డాబ్రహ్మదేవుఁడు శేషునిం జూచి నీవు భూలోకంబునకుం జని భద్రాచలనికటంబున గౌతమీతీరంబున మహేశ్వరధ్యానతత్పరుండవై తపము సలుపుము. నీకుఁ గార్యసిద్ధియగునని పలికిన, శేషుండునుదత్ప్రకారమున భూలోకంబునకు వచ్చి గౌతమీతీరముఁ జేరి యందొక్కప్రదేశంబున శివప్రతిష్ఠగావించి, యద్దేవు నుద్దేశించి జపతపములు నియమపూర్వముగాఁ జేయుచు నొక్కయగ్నికుండమునుం గావించి యందభిచారహోమము చేసినంత, భక్తసులభుం డగు కాలకంఠుం డతనినియమకృత్యంబునకు మెచ్చి ప్రసన్నుండై సర్వశత్రువినాశకమును నప్రతిహతము నగు నొక్కశూలం బొసంగి దీనివలన నీకుఁగీడు సేయుచుండెడి రాక్ష

నులం జయించి నిజపదం బేలుకొను మని యానతిచ్చెను; నా గేంద్రుండు సంతసించి యమ్మహాదేవు ననేక ప్రకారంబులం బ్రస్తుతించి యందుండి రసాతలమునకుఁ జని శివదత్తంబగుశూ లంబుచే శత్రులనెల్లం బరిమార్చి రాజ్యసుఖములనుభవించుచు స్వజనపోషకుండై యుండెను. శేషుండు పాతాళంబున నుండి భూలోకమునకు వచ్చి గౌతమీనదీతీరంబున నిజాభీష్టసిద్ధి నొంది చనియె. ఆకాలంబున శేషుండు భూలోకంబుననుండి నాగలో కంబునకుంబోయిన బిలద్వారంబున భోగవతీనదీజలంబులు గౌ తమీనదీప్రవాహంబునం గలిసెఁ గావున, నాచోటు రసాతల గంగాసంగమంబనం బ్రసిద్ధినొందెను. తదాదిగా శేషునివలనఁ బ్రతిష్ఠింపబడిన దగుటవలన నాశివక్షేత్రంబు శేషేశ్వరస్థానం బనియు నా శేషుం డభిచారహోమంబు గావించినగుండంబు మహాగ్నిజ్వాలాసహితమై యందలిజలం బుష్ణంబుగనుండుటం జేసి ఊష్మకుండం బనియును విఖ్యాతంబయ్యె. ఇవ్విధంబున శేషేశ్వరుండును, ఊష్మకుండంబును, రసాతలగంగాసంగమం బును, శేషునివలనం బ్రవర్తిల్లుటంజేసి యాతీర్థంబు శేషతీర్థం బనదనరిసర్వజన మనోభీష్టదాయకంబుగఁ బ్రవర్తిల్లుచుండును. కావున మానవులెవరేనియు నీతీర్థంబునభక్తియుక్తులై స్నానం బును దానంబును జపంబునుం దమశక్తికొలందిచేసిరేని వార లకు ముక్తి కరతలామలకంబుగ నుండును. ఇట్లు చేయనోపని వారలు త్రికరణశుద్ధి కలిగి యీభద్రాద్రిమహిమయును శేషే శ్వరప్రభావంబును రసాతలగంగాసంగమప్రకారంబును విని యానందించినను మనంబునం దలంచినను నిజాభీష్టసిద్ధి గలిగి యంతంబునశ్రీరామపాదారవిందపరాయణులైవైకుంఠప్రాప్తిని

కెంది కైవల్యసుఖంబులనుభవింపఁగలరని బ్రహ్మాండపురాణోక్త ప్రకారంబుగా సూతుండు శౌనకాదిమునీంద్రులకుం జెప్పెను.

ఇది శ్రీమద్భద్రాచలమాహాత్మ్యము సంపూర్ణము.

## రామదాసు భద్రాద్రిరామునికైంకర్యము చేయుటకుఁ గారణము.

భద్రాచలసమీపంబున నొక గ్రామంబున తమ్మల-దమ్మక్క యనునొకభక్తురాలు తనకొమార్తతోఁ గూడ నివసించియుండఁగా శ్రీరామచంద్రుం డాదమ్మక్కయొక్క మనశ్శుద్ధినెఱిఁగి యొకనాఁటిరాత్రికాలంబున నామె నిద్రించుచుండ నామెస్వప్నంబునం గనంబడి, యోభక్తురాలా! నేను భద్రగిరిశిఖరమునం దుండెడి శ్రీరాముఁడను; నీవు మిక్కిలిభగవద్భ్రాహ్మణభక్తి గలిగినదానవు; కాఁబట్టి నాకుఁ బూజచేసి నే నీపర్వతమునందుండెడుసమాచారము సమస్తజనులకునుఁ దెలియఁబఱిచి నాకు నిత్యోత్సవాదులు జరుగునట్లుగాఁ జేయుచుంటి వేని కొన్ని దినంబులలో నాప్రియభక్తుం డైనవాఁ డొకఁ డీగ్రామాధికారియై రాఁగలఁ డతండు నాకుఁ గోవెలగోపురప్రాకారములు కట్టించును.అంతవఱకు నన్నుఁబూజించుచుంటి వేని నీకు గైవల్యప్రాప్తి యగు నని చెప్పి యంతర్థాన మొందెను. అంతట నాదమ్మక్క నిద్రఁ దెలిసి తెల్లవాఱఁగాఁ దనకొమార్తను పిలిచి తనస్వప్నవృత్తాంతమును జెప్పి తరువాత నూరిలో నుండెడుజనులకందఱికిని తెలియఁబఱచిగ్రామస్థులును దానును నాటిమధ్యాహ్నమునకుభద్రాచలశిఖరము నెక్కి యచ్చట ... జెట్టుతీఁగెలు మొదలయినవానిచేతఁగప్పఁబడియుండెడు సీతారామలక్ష్మణవిగ్రహములను జూచి సంప్రీతుఁడాది సమ

ములను జేయించి పూజించియదియాదిగా నిత్యము నాగ్రామా
ధికారి యగుభద్రరెడ్డి యనువాఁడువానిమూలముగా నైవేద్య
ద్రవ్యములను గొంతజనమును గొండయెక్కిపోవునపుడువచ్చు
నపుడు సహాయముగా నుండుటకొఱకు రప్పించుకొని తనశక్తికొ
లఁదిని జిన్నమండపమును గట్టించి యందులోస్వామినిబ్రతిష్ఠ
చేసి యాగ్రామస్థులసహాయమువలన మహోత్సవము పెద
లైనవి సేయించుచుండె. ఇట్లుండఁగా నెలకొండపల్లెవాస్తవ్యుఁ
డయినగోపన్న జననాదిగా సద్వృత్తియందుండువాడుకాఁబట్టి
భాగవతాది పురాణకథలు వినునప్పుడు బ్రహ్మాండపురాణమునం
దు గౌతమీమాహాత్మ్యమును భద్రాచలప్రభావంబును విని
భద్రాద్రికింజని శ్రీరాముని సేవించి రామభజనసేయుచుండు
నట్టిభాగ్యం బెన్నఁటికొనగూడునో యని తలంచుచుండ నొక
దినంబున స్వప్నంబున శ్రీరాముండు పూర్వము తమ్మల దమ్మక్క
కుఁ బ్రత్యక్షమైనట్టుగానే గోపన్నగారికిని బ్రత్యక్షమై నీకు
భద్రాద్రితాలూకాతహస్సీలుదారుపని కాగలదు. కాఁబట్టినీ
వీక్షణమందే బయలుదేఱి గోలకొండపట్టణమునకుఁబోయి తానీ
షాను జూడు మనఁగా నతఁడదరిపడి లేచి రాముఁడు తనకు
సాక్షాత్కరించిచెప్పినవాక్యములను దన మిత్రబాంధవులతోఁ
జెప్పి యాదినమే బయలుదేఱి గోలకొండకుఁబోయి తానీషాగా
రివల్ల ఫరమానా తీసికొని భద్రాద్రికివచ్చి సర్కారుద్రవ్యమని
మనమున నెంచక ద్రవ్యమును వ్యయపఱచికోవెలగోపురప్రాకా
రాదికైంకర్యములును బ్రాహ్మణసంతర్పణంబునుం జేసి తరువాత
వచ్చినబాధలకునోర్చి రామునియనుగ్రహంబునఁ బరమపదప్రా
ప్తినిఁ బొందినవాఁడాయెను.



శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# రామదాసుచరిత్రము.

## శ్రీతారకనామస్తుతి.

శ్లో॥ శ్రీమద్దివ్యమునీన్ద్రచిత్తనిలయం సీతామనోనాయకం
వల్మీకోద్భవవాక్పయోధిశశినం స్మేరాననం చిన్మయమ్।
నిత్యం నీరదనీలకాయ మమలం నిర్వాణసంధాయినం
శాంతం నిత్య మనామయం శివకరం శ్రీరామచన్ద్రం భజే॥

## త్రిమూర్తిస్తుతి.

ఉ. శ్రీకరలీలఁ బ్రాణుల సృజింపఁ దలంచి విధాత తానయై
చేకొని వానిఁ బ్రోచునెడ శ్రీవిభుఁడై యవి సంహరింప భీ
మాకృతిదాల్చి మువ్వురకు నవ్వలనొక్కటియై వెలుంగుసు
శ్లోకుఁ బురాణపుణ్యపురుషుం బరమాత్ముని భక్తిఁ గొల్చెదన్.

## త్రిశక్తిస్తుతి.

ఉ. శ్రీయన విష్ణు పేరురము చెన్ను వహించి యలంకరించి దా
క్షాయణినాఁగ శంభు మెయి సామున నెక్కొని వాణినాఁగ నా
తోయజగర్భు నెమ్మొగము దూఁకొని యేలెడు నాదిశక్తి ను
శ్రీయుఁ జిరాయువుం సరససిద్ధకవిత్వము మాకు నీవుతన్.

## వినాయకస్తుతి.

క. ఘనవిశ్వోద్గతికారణ
మనఘుఁడు పురుషుండు బ్రహ్మకమాద్యుండు నిరం
జనుఁ డనుచుఁ బ్రాజ్ఞులెవ్వని
గొనియాడుదు రవ్వినాయకునిఁ బూజింతున్.

రాగము-సౌరాష్ట్రము-అటతాళము.

జయజయాహితవైరివర్గప్రచండ
జయజయ గజముఖ జయవక్రతుండ॥ జయ॥

౧

మూషకవాహన-మునిజనవంద్య
దోషరహితదళి-తాసురబృంద।
శేషవిభూషణ-శైలవారిధిచంద్ర।
పోషితపరిజనపుణ్యాకదంబ-జయజయస్వామిన్॥ జయ॥

అద్రిసుతానుత-అనవద్యచరిత
భద్రభక్తభవ-భయహరముదిత।
రుద్రోదితబుజు-మస్తకసహిత
సద్రూపసరస-జనముదితవినుత॥ జయ॥

3

లంబోదర ధీర-లావణ్యాసార
కంబుసుధానిధి-కర్పూరగౌర।
సాంబ సదాశివ-సత్కృపచతుర
సామవేదగీత - సకలాధార॥ జయ॥

౪

శక్రాదిసురగణ—సన్నుతచరణ
శాతకుంభమణి—దివ్యాభరణ।
ధిక్కృతసురవిఘ్న—తిమిరాపహరణ
ధీరనారాయణ—తీర్థంకరణ॥ జయ॥

గీర్వాణాంధ్రకవిస్తుతి.

సీ. సంతతార్చితరామచంద్రపాదాంభోజుఁ
బ్రాచేతసునిఁ గవిప్రథముఁ దలఁతు
భారతగ్రంథకల్పనదక్షు భజనంబు
సేతు నాసత్యవతీతనూజు!
శైలరాట్తనయాప్రసాదవర్ధితవాగ్వి
లాసుని నలకాళిదాసు నెంతుఁ
బార్వతీవల్లభోపాసను నెమ్మదిఁ
బాడుదు వేములవాడభీముఁ

తే. దనకవిత్వంబు నారాయణున కొసంగి
యవ్యయం బైనకైవల్య మందినట్టి
పుణ్యచరితుని బమ్మెరపోతరాజు
నాత్మ గణుతింతు మత్కావ్య మలరుకొఱకు.

శ్రీమదాంజనేయస్తుతి.

మ. తనరంగాయముచేత రామచరణద్వంద్వైకదాస్యంబు హె
చ్చినభక్తిం దగువాక్కుచేననిశమున్ శ్రీరామనామప్రకీ
ర్తనముం జిత్తముచేత రామపరతత్త్వధ్యానముం జేయుశ్రీ
హనుమంతున్ సముపాశ్రయింతుమదభీష్టార్థంబుసిద్ధింపగన్.

రాగము-సురట-అదితాళము.

ఆంజనేయునిఁ గొలుతు-శ్రీరామ
దాంజనేయునిఁ గొలుతు॥

౧

లంకలోనున్న సీతాదేవి
శంకమాన్పినట్టిసంజీవరాయుని।
లంకిణిఁ బరిమార్చి-రావణాసురుని
లంకగాల్చినట్టి- లాంగూలబలుని॥ ఆంజ॥

నిండగుభానుని-మండలమునువడి
పండని పట్టిన-పరమసాహసుని।
మొండి రావణుని-మూలబలంబులఁ
బిండిచేసినట్టి-భీమపరాక్రముని॥ ఆంజ॥

దిట్టఁడై యక్షకుమారుని
చెట్టలు పట్టి చీల్చినబలుని।
మట్టుఁ బెట్టినరావణాసురు
నట్టిట్టు చేసినయంజనాసుతుని॥ ఆంజ॥

పరమభాగవతస్తుతి.

క. మదిఁ బ్రహ్లాదార్జుననా
రదసనకసనందశుకపరాశరరుక్మాం
గదభీష్మశౌనకాదుల
సదయాత్ముల భాగవతుల సతతముఁ దలఁతున్.

## మానసబోధ.

శా. కాండవ్రాతముసల్పఁగానిలుపఁగా ఖండింపఁగా నేర్చితా
నిండార్లై యతిశాంతుఁడై సులభుఁడై నీకోరినట్లే దయా
భాండాగార మసంగఁ జెన్ను గుపర బ్రహ్మాంబు నౌనవ్విభున్
చండించేవు దలంపలేక మనసా సర్వేశుఁ జింతింపవే.

శా. ధీరాగ్రేసర నందనందన హరీ దేవౌఘచూడామణీ
ఘోరాఘౌఘహరా ముకుందనృహరీ గోవింద శ్రీకృష్ణసం
సారాంభోనిధికర్ణధార కమలాక్షా శౌరి దామోదరా
శ్రీరామాచ్యుత జానకీరమణ నిన్ సేవింతు నిష్టాప్తికిన్.

రాగము - నాట - జంపెతాళము.

జయజానకీరమణ-జయవిభీషణశరణ।
జయసరోరుహచరణ-జయదీనతరణా॥ జ॥

౧

జయత్రిలోకశరణ్యా-జయభక్తకారుణ్యా।
జయగణ్యాలావణ్యా-జయజగద్గణ్యా॥ జ॥

౨

సకలలోకావాస-సాకేతపురవాస।
అకలంకనిజహాస-యబ్జముఖహాసా॥ జ॥

౩

శుకమునివినుతిపాత్ర-శుభరమ్యచారిత్ర।
మకరకుండలకర్ణ-మేఘసమవర్ణా॥ జ॥

కమనీయకోటీర—కౌస్తుభాలంకార।
కమలాక్షరఘువీర—కమలావిహారా॥ హా

౫

సమదరిపుజయధీర—సకలగుణగంభీర।
అమలహృత్సంచార—యఖిలార్తిహారా॥ హా

౬

రూపనిర్జితమార—రుచిరసద్గుణశూర।
భూపదశరథకొమర—భూభారహారా॥ హా।

౭

పాపసంఘవిదార—పక్షీంద్రముఖసంహార।
శ్రీపతీ సుకుమార—సీతావిహారా॥ హా—జయ॥

చ. ఘనులు మహానుభావులు జగన్నుతపుణ్యకథాప్రవీణవా
గ్ఘనధులు మీరెఱుంగని నవవ్రతసంఘము లేను నేర్తునే
నను నొకపెద్దఁజేసి కరుణన్ వినఁగోరుట గాదె తాము పెం
చినశుకవాక్యముల్వినఁగఁ జిత్తమెలర్చెడువారికై వడిన్.

వ. ఇట్లు ఇష్టదేవతాభివందనంబును గీర్వాణాంధ్ర కవిస్తుతి
యును జేసి పరమభాగవత శిఖామణియగు శ్రీరామదాసు
చరిత్రంబు వర్ణింప నుపక్రమించెద.

చ. జనవర వింత నీదుగుణ
సంపద మానుషవేషధారివై
యనయము మోహితాత్ములుగ
నందఱఁ జేయుదు నిశ్చలుండవ

య్యాను జరియింతు వన్నిటను
నొప్పియునొక్కటనుండు వెల్లవూ
యను స్వవశం బొనర్చియుఁ ద
దానుసరత్వ మొనర్తు వెంతయున్.

రాగము - నాట - ఆదితాళము.

నమోస్తు తే రఘునాయకా నమో॥

౧

నమోస్తుతేరఘు-నాథపరాత్పర
రమామనోహర-రణజయశూర నమో॥

౨

పారావారవి-హారగంభీర
పాథోధిశయన-పంకజలోచన నమో॥

౩

మందరగిరిధర-మహితవిచార
మానితసార-మణిమయహార నమో॥

౪

వారణదుఃఖని - వారణ శుభకర
నారసింహదా - సావనలోలా॥ నమో॥

శా. శ్రీరామా రఘునందనా రఘుపతీ సీతామనోనాయకా
కారుణ్యాభయదానహస్త వరధాత్రీకాకుత్స్థవంశోద్భవా
దారిద్ర్యవ్యథతమిస్రతాపహరణా తత్త్వాబ్ధిచంద్రోదయా
రారానామదిలో వసించి కృపతో రక్షింపరా మ్రొక్కెదన్.

రాగము సౌరాష్ట్రము - అటతాళము.

భజనఁ జేసేవిధము తెలియండీ - నరులార మీరు
నిజము గనుఁగొని మోద మందండీ॥ భజన॥

౧

భజన జేఁసేవిధము తెలియక
నిజముగా హరిభక్తు లనుకొని
నిజమదముఁ దెగ వ్రేయలేకా
సుజను లని తిరుగంగ నేలా॥ భజన॥

౨

వారు వీరని యెంచఁబోకండీ-జనులార మీరు
నోరు చచ్చిన వారుగా కండీ
వారు వీరని యెంచు టెల్లను
సారమూ లేనట్టిహీనత
పౌరుషుల కేకాక పుణ్యా
దారి కథలం దేమి యున్నది భజ॥

౩

జ్ఞాను లనుకొని యెగసిపడకండీ - జనులార తత్త్వ-
జ్ఞానమందే మనసునిలుపండీ
జ్ఞాను లనుకొని యెగసిపడి య
జ్ఞానములు పైఁ బెట్టుకొనినను
మానసంబున [illegible]
పూని మతిజన్మింపవలయును॥ భజ

ఝూటమాటలాడఁబోకండి-నరులార కలియుగ
నాటకములోఁ జిక్కఁబోకండి
ఝూటమాటా లాడిపొట్ట
కూటికే వేషములు దాల్చక
మాటికీ యమబాధలావే
కాటికీ బోవంగ నేటికి॥ భజ॥

మూలస్థానము తెలిసి బ్రతుకండి-జనులార మీరు
మేలిమిగ శ్రీహరిని వెదకండి
మూలస్థానము దెలిసి మీలో
చాలఁగా వెలిగేటిజ్యోతిలో
లీలమై వెలుఁగొందు బాలుని
నీలమధ్యమునందుఁ దలఁచుక॥ భజ॥

ధరణి శ్రీనరహరిని గొలువండి- జనులార మీరు
పరమపదవిని బొందగోరండి
ధరను శ్రీఘటికాద్రినరహరి
పరమభక్తవరుల మనుకొని।
విరివిగా నరసింహదాసుని
వరకవిత్వము సార మనుకొని॥ భజ॥

సీ. భూలోకమున నొక్క । బుధజనాగ్రణికథఁ
  జెప్పెద వినరయ్య । చిన్న మీఱ
నుర్విగోల్కొండయంతర్వర్తియై యొప్పు
  భద్రాచలం బని । ప్రబలుచున్న
పురమునఁ దహాస్సీలు । పొలుపొందఁ జేసెను
  ధీరుఁడై గోపన్న । ధీసమేతుఁ
డతిభక్తియుక్తుండు । సమ్మృతగుణాఢ్యుండు
  ప్రేమతో హరిసేవ । ప్రబలఁ జేసి

తే. పరముఁ జెందెను శ్రీరామ । భద్రుకరుణ
నట్టిభక్తునిచరితంబు । నయముగాను
జెప్పెదను మీరు వినరయ్య । చిత్త మిచ్చి
పరమభక్తులు సజ్జనుల్ । భక్తిమిఱ.

సంధిచరణములు — శ్లోహారా.

రాగము-నాథనామక్రియ-ఆదితాళము.

శ్రీకరముగ భద్రాచలమందునఁ । జెలగెడిరామునికృపను
ప్రాకటముగ రామదాసుఁడరిగెను । బరమపదమ్మునకును.
ఇది వినరయ్యా శ్రీహరిదైత్యారీ ! యనరయ్యా జనులు
సదయతశ్రీరామదాసునికథ విని । సద్గతి గనరయ్యా నరులు.

సీ. శ్రీకరం బై బుధ । సేవ్య మై సుజనవి
  లోక్య మై కుజనావి । లోక్య మగుచు
శివునినైనను గాసి । చేసి వానికి నెక్కు
  తాసింగములచే విశ్రాంతి యుగుచుఁ

మేటిబేరాల బకల్పొటవమంబున ద్రవ్య
కోటి గల్గుకిరాటకూట మగుచు
స్వకులోచితక్రియాధికము చేఁ జెలువొందు
శూద్రసమాజసుభద్ర మగుచుఁ

తే. గలితకాసారవనవాటికాయుతంబు
ఫలిత నారంగ జంబీర పనస వకుల
నారికేళాదితరువితానావృతంబు
నగుచు ధర నొప్పుగోల్కొండ నగర మెలమి.

గోలకొండనగరవర్ణనము. [రగడ.]

అది కడు నున్నత మయ్యెడికోటలు
సదనంబగు నచ్చపుఁ బూఁదోఁటలు,
మాణిక్యంబుల మయమగు వేదులు
నాణెము లగు తిన్ననిబలువీదులు,
కడునైష్ఠికతలు గలిగినయాజులు
పుడమిని ధర్మముఁ బూనినరాజులు,
హర్మ్యవినిర్మిత బహుసౌధంబులు
నిర్మల మణిమందిరయూథంబులు,
పచ్చలు గూర్చిన బలుతోరణములు
మచ్చిక లెసఁగెడిమదవారణములు
కట్టందములుగఁ గట్టినతేరులు
నెట్టిన సాములు నేర్చినశూరులు
నవరత్నంబుల నయమగు మేడలు
కవగూడినపటి కవురాగోడలు

వటుతర గేహ ప్రాసాదంబులు
స్ఫుటతర భేరీ పుటనాదంబులు
వేలుపుఁజేడెల వెలగొను వేశ్యలు
శ్రీలఁ గుబేరుని జెనకెడి వైశ్యులు
నిమ్ములఁ బొడ వగు నిలవహోమంబులు
కమ్మనికృష్ణా గరుధూపంబులు
నిరుపమమాగధ నిజగానంబులు
గరిమ వహించిన ఘనయానంబులు
విమలోదకముల వెలసిన బావులు
సమచతురము లగు చల్లనితావులు
మహితబలంబుల మను సామంతులు
బహువిద్యలఁ బేర్వడు ధీమంతులు
నీతులు పతులకు నేర్పెడిమంత్రులు
ద్యూతాదులకును దొడగుతంత్రులు
నంగడిఁ బుష్పము లమ్మెడిబోటులు
సంగతి గలవిట జనముల నీటులు
గలిగి ధరిత్రిని ఘనత వహించెను
అలకాపురమున కన్న రహించెను.

క. అన్నగర మేలుచుండును
మన్నీ లందఱును గొలువ మదనసురూపుం
డన్నిట వెరవరి యై యా
వెన్నుఁడొకో యనుచు జనులు వినుతి యొనర్పన్.

శా. తానీషా యనునామధేయమున నాకాశార్కబింబోపమం
బౌ నెమ్మోమునుగాంచనాంకమును బై పైనీడలం దేర్పఁగా
జా నొప్పారెదఁ దారహారములు తేజగిప్రావణీయంబు లై
యానందం బొసఁగంగసూరిజనమాన్యం బైనసత్కీర్తితోన్.

క. కులమున మ్లేచ్ఛుం డెన్నఁగ
నిల నాతని దైనపుణ్య మెట్టిదొ యెఱుఁగన్
జలజాతాత్మభవాదుల
కలవియె శ్రీరామదేవుఁ గాంచఁగ బ్రీతిన్.

క. ఎన్నఁగఁ దానీషా క
క్కన్నయు మాదన్న యనఁగ నవనిసురవరుల్
అన్నయుఁ దమ్ముఁడు గడుసం
పన్నులు మంత్రులును నీతిపాలితు లరయన్.

వ. వారికి మేనయల్లుండు.

తోహారా.

శ్రీ మించిన నెలకొండపల్లిలో శిష్టజనులు పొగడఁగను
కామాంబకు గోపన్న జనించెను గమలాతునివరమునను.
ఆత్రేయసగోత్రంబునఁ గంచర్లాంధ్రార్యులవంశమునన్
పుత్త్రుఁడగుచులింగనమంత్రికిఁదాఁబుట్టెనుగోపన్నయనన్.
ఇదివినరయ్యా

క. భూసురవరుఁడు నియోగియు
భాసురకంచర్లకులజభవ్యయశుండున్
వాసరపతివంశజచర
ణాసక్తుఁడు గోపన యన నభిమతి కెక్కెన్.

తోహరా.

పుట్టినపుత్త్రుని జన్మదినంబున । భూసురు లందఱు వేగా
దిట్టముగా గోపన్న యనుచుఁ గదు । దీవెన లొసఁగిరి బాగా
ఉపనయనంబును నొప్పుగ నడపెను । యుక్త కాలమందునను
ఉపమ గలదె పుత్త్రుని కని నేర్పిరి । యురుతర శాస్త్రంబులను.
—ఇదివినరయ్యా॥

తే. శాస్త్రచింతన సేయుచో । శాస్త్రవిదులు
బాలరామాయణంబు తాత్పర్య మొప్పఁ
దనకుఁ జెప్పిన రాముని । ఘనమనీష
లెల్లఁ దలపోసె యుల్లము । పల్లటిలఁగ.

వ. ఇట్లు దినదినప్రవర్ధమానుం డై యైదేండ్లప్రాయంబునఁ బెద్ద లుగా నుండువా రొక చోటఁ గూడి రామాయణంబు పారాయణంబు సేయుచు వినువారలకుఁ దాత్పర్యంబు దెలుపుచుండ నీబాలుం డారామాయణం బామూలాగ్రముగ వినినవాఁడై నే నారాములతోఁ డంగూడ జనన మొందకపోతినిగదా! అటుల జననమొందియుంటినేని సుగ్రీవాదివానరులవలె నేనును శ్రీరాములకు సేవ సేయుదుఁగాదా! అని తనయభిప్రాయమును గీర్తనఁ జేయుచున్నాఁడు.

రాగము—ఆనందభైరవి - ఏకతాళము.

ఆశపుట్టెనే శ్రీరాములతో—నాహాఁ బుట్టనైతిని
రఘురాములతో - అయ్యో నేఁ బుట్టనైతిని
శ్రీరాములతోఁ బుట్టి సేవలు సేయనైతిని. ఆశ॥

దశరథనందను డై-దాశరథి రాములు
వశముగ బాలురతో వరదుఁడై-యాడంగ
వనజనాభునకు భక్తుఁడ నై నే
భయభక్తిప్రేమతోడ-శ్రీరామరామ
సకలసేవలుఁ సలుపుచుమురియుచు
అట నల్గుర్థతో నాడుకొందుఁగద
అయోధ్యాపురిలో గజము నెక్కి
యచ్యుతుఁడు వెడలి రాఁగాను
నాట్యమాడుచు నన్ను రక్షించు మందును
విశ్వామిత్రునివెంటఁ బోఁగానే పోదును
జనకుఁడు వారికి-జానకిని బెండ్లిసేయుంగా
వారిద్దఱికి నెత్తి బియ్యము నేఁ దెత్తును
అమ్మకు వారికి-ఆకులు మడిచిత్తును
నరులార యితఁడే నారాయణుఁడని నేఁ జాటుదును
మనలను రక్షించే మాధవుఁడు వచ్చెనందును
మనగతి ముందు యే మందును

ప్రభు దశరథు నే బ్రతిమాలుదుఁ గద
కైకేయిని నేఁ గాదందును గద
రాములకై పట్టరాజ్య మిత్తుఁ గద
ప్రభువై యేలఁగఁ బనులుచేతుఁగద
అడవికిఁ బోఁగా నంటిపోదుఁ గద
గుహునితోఁ గూడుక కూడి మురుతుఁగద

నిలిచి దానవుల నెత్తి గొడుదుఁ గద
ఖరయుద్ధంబునఁ గౌఁగిలింతుఁ గద॥ అ॥

౨

కనకమృగము రాఁగాఁ గాంత దెమ్మంటే
ఓనిర్దయులార అయ్యో పోతిరే
ఆమృగమును దెచ్చిమ్మకిత్తుఁగద
హరిని నేనుబో వలదందునుగద-అమృగమువెంట
దశముఖుఁడంతటఁ దపోవేషమున
శశిముఖికిఁదనశౌర్యముఁజూపంగ జానకివఁణకంగ॥
ఆరావణుఁడు సీతమ్మను జెఱఁబట్టంగ
అపుడు నేనుంటే అమ్మకభయము దెల్పుదును
ఆశ్రీపాదములు అట్టెపట్టుకె మొ్రక్కుదును
హరిదుఃఖించఁగ అమ్మజాడ నేఁ దెత్తును
సర్వజ్ఞ మూర్తి చాలు నీవిరహ మందును
విశ్వములో నందఱువినవట్టే యూర కుండిరి
సురవరు లందఱు ముఖము చూచుచుండిరి॥ అ॥

అయ్యయ్యో యిది యేమనందుగద
ఆబ్రహ్మాదుల శపియింతునుగద
విక్రమవంతులు-వీర్యవంతులును
నేమిచేతు నే-నెవ్వరివేఁడుదు
ఏమఱియుండిరి-యాబుపు లందఱు
ఏల పోయెనో ఆక్షీరాబ్ధికి

ఏల దశరథుఁడు యజ్ఞముచేసెను
ఎందుకుఁ బుట్టిరి యీలోకమునను
ఎందుకువచ్చిరి యీవనమునకును
ఇట్టివరములను నేలా వేఁడిరి?
ఎక్కడఁ దోఁచెను ఇంతటిజాలి ఆశ॥

౪

పంపాతీరమునఁ బరిమార్చి కబంధుని
నింపుగ శబరివిందుల నిష్టములోఁ జేసి
యింద్రతనయసూనుని హితవు గావించి॥
ఆంజనేయుఁ డంగదముఖ్యాదులు
మంజుల వాణిని మఱవక వెదకఁగ
వారలతోఁ గూడి వెదకుదుఁ గద
వైదేహిని బ్రేమతోను సహాయముగరమ్ము
సంపాతి పోకుమందును సముద్రమునే
చొకళించివేగ దుముకుదును
లంక గాలించి పంకజాక్షిని నే సేవింతును
అంగుళీయక మిచ్చి అమ్మా హరి వచ్చె నందును
ఆవృత్తాంతము హరికి నే విన్నవింతును
జానకీరామ జాగేల లేలెమ్మందును॥ ఆశ॥

౫

హరికి వాహనము—ఆంజనేయుఁ డఁట
అలక్ష్మణునకు - అంగదరా జఁట
వశ్రు రాముల నేఁ బ్రార్థింతును గద

సేనలఁ గూడుక చెరలాడుదుఁ గద
కవులచె వారిధిఁగట్టింతును గద
సముద్రుఁడా యిది సమయమందుఁగద
హారి సేనలఁబనులాచరింతుఁగద॥ ఆశ॥

బలిముఖులకుఁ గల-బలముఁ జూతుఁ గద
శుభ రాములతో-సొంపుకందుఁ గద
లక్ష్మణాగ్రజుఁడు సేనను రావించి
లక్ష్మికొఱకుఁ గపులు లంకఁ జుట్టంగ
రక్షించు భద్రాద్రిరామదాసుఁడ నై
రణములో రావణుని ద్రుంతును
ఆక్షణమున - రఘువరు నప్పుడే బిలుతును
మంగళపతివ్రతను-మాధవు కర్పించి మురియుదును॥ ఆశ॥

అమ్మకు మాఱుగ నగ్నిలోఁ జొత్తును
ఆపుష్పక మెక్కి హరితో నయోధ్యకుఁ బోదును
భరతు లానందభరితు లై వేఁడుకొనంగ
బోరున వాద్యములు భువనముల్ నిండి మ్రోయంగ
పట్టాభిషేకము పరమబుధులును
సేవింపంగ జయములు పాడఁగ
రాములతొడపై లక్ష్మి యుండఁగ
లక్ష్మణానుజులు రమణ విసరఁగా
వాయుసుతుఁడు పదవనజము లొత్తఁగ

జేరి విభీషణుఁ డావా యనఁగా
అర్థిఁ గపులు హరి కృష్ణా యనఁగా
బ్రహ్మాదులు హరిఁ బ్రస్తుతింపఁగా
తల్లి మారుతికి దండవేయఁ గా
నాతల్లి యప్పుడునాకు వేయఁగా
కష్టపడితి నని కరుణించునుగా
సీతారాములు సిరు లిత్తురుగా॥ ఆశ॥

గీ. ఇవ్విధంబునఁ దలఁచుచు నిందిరేశు
పైని గలిగినబాళితోఁ బాలుఁ డయ్యె
సర్వశాస్త్రార్థసారవిస్తార మెల్ల
నేర్చి సంతోషజలనిధిం దేల్చె జనకు.

తోహరా.

ఈగతి జననీజనకులు పుత్త్రుని నెంతయుఁ బ్రాజ్ఞునిఁ జేసి
వేగమె శ్రీహరినిలయముఁ జెందిరి వేఱుజన్మములఁ బాసి.
బాల్యమందుశ్రీరామనామమునుభజియించుచుఁదానుండెన్
శ్రీలక్ష్మీశుని చరణకమలములచింత యనుఫలము పండెన్.
—ఇదివినరయ్యా

రాగము-నవరోజు-అటతాళము.

భజరే మానస రామం-భజ
భజరే జగదభిరామం॥ భజ॥

౧

కర ధృత శరకోదండం
కరితుండాయుత భుజదండం

దాశరథిం నరసింహం-భజ
దాశరథిం- నురసింహం॥ భజ॥

౨

కౌసల్యాబహుభాగ్యం-భజ
మైథిల్యాలోచన యోగ్యం
అవనతజలజభవేంద్రం - భజ
అగణితగుణగణసాంద్రం॥ భజ॥

౩

మాయామానవదేహం - ముని
మానసరుచికర గేహం
రూపమదనశతకోటిం-నత
భూపమదనశతకోటిం॥ భజ॥

౪

శ్యామలజలధరశ్యామం-భజ
సాంబశివాశ్రితకామం
భద్రాచలనిధివాసం-పరి
పాలితశ్రీరామదాసం॥ భజ॥

* రాగము-ఆనందభైరవి-చాపుతాళము.

రామనామమే జీవనము- అన్య
మేమి రామకృపావనము॥
రామ నామ సుధారసము-మది
నేమఱక భజియించుమాకీర్తి॥ రామ॥

---

* వ్రాతప్రతులలోనిట మారుపరాగ మనియున్నది.

౧

శ్రీలమేలు భయానకము-రఘు
వీరులీల లే పానకము
పాలు మీఁగడ జారుతేనియ
పాలకన్నను మేలిమైనది॥ రామ॥

౨

ఈరసము లెల్ల నీరసము-రఘు
వీరుకథ లెల్లఁ బాయసము
సారె మాకుఁ జేకూరె నాఁకలి
తీఱెఁ దృష్ణ చల్లారె నోభళి॥ రామ॥

౩

ఘోర భవసింధు తారకము-హృద
యారి వర్గ నివారకము
సారమా ఘనసారకదళీఫ
లోరుసౌఖ్య మపారసారము॥ రామ॥

౪

సుందరశ్రీరాజములు-రఘు
నందనాంఘ్రిసరోజములు
చెంది బ్రహ్మానందభావము
నంది ముక్తిని పొందఁజేసిన॥ రామ॥

౫

భాసమానశుభాకరము - నిజ
దాస లోక వశీకరము

ఘనుతాపితుఁడై భద్రాచల
వాసుఁడై రామదాసు నేలిన॥ రామ॥

తోహరా.

గృహపతిధర్మము నెఱపుచు గోపన గృహమందుసఁదానుండఁగా
విహగవాహనునిదాసుండొకఁడు వీరిగృహమునకుఁదండఁగా
పంచబాణునిజనకుని బాడుచు నంచితమతిలో నుండఁగా
వంచనలేని మహాత్ముఁడీతఁ డని యెంచిచెంతనిలుచుండెఁగా
గోపనముఖసల్లక్షణములగడు గుఱుతిడీదాసుఁడుచూచెఁగా
ఓప నవకు నేనొక్కటిచెప్పెద నోడకుమనిచెయిచాఁచెఁగా.
—— ఇదివినరయ్యా॥

వ. చేతులు చాఁచి గోపన్నను బిలిచి యతనియందు భగ
ద్భక్తలక్షణంబు లుండుటఁ గాంచి నీయందు శాంత్యాది
గుణంబు లున్న యవి నీకు నఖండయోగంబును శ్రీరామ
చంద్రాను గ్రహంబును గలుగును. నేను చెల్పునది పూని
విను మని యిట్లనియె.

శ్లో. శ్రీరామ రామ రామేతి రమె రామే మనోరమే,
సహస్రనామత త్తుల్యం రామనామ వరానసే.

వ. ఈ ప్రకారముగా కబీరుదాసుగారు గోపన్నకు రామనామ
మును బఠించుచు నుండు మని రామమంత్రంబు చెప్పి
యథేచ్ఛం జనువాఁడై.

తోహరా.

సామగానలోలా యని సొక్కుచు సరగ కబీరుఁడు చనెను
నేమాఱుసు గోపన్న యుండె నిటవేద వేద్యుఁ బాడుచును.



5. కబీరుదాసు రామదాసునకు తారకమంత్రమునుపదేశించుట.

కబీరుదాసునికటాక్షమునఁ దాఁగ్రోలగాంచె రామనామమును
జపంబు సేయుచు జలజనయనునిశ్రీచరణసేవ నిత్యమును.
—ఇదివినరయ్యా.

వ. గోపన్న కబీరుదాసుసన్నిధిని రామమంత్రప్రభావంబు విని
యానందించువిధం బె ట్లనిన.

శ్లో. జయతు జయతు మంత్రం జన్మసాఫల్యమంత్రం
జననమరణభేద క్లేశవిచ్ఛేదమంత్రమ్,
సకలనిగమమంత్రం సర్వశాస్త్రైకమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతి మంత్రమ్. ౧

శ్లో. నిఖిలనిలయమంత్రం నిత్యతత్త్వాఖ్యమంత్రం
భవకులహరమంత్రం భూమిజాప్రాణమంత్రం,
పవనజనుతమంత్రం పార్వతీమోక్షమంత్రం
పశుపతినిజమంత్రం పాతు మాం రామమంత్రం. ౨

శ్లో. ప్రణవనిలయమంత్రం ప్రాణనిర్వాణమంత్రం
ప్రకృతిపురుషమంత్రం బ్రహ్మరుద్రేంద్రమంత్రం.
ప్రకట దురిత రాగ ద్వేష నిర్నాశమంత్రం
రఘుపతినిజమంత్రం రామరామేతి మంత్రం. 3

శ్లో. సంసారసాగరభయాపహవిశ్వమంత్రం
సాక్షాన్ముముక్షుజనసేవిత సిద్ధమంత్రం,
సారంగహస్తముఖహస్తనివాసమంత్రం
కైవల్యమంత్ర మనిశం భజ రామమంత్రం. ౪

రాగము-ధన్యాసి- ఆదితాళము.

తారకమంత్రము కోరిన దొరికెను
ధన్యుడ నైతిని ఓరన్నా
మీఱిన కాలుని దూతలపాలిటి
మృత్యువ యని నమ్మర యన్నా॥ తా॥

౧

మచ్చికతో నితరదైవతకంటులా
మాయలలోఁ బడఁబోకన్నా
హెచ్చుగ నూటయెనిమిదితిరుపతు
లెలమిఁ దిరుగఁబనిలేదన్న॥ తా॥

౨

ముచ్చటగా నాపుణ్యనదులలో
మునిఁగెడి పని యేమిటి కన్న
వచ్చెడిపర్వపుదినములలో నుడి
వడి పడుటలు మాను మికన్నా॥ తా॥

౩

ఎన్ని జన్మముల నెంచి చూచినను
ఏకో నారాయణుఁ డన్నా
అన్ని రూపులై యున్న పరాత్ముని
నామమాత్మకథలను విన్న॥ తా॥

౪

ఎన్ని జన్మములఁ జేసిన పాపము
లీజన్మముతో విడు నన్నా

అన్నిటి కిది కడసారిజన్మమిది
సత్యం బీకఁ బుట్టుటు నున్న॥ తా॥

౫

నిర్మల మంతర్లక్ష్యభావమున
నిత్యానందముతో నున్న
కర్మంబులు విడి మోక్షసద్గతిని
గన్నులనే చూచుచునున్న॥ తా॥

౬

ధర్మము తప్పక భద్రాద్రీశుని
దనమదిలో నమ్ముచు మన్నా
మర్మము దెలిసిన రామదాసుని
మందిరమున కేఁగుచు నున్న॥ తా॥

తోహరా.

సామజవరదునినామముదలఁచుచుసర్వముమిథ్యనితలఁచెన్
కామాదికషడ్వర్గము నెల్లమగడువడిఁదోలుచటు నిలిచెన్.

—ఇదివినరయ్యా.

రాగము-ధన్యాసి-అటతాళము.

శ్రీరామనామమే జిహ్వాకు-స్థిరమై యున్నది
శ్రీరాములకరుణ లక్ష్మీకరమై యున్నది॥ శ్రీ॥

౧

ఘోర మైన పాతకములు-గొట్టివేసన్నది - మమ్ముఁ
జేరకుండ నాపదలను - చెండేసన్నది॥ శ్రీ॥

దారి తెలియనియమదూతలను - దఱిమే నన్నది
శ్రీమన్నారాయణదాసులకుఁ-జెలువై యున్నది॥ శ్రీ॥

౩

మాయావాదులపొందు-మాను మన్నది-యీ
కాయ మస్థిరమని తల-పోయు మన్నది॥ శ్రీ॥

౪

పాయక గురురాయని బోధఁ - బాయ కన్నది
యేయెడఁ జూచినఁ దన్నెడఁ-బాయ కున్నది॥ శ్రీ॥

౫

కామ క్రోధ లోభామూలఁ -గకవా మన్నది
మోదముతో స్త్రీలపొందు - మోస మన్నది॥ శ్రీ॥

౬

వదలనిదుర్విషయవాంఛ-వదలు మన్నది-నా
మదిలో హరిభజన సం-పత్కర మై యున్నది॥ శ్రీ॥

౭

కోప మనియెడుపత్రికృతిని-కొట్టు మన్నది-యిపుడు
ప్రాపునీవే యనిన దారిఁ - జూపే నన్నది॥ శ్రీ॥

౮

ఏపు మీఱ నొరులదోష-మెన్న కన్నది-ఈ
పాపబంధములఁ బట్టు-పడకు మన్నది॥ శ్రీ॥

౯

భక్తిభావన దెలిసి మమ్ము-బ్రతుకు మన్నది - పరమ
భక్తులాకు సేవఁ జేసి - ప్రబలు మన్నది॥ శ్రీ॥

౧౦

ముక్తిమార్గమున కిది-మూల మన్నాది-వి
రక్తుఁడు భద్రాచలరామ-దాసుఁ డన్నది॥ శ్రీ॥

తోహరా.

దేహాపోణకు నుపయుక్తంబుగ దేవేరిని వరియించెన్
సహజముగాఁ జక్కనిసుతునొక్కనిసద్గతికై తాఁగాంచెన్.
ఉదరపూరణార్థంబునకును దా నుంఛవృత్తి యోజించెన్
ముదమున శ్రీహరిదాసులఁగూడుక మోదమలరవరించెన్.
ద్రవ్య మంతెటికి దానధర్మముల దారిఁ జూపె గోపన్న
అవ్యయాత్ముఁడగు శ్రీరాములపద మందఁదలఁచెబుధులెన్న.
పట్టువదలితనధనమంతయు వ్యయపఱచియుఁదానిశ్చలుఁడై
కట్టువస్త్రములతో నిలువం బడెఁ గమలాపతిదాసుండై.
కన్నవార లాఘనుని లేమి గని కన్నుల నీరిడుచుండన్
వన్నెదఱిగియునుమన్ననతో రామన్ననుగొలుచుచునుండెన్
ఇటువలెనొకయేడిడుములుపొందగఁ దటుకుననొకతలపొదవెన్
ఎటు కేనియుఁజనిరామోత్సవమున కెర్చి తెత్తుధన ముదవన్.
—ఇదివినఁ యో॥

రాగము-నాథనామక్రియ-చాపుతాళము.

శ్రీరామనామం మరువాం మరువాం
సిదము యమునికి వెరువాం వెరువాం

౧

కేశవయని మృత్యు గెలుతాం గెలుతాం
దాశరథుని మది తలుతాం తలుతాం॥ శ్రీ॥

౨

నారాయణుని మేమా నమ్మేం నమ్మేం
నరనాథులనుమేమూ నమ్మాం నమ్మాం॥ శ్రీ॥

౩

మాధవు పద సేవమానాం మానాం
మఱి యితరుల సేవ మానేం మానేం॥ శ్రీ॥

౪

గోవిందు నేవేళఁ గొలుతాం గొలుతాం
దేవుని గుణములు తలుతాం తలుతాం॥ శ్రీ॥

౫

విష్ణుకథలు చెవుల విందాం విందాం
వేఱుకథలు వల్ల మందా మందాం॥ శ్రీ॥

౬

మధుసూదనునివై పో మహిమా ల్మహిమాలు
మధురేశుదాసూలె మనుజూలు మనుజూలు॥ శ్రీ॥

౭

త్రివిక్రముని మాయ తెలుతాం తెలుతాం
కువలయాధిపు నమ్మి కొలుతాం కొలుతాం॥ శ్రీ॥

౮

వామనూని చూచి వత్తాం వత్తాం
వాని ప్రభావామే మెత్తాం మెత్తాం॥ శ్రీ॥

౯

శ్రీధరునీ జేర్చిండి చిత్తాం చిత్తాం
చిన్మయు నుతి చేసి చూతాం చూతాం॥ శ్రీ॥

౧౦
హృషీకేశా మది మంతా ముంతాం
ఒసర జన్మాదూల తుంతాం తుంతాం॥ శ్రీ॥

౧౧
పద్మనాభునిదే భారాం భారాం
పరమేశ్వరుని యాజ్ఞ మీరాం మీరాం॥ శ్రీ॥

౧౨
దామోదరనుకోని తలుతాం తలుతాం
తామానులకు తొలగి నిలుతాం నిలుతాం॥ శ్రీ॥

౧౩
సంకర్షణనుమాట సత్యాం సత్యాం
సర్వేశరునిమాట నిత్యాం నిత్యాం॥ శ్రీ॥

౧౪
వాసుదేవుని సేవ చేసేం చేసేం -ఆ-
వానిరూపే మేము చూసేం చూసేం॥ శ్రీ॥

౧౫
ప్రద్యుమ్నునీమీది పద్యాలు పద్యాల్
పరగ నాథుని గొలుచు విద్యాల్ విద్యాల్॥ శ్రీ॥

౧౬
అనిరుద్ధుముందటి ఆటాలు ఆటాల్
ఫణి శయనునీ మీది పాటాల్ పాటాల్॥ శ్రీ॥

౧౭
పురుషోత్తమనువారె పురుషాల్పురుషాల్
అతని గొల్చినవారె సరసూలు సరసూల్॥ శ్రీ॥

౧౮

అధోక్షజ యని యందా మందాం
అతని స్మరించుచు మందాం మందాం॥ శ్రీ॥

౧౯

నారసింహుల దివ్యనామాం నామాం
చేరి అతనిగొల్వ క్షేమాం క్షేమాం॥ శ్రీ॥

౨౦

అచ్యుతభక్తుల మనినా మనినాం
అతడే దేవుడాని వినినాం వినినాం॥ శ్రీ॥

౨౧

జనార్దనుని సేవ సారాం సారాం
సతమానిమాయ సంసారాం సారాం॥ శ్రీ॥

౨౨

ఉపేంద్రుకథగాని ఒప్పాం ఒప్పాం
ఉన్న మాటాడితే తప్పాం తప్పాం॥ శ్రీ॥

౨౩

హరిదప్ప వకరికి అదరాం అదరాం
వేరె దేవుళ్లకు బెదరాం బెదరాం॥ శ్రీ॥

౨౪

శ్రీకృష్ణు నమ్మిందే సిద్ధాం సిద్ధాం
చెనటుల గొల్చుటాబద్ధాం బద్ధాం॥ శ్రీ॥

౨౫

మెట్టుపల్లి శిరులు మమ్మే మ్మేల్మల్
అతని గొల్చినవారె ముక్తాల్ ముక్తాల్॥ శ్రీ॥

౨౭

రామదాసులు మాకు సారాం సారాం
కామదాసులు మాకు దూరాం దూరాం॥ శ్రీ॥

౨౮

నారాయణుని మేము నమ్మేం నమ్మేం
నరుల నింక మేము నమ్మాం నమ్మాం

౨౯

మాధవనామము మరువాం-మరువాం
మఱియమబాధకు వెరువాం వెరువాం॥ శ్రీ॥

౨౯

అవనిజాపతి సేవ మానాం మానాం
మఱియాకజోలంటె మానాం మానాం

౩౦

భద్రగిరీశుని కందాం కందాం
మోదముతో మన ముందాం ఉందాం॥ శ్రీ॥

దోహరా.

హైదర బాదున మేనమామలు శ్రీ అక్కనమాదనగారు
సాదృతి తానీషాకు మంత్రు లైశ్వసౌఖ్యముతో నున్నారు.
అని యోజించుచు హైదరబాదునకేకరిగెను నెన్నికతోను
అనయమువారలవలనఁబాదుషాకే యధిపునమ్ముఖముగ నెను.
చూచి తానిషనుసింహాసనమునఁకిజాడుక్కలకింపాదవంగ గా
దాఁచెనుచుంగులుచుట్టికటకమునఁకేదనవినయము దెలియంగ గా

చూపు మేరలోనుండి వేడుకను శుభగచరిత్రుం డపుడు
ఏపున డుగుసలాములు చేయుచు నీగతిభూసురవరుఁడు.
భయభక్తులతో రత్నాంచిత మగుపాదుషతక్తును జూచి
రయ మొప్పంగ తివాసీ ముద్దిడి రైతువలెనె తా నిలిచి.
తానీషాఁ గనుఁగొని గోపన్నయుఁదాఁ జతురత భాషింప
మానఘనునివలెఁదోఁచెయాతఁడతిమానియనుచునూహింప.
గోపనసామర్థ్యము భయవితరణగుణములు తానిషదెలిసెఁ
ఏపని యితనికి నిప్పింతామని యింపుగ మంత్రులఁజూచెఁ
బల్లిదుఁ డౌతానిషతోఁ జెప్పిరి పట్టుగమంత్రులు బాగ
ఢిల్లీ సంస్థానముతోఁ జేరినయెల్లా హద్దులలోఁగ.
భద్రాచల మనుతాలూకాకుఁబంపుఁడు తహాసీల్ పనిగా
ముద్రనిషానీహుకుములనిచ్చిముజరా లందుమనె వేగ.
ఇటువలెఁ బల్కినమంత్రులమాటలకెదలోబతిసమ్మతించెన్
అటుభద్రాచలమునకుఁబొమ్మనుచునవనిపతియు సెలవిచ్చెన్.
అనిన భాగ్యమని యానందంబునహరి నారాయణ యనుచు
వినయంబున సెలవందియువెడలెనుమనిచెను రాముండనుచు.
—ఇదివినరయ్యా.

క. భద్రాద్రికి నధిపుఁడవై
భద్రయశుఁడ వగుచుఁ బ్రజలఁ బాలించుచు నే
ఛిద్రము లేకయు పైకము
భద్రంబుగఁ గూర్చుమనుచుఁబతి నియమించెన్.



47. తానీషా రామదాసునకు తహసీల్ పని యిచ్చుట.

తోహరా.

హాటకమును గొని గోపన్న యప్పుడుకేహాటూహాటిని దారాఁగ
ముకుందనిలయం బగుభద్రాచలకేమునుమునుగనుఁగొనబాగ.
—ఇదివినరయ్యా.

వ. ఇట్లు భద్రాచలము తాలూకాకుఁ దహసీలు చేయవచ్చుచు గోపన్నగారా భద్రగిరిని దూరంబునందుండి కాంచి గోపుర ప్రాకారమంటపాదులను ఇటులు వర్ణించుచున్నారు.

రాగము-వరాళి-ఆదితాళము.

ఇదిగో భద్రాద్రి - గౌతమి
అదిగోఁ జూడండి

౧

ముదమున సీతాముదిత లక్ష్మణులు
కదసి కొలువఁగా రఘుపతి యుండెడి॥ నిది॥

చారు స్వర్ణప్రాకార గోపుర
ద్వారములను సుందరమై యుండెడి॥ నిది॥

౩

అనుపమానమై యతిసుందరమై
తనరు చక్రమున ధగధగ మెఱసెడి॥ నిది॥

౪

కలియుగమందునఁ గల వైకుంఠము
నలరుచునున్నది నయముగ మ్రొక్కఁడి॥ నిది॥

౫

పొన్నల పొగడల పూఁబొదరిండ్లను
చెన్ను మీఱఁగను శృంగారం బగు॥ నిది॥

౬

శ్రీకరముగ నిల రామదాసుని
బ్రాకటముగఁబోచు ప్రభువునివాసము॥ నిది॥

వ. ఈప్రకారముగాఁ గోవెలగోపుర ప్రాకారముల వైభవంబుఁ జూచుచు భద్రాచలంబు చేరి గౌతమీనదిం గాంచి సేవకులుం దానును స్నానంబు చేసి సీతారామలక్ష్మణుల సేవించి యానందంబునొంది భద్రగిరి డిగ్గి తహసీలుకచ్చేరిని ప్రవేశిం కాఁపులం బిలిపించి యిట్లనియె.

తోహరా.

సాలాఖరులోసర్కార్ పైకముశిచయ్యాసఁదీసుకరండి
వాలాయము శ్రీరాములఁ గొలుచుచు శివర్ధిల్లిన మేలండి
అని కాఁపులఁ దనపుత్రులరీతినిశినధికప్రీతిఁబోచుచును
కనకాంబరధరుసేవఁ జేయుచుశిఘను లెన్నఁగ మెలఁగుచును.

—ఇది వినరయ్యా.

క. అవనీశునాజ్ఞఁ గొని య
య్యవనీసురుఁ డతిసునీతి శినాభద్రగిరిన్
భువిపతి మెచ్చఁగ నేలెను
భవహరశ్రీరామపాదశిభక్తినిరతుఁడై.

తోహరా.

ఎప్పుడు నీతఁడె తహసీల్ పనిలోశినిం దుండఁగ జను లెన్న
నొప్పఁగఁ బైకము వసూలుచేసెనుశినోర్పుతోడ గోపన్న.

సర్కారు సైతము సాలాఖరులో । సర్వము హుజూరు కంప
పేరొక్కనిపాదున. ప్రేమగల్గి తా౯ । పెంపలరఁగ వర్తింప.
దానధర్మముల నుపకారంబుల । దైవభక్తి గోపన్న
మానక చేయుచు నుండె నప్పుడు। మహిలోపలఁ బ్రజలెన్న.
—ఇదివినరయ్యా.

క. భూమిసురు లెంద తేఁగిన
నేమంబున నన్నమిడును । నెమ్మదిలో శ్రీ
రామార్పణ మని యెన్నుచు
ధీమంతుఁడు గోపనుకవి । దినకరనిభుఁ డై.

ఆ. అంత నొక్కనాఁడు । సంతర్పణము సేయ
నవనిసురులు ప్రేమ । నారగింప
నతనిప్రియతనూజుఁ । డం దున్నతస్థయ
వాగునందుఁ బడిన । వనటఁ జెంది.

ఆ. అతనిపత్ని సాధ్వి । యతిరూపసుందరి
యతిసుశీల తనదు । పతిని మదిని
సేవఁ జేయుచుండు । శ్రీరాముఁ డని ప్రీతి
నిలయు నీదు గాదు । ఈమె కనఁగ.

ఆ. అవనిసురులు గుడుచు।నందాఁకఁ బతితోడఁ
దెలుపరా దటంచుఁ । దెలివిమీఱ
మఱణ మైనసుతుని । మఱుఁగునఁ బడవైచి
పిదపఁ దెలిపెఁ దనదు।ప్రియున కెలమి.

వ. ఇవ్విధంబున దైవగతిం జెందినకుమారునిం జూచి భగవద్భ
క్తుం డగుట వివేకదృష్టిచే ధైర్యం బవలంబించి భగవద్భక్త

లకు రామచంద్రభూపాలుండు తా జగుటంజేసి రామ రాజ్యంబున నొకవిప్రునిపుత్త్రుండు పంచత్వంబు నొందిన నాబ్రాహ్మణుం డాపుత్త్రశవంబు నెత్తుకొని రామచంద్ర ప్రభునాస్థాన మంటపంబున కెదురుగ వైచి రామభద్రా! పుత్త్ర మరణశోకాతురుని మొఱనాలింపు మని మొఱలిడిన వాని మొఱనాలించి పుత్త్రవంతునింజేసె నని పురాణం బుల విందు నది నిజంబైనచో నాపుత్త్రు నేల బ్రతికింపఁ డని దుఃఖంబు మాని గోపన్న పుత్త్రకళేబరంబును దనభు జంబుపై నిడుకొని యాచిన్నవానిం బ్రతికింప రమారమ ణుం డుండఁ జింత యేల యని రామకీర్తనంబు చేయు చున్నాడు.

శా. మందారస్థల హేమరత్నమయసౌధద్యోతసత్ప్రప్రకం
బందు న్నైజసభాశుభాసనమునం దాసీనుఁడై మానిస
ద్బృందాశాధిపలక్షణాన్వితుఁడునై పృథ్వీసుతాయుక్తుఁడై
యుం దేందీవరవర్ణుఁడౌరఘువరుం గూర్చి న్నదింగొల్చెదన్.

రాగము-నాథనామక్రియ-ఏకతాళము-

కోదండ రామ కోదండ రామ
కోదండ మాం పాహి కోదండరామ॥

౧

నీదండ నాకు నీవెందుఁ బోకు
వాదేల నీకు వలదు పరాకు॥ కోదం॥

౨

శ్రీరామ మమ్ము౯ జేపట్టుకొమ్ము
ఆదుకో రమ్ము ఆరోగ్య మిమ్ము॥ కోదం॥

౩

జయ రఘువీర జగదేకశూర
భయదనివార భక్తమందార కోదం॥

౪

మణిమయభూష మంజులభాష
రణవిజయఘోష రమణీయవేష॥ కోదం॥

౫

ఏల రావయ్యా యేమంటి నయ్యా
పాలింపవయ్యా ప్రోఢి గనవయ్యా॥ కోదం॥

౬

తల్లివి నీవె తండ్రివి నీవె
దాతయు నీవె దైవము నీవె॥ కోదం॥

౭

అద్భుతకుండ లామల గండ
సద్భుజదండ సమర ప్రచండ॥ కోదం॥

౮

సరసిజనేత్ర సౌందర్యగాత్ర
పరమపవిత్ర భవ్యచరిత్ర॥ కోదం॥

౯

ఏబుద్ధి వీఁడు ఎఱుఁగని వాఁడు
పాపఁడువీఁడు బడలియున్నాఁడు॥ కోదం॥

౧౦

పాపను లేపి బాధల మాన్పి
యాపదఁ బాపి యటుప్రీతిఁ జూపు॥

౧౧

నమ్మినచిన్న వాఁ డెందఱున్న
మమ్ములఁగన్న మాయన్న వన్న॥ కోదం॥

౧౨

ఎవరుమీతోటి ఎవరు మీపాటి
రారుమీసాటి రాజులమేటి॥ కోదం॥

౧౩

దశరథబాల దాసానుకూల
దశముఖకాల ధరణీశపాల॥ కోదం॥

౧౪

మారుతభీమ మాల్యాభిరామ
కల్యాణనామ కారుణ్యధామ॥ కోదం॥

౧౫

మంజులభాష మణిమయభూష
కుంజరపోష కువలయవేష॥ కోదం॥

౧౬

పుట్టింప నీవె పోషింప నీవె
ఫల మియ్య నీవె భాగ్యము నీవె॥ కోదం॥

౧౭

శరణన్న చోట క్షమసేయుమాట
బిరుదునీదాట వెలిఁగినమాట॥ కోదం॥

౧౯

రావయ్య వీని రక్షింతు గాని
సేవించువాని–స్థితిగందుగాని॥ కోదం॥

౧౯

మురళీవిలోల మునిజనపాల
తులసీవనమాల తుంబురులోల॥ కోదం॥

౨౦

రావణభంగ రమణీయాపాంగ
పావనలింగ పాదాబ్జభృంగ॥ కోదం॥

౨౧

మందారహార మన్మథాకార
మందరోద్ధార మౌక్తికహార॥ కోదం॥

౨౨

వందన మయ్య వా దేలనయ్య
దండనసేయఁ దగదు మీకయ్య॥ కోదం॥

౨౩

లాలితహాస లక్ష్మీవిలాస
పాలితదాస భద్రాద్రివాస॥ కోదం॥

౨౪

శ్రీవిజయరామ శ్రీతులసీదామ
పావననామ భద్రాద్రిధామ॥ కోదం॥

వ. ఇవ్విధంబున రామచంద్రుం బేర్కొని స్తుతించుతఱి
నబ్బాలుండు శ్రీరామ ప్రసాదంబున నిద్రించువాఁడు

మేల్కొన్న తెఱంగునఁ బునర్జీవితుఁ డైనం జూచి పరమా
నందంబు నొంది రామదాసు శ్రీరామభజనంబు సేయు
చున్నాఁడు.

తోహరా.

ఇటు విహరింపుచు నింపున నుండెను కేనిలభద్రాచలమునను
అటుతర్వాతార్లకులవరహా కె లమరె ఖజానాలోను. 38
అప్పుడు శ్రీభద్రాచలరాముల కె హర్షములో సేవించెఁ
మప్పిరిగొని శ్రీపాదపద్మములుకేమదమలరఁగ ధ్యానించెన్.
—ఇదివినరయ్యా.

రాగము - రేగుప్తి - రూపకతాళము.

వందే విష్ణుం దేవ మశేషస్థితిహేతుం
త్వా మధ్యాత్మజ్ఞానిభి రంతర్హృది భావ్యం
హేయాహేయ ద్వంద్వవిహీనం పరమేకం
సత్తామాత్రం సర్వహృదిస్థం దృశిరూపం॥ వందే॥

౧

ప్రాణాపానౌ నిశ్చయబుద్ధ్యా హృదిరుద్ధ్వా
భిత్వా సర్వం సంశయబంధం విషయౌఘాన్
పశ్యంతీశం యం గతమోహా యతయ స్తం
వందే రామం రత్నకిరీటం రవిభాసం॥ వందే॥

౨

మాయాతీతం మాధవ మాద్యం జగదీడ్యం
నిత్యానందం మోహవినాశం మునివంద్యం

యోగిధ్యేయం యోగవిధానం పరిపూర్ణం
వందే రామం రంజితలోకం రమణీయమ్॥ వందే॥

౩

భావాభావ ప్రత్యయహీనం భవముఖ్యై
ర్యోగాసక్తై రర్చితపాదామ్బుజయుగ్మం
నిత్యం శుద్ధం బుద్ధ మనంతం ప్రణవాఖ్యం
వందే రామం వీర మశేషాసురదావం॥ వందే॥

౪

త్వం మేనాథో నాథితకార్యాఖిలకారీ
మానాతీతో మాధవరూపోఖిలధారీ
భక్త్యాగమ్యో భావితరూపో భవహారీ
యోగాభ్యాసై ర్భావితచేతస్సహభావీ॥ వందే॥

౫

త్వా మాద్యంతం లోకతతీనాం పర మీశం
లోకాతీతం లౌకికమానై రధిగమ్యమ్
భక్తిశ్రద్ధాభావసమేతై ర్భజనీయం
వందే రామం సుందర మిందీవరనీలమ్॥ వందే॥

౬

కో వా జ్ఞాతుం త్వా మతిమానం గతమానం
మానాసక్తో మాధవ శక్తో మునిమాద్యం
బృందారణ్యే వందితబృందారకబృందం
వందే రామం భవముఖ వంద్యం సుఖకందమ్॥ వందే॥

నానాశాస్త్రైర్వేదకదంబైః ప్రతిపాద్యం
నిత్యానందం నిర్విషయజ్ఞాన మనాదిం
మత్సేవార్థం మానుషభావం ప్రతిపన్నం
వందే రామం మరకతవర్ణం మధురేశమ్॥ వందే॥

తోహరా.

జగదీశుని ని ట్లభినుతించి తన ॥ జనిసాఫల్యము గాంచెక
తగునీసన్నిధి జీర్ణోద్ధారణ ॥ తాఁ జేసెద నని తలఁచెన్.
ఒక్కదినంబునఁదనగృహంబునకు॥నొనరఁగఁగాఁపులఁబిలిచి
వెక్కసపడకను వినుఁడుతెల్పెదను॥వేఱుగఁ దలఁపక నిలిచి.
ఎన్నిదినంబులు బ్రతికిన మరణము ॥ నున్న యగుట లేదు
పన్నగ శ్రీహరిపదములఁ గొలిచినఁ ॥ గ్రన్నన నటుగాదు.
చేయఁదలఁచితిని రామునికోవెల॥జీర్ణోద్ధారణ మేను
పాయకమీరలుప్రక్కబలముగాఁ॥బ్రబలుఁడుకార్యములోను
అన విని కాఁపులు హర్షమునొందుచు ॥ హరిభక్తున కిట్లనిరి
మనవివినుచుమీమర్జీచొప్పున॥మసఁగఁదలఁతుమేమనిరి.
ఆమాటలువిని యానందంబున ॥ నప్పుడె శిల్పులఁ బిలిచెన్
కామాటులఁ గొని కడువేగంబునఁ॥గార్యముప్రారంభించెన్
రామరామ తానీపదద్రవ్య మీ॥రాత్రి నిల్వ యార్లక్షల్
భీమవినుత నీకై వ్యయపఱిచిన॥స్వామి కందునేశిక్షల్. 46
దేహ మనిత్యం బని తానెంచుచు॥ధీరతగా నూహించెన్
సాహసమునఁదానివష్పైకమ్మును॥సరగునఁ దావ్యయపఱిచెన్.

——ఇదివినరయ్యా॥

వ. మరణకాలంబున నొకటియుఁ దనవెంటఁ రాదు గాన జీవిత కాలమందే భగవత్కైంకర్యములఁ జేయవలయు నని రామదాసుగారు తలఁచుచున్నారు.

రాగము-నాథనామక్రియ-ఆదితాళము.

పొయ్యేటప్పుడు వెంటరాదు ఒక
పుచ్చినవక్కైన
వెయ్యారులు దాఁచుకొనియు నర్థుల
కియ్యలేని లోభుల కయ్యయ్యో॥ పొ॥

౧

ఇచ్చినమాత్రం బిచ్చును దైవము
హెచ్చడిగిన రాదు
వచ్చేటప్పుడు వెంట నేమయినఁ
దెచ్చుకరాలేదు॥ పొ॥

౨

హెచ్చుగనిది తెలియనిపామరులు దు
రీహను తగులుకొని
యిచ్చట నార్జించిన ధన మెచ్చటి
కెత్తుకపొయ్యే రయ్యయ్యో॥ పొ॥

౩

తమరక్షణకై మూలమూలలను
ధనములు దాచేరు
తనువులు మలభాండము లస్థిరమని
తలఁచి కానలేరు॥ పొ॥

౪

తలఁతురు దారలు పశుపుత్రాదులు
తమ వని భ్రమ నేరు
తన వారెక్కడ తా నెక్కడనో
తనువువిడిచియీజీవుండొంటిగ॥ పా॥

౫

ఇరవుగఁ దొలిజన్మంబులఁబేదల
కియ్యనిదోషమునఁ
దిరిపెము లెత్తెడివారినిగాంచియుఁ
దెలియక యున్నారు॥ పా॥

౬

పరులకు బలిభిక్షంబులు పెట్టని
పరమలోభు లిలను
ధరలో వేంకటవిఠలుని దలఁపక
ధనమదాంధతను దగిలి యీజీవుఁడు॥ పా॥

వ. ఈ ప్రకారముగాఁ దలంచి గోప్పనగారు ఏమి చేయు చున్నా రనినా.

రాగము-కల్యాణి-ఆది తాళము.

కైంకర్యము చేసెను శ్రీరామదాసు
కైంకర్యము శ్రీ చేసెను
కైంకర్యము చేసెఁ శ్రీగానకుత్ స్థకులునకు
సంకటహరణా శ్రీసర్వాత్మ యని మొక్కి॥ ౬౦

౧

శ్రీకరమగు రా జితమణిశాలల
ప్రాకారంబుల బహుళమత పఙ్క్తుల
మంజులతరమగు మణిమంటపములఁ
గంజరాగమణి కలితాంగణములఁ
జాకచక్య కాం చనకూటంబుల
నాకాశంబును నంటెడు తేరుల
గోపుర మొరసెడి గోపురవితతుల
దీపించువిత ర్దికల బెడంగులఁ
దళుకుగులుకుపగ డంపుఁగంబములఁ
గలువడంబులను గలకలువడముల
రంగగుముత్యపు రంగవల్లికల
శృంగారము లగు చిత్రపాళికల
మకరతోరణ స మాజంబుల మణి
ముకురతోరణస మూహంబులఁ గడు
భుగభుగ వలచెడు పూఁజప్పరముల
నగరుధూపముల నాలవట్టముల
మెఱసెడిరీతిని మేలిమిగాఁగను॥ త్రైంశ।

౨

ధారాళము లగు ద్వారబంధములఁ
జారురత్న కాం చనశిఖరంబుల
గమగమ మనియెడు గంధవాసనల
ఘుమఘుమ యనుబలు కుంకుమరసముల
ఘణఘణ ఘణయను ఘంటలతలుపుల

ధణధణ యనెడు మృ । దంగవాద్యముల
మినమిన మెఱసెడి । మేలిమిగోడలఁ
గనకమయం బగు । గరుడధ్వజముల
రామరామ యను । రామశుకంబుల
వేమఱు పొగడెడు । విబుధగణంబులఁ
బొసఁగ మ్రోయు తం । బురలరవంబులఁ
గొసరియాడు భ । క్తులనృత్యంబుల
వైనతేయముఖ-వాహనచయములఁ
బూని శంఖ భుం । భుంనాదమ్ముల
మెఱసెడి రీతిని । మేలిమిగాఁగను॥ కై ॥

వెల్లగొడుగులను । వింజామరముల
మల్లెల మొల్లల । మంచివాసనలఁ
బిల్లంగ్రోవి గ । భీరస్వరముల
ఝల్లరి ఢక్కా । జయనాదంబులఁ
బల్లవపాణుల । పాటలనాటల
నల్లలితోత్పల । చయపరిమళముల
వనమాలాసం । పత్సౌరభముల
ఘనతులసీవన । గణగంధంబుల
రామభజనసం । రావోత్కరముల
రామతీర్థసా । రసముల తావుల
రామస్మరణా । రవమధురంబుల
రామభద్రవి । గ్రహదర్శనముల

హనుమద్గజవాహనముల ఘనముల
ననుపమశృంగారానందంబుల
రమణభద్రగిరిరామాలయ మ
త్యమరానందంబై ధరలోపల
మెఱసెడిరీతిని మేలిమిగాఁగను॥ కైకం॥

తోహరా.

గర్భగృహప్రాకారమంటపాల్ గట్టించెను గడుబాగ
నిర్భయుఁడై యార్లకులవరహాల్-నెమ్మది నెలవటు కాఁగ.
వ్యయముచేసికోవెలలోఁగాఁగల వైభవమంతయునించెఁ
భయములేక తనకోర్కి దీఱఁనని బాగుగనానందించెఁ.

వ. గోపన్న భద్రాచలమందు గోపురప్రాకారమంటపాది కైం
కర్యములు చేసి శ్రీరామచంద్రస్వామిని సేవించి యానం
దించి వర్ణించువిధం బెట్లనిన.

రాగము-మోహన-చాపుతాళము.

వందే రఘురామ-శుభనామ
శుభనామతులసీదళదామాభిరామ॥ శ్రీరామ॥

౧

కనకమణిమయహార-సుకుమార
సుకుమార పఙ్క్తిరథ సహితకుమార
సువిహార-అరిశూర-భూధరధీర-కల్మషదూర
పాలితవారణదారుణకారణమదహారణ
రఘువీర-రఘువీరనీరదాభవిమలశరీర-నిర్వికార॥ వందే॥

౨

వందితానిమేషా-సత్యభాష
సీతాననపంకజపూష-బుధతోష
దళితదోష-సజ్జనపోష-మానుషవేష
సంగరభీషణ భూషణదూషణశోషణనిజతోష
రత్నభూష-రత్నభూషనురాంభోజ
పుంజపత్యూష సుమనస॥ వందే

౩

కుంతలజితనీల-భక్తపాల-భక్తపాల
సురద్వేషివటులవిశాల-వరశీల
కనకచేల-కాంతిజాల-మానుషలీల
దానవబాలక-తావకసేవక
సురపాల-భూపాల-కౌస్తుభవక్ష
మాలవిశాల-సుకపోల॥ వందే॥

౪

ధరణిజసత్కళత్ర-సుచరిత్ర
మునిస్తోత్ర-హృదయాబ్జమిత్ర
సత్పవిత్ర-త్రిశిరోజైత్ర-నీరజనేత్ర
వారిదగాత్ర-విపులశాత్రవ భైరవకైరవ
పదమిత్ర-అజపవిత్ర-అజపవిత్ర
విభీషణపరభృతజైత్ర-అ రత్ర॥ వందే॥

౫

భూసురకల్పవృక్ష-సత్కటాక్ష
సత్కటాక్షవిరాధమదేభ హార్యక్షా

మృదుపదా-పంకరుహాదా-నిజరూపాదా
శత్రువిపదా-సువర్ణేక్షణ-వీక్షణ శిక్షణ
దాక్షణరామదాసా-భద్రాద్రీశా
అహో రామదాసా-భద్రాద్రీశా॥ వందే రఘు॥

రాగము-వరాళి-రూపకతాళము.

ఎంతో మహానుభావుఁడవు-నీవు
ఎంతో చక్కని వాఁడవు
వింతలు నీవు చేసితివి లోకమందు
సంతతభద్రాద్రి స్వామిరామచంద్ర॥ ఎం॥

౧

తొలివేల్పు జాంబవంతుని జేసినావు
మలివేల్పు పవనజుఁగా జేసినావు
వెలయ సూర్యు సుగ్రీవుఁగ జేసినావు
అల సర్వసురలఁగోఁతులఁ జేసినావు॥ ఎం॥

౨

కారణశ్రీ సీతగఁ జేసినావు
గరిమ శేషుని లక్ష్మణునిఁ జేసినావు
ఆ రెంటినిభరతశత్రుఘ్నులఁ జేసినావు
నారాయణ నీవు నరుఁడవై నావు॥ ఎం॥

౩

కాతికిఁ బ్రాణము లిప్పించినావు
నాతిమెంగిలి కానందించినావు

కోఁతిమూఁకల నెల్లఁ గొలిపించినావు
నీటిపైఁ గొండల నిల్పించినావు॥ ఎం॥

౪

లంకపై దండెత్తి లగ్గెక్కినావు
రావణకుంభకర్ణులఁ ద్రుంచినావు
పంకజాక్షిసీతమ్మఁ బాలించినావు
లంకేశుదివ్యపుష్పక మెక్కినావు॥ ఎం॥

౫

పరఁగ నయోధ్యకుఁ బఱతెంచినావు
పట్టాభిషిక్తుఁడ వై పాలించినావు
వరభద్రగిరియందు వసియించినావు
ధరలో రామదాసు దయనేలినావు॥ ఎం॥

తోహరా.

కొందఱు పురజను లప్పుడు కోవెలకొ త్తనాయె నని చూడ
నందఱు సంతస మందిరి గోపన నతిధార్మికుఁ డని యాడ.
హితు లాప్తులు తనకైనవారలును నెంతో యోజన సేయ
మతిలో సర్కారైవ్యకమనుచునఱు మాత్ర మెంచ లేఁడాయె
సర్కారై వ్యకము సెలవు చేయుటిది సరిగాదని యెవరనినన్
అర్కకులుం డగురఘుపతి నాకొక యాపద రానీఁ డనియెన్.

—ఇదివినరయ్యా॥

వ. గోపన్నగారితో హరిభక్తులు సర్కారుపైకము వ్యయము చేయుటచే నాపత్తు సంభవించు ననఁగా శ్రీరామదాసుగారు శ్రీరామచంద్రుల నమ్మినవారల కాపద గలుగ దని చెప్పు చున్నారు.

ఉ. వాలిని దాటకం దునిమి యాగముగాచియహల్యఁబ్రోచిసీ
తాలలనన్ వరించి రణదర్పిత రావణకుంభకర్ణము
ఖ్యాలి వధించిరాజ్యము సహాయంబుగ నేలినరామచంద్రభూ
పాలుఁడు రంగశాయి మనపాలఁ గలండు విచారమేటికిన్.

రాగము - నాథనామక్రియ ఆదితాళము.

తక్కువేమి మనకూ రాముండొక్కఁడుండువఱకూ

౧

ప్రక్కతోడుగా భగవంతుఁడు మును
చక్రధారి యై సాకుచు నుండఁగ॥ తక్కు॥

౨

ముచ్చుసోమకుని మును చంపినయా
మత్స్యమూర్తి మనపక్షమునుండఁగ॥ తక్కు॥

౩

సురలకొఱకు మందరగిరి మోచిన
కూర్మావతారుని కూరిమియుండఁగ॥ తక్కు॥

౪

దురాత్ముఁ గనక నేత్రునిద్రుంచినయా
వరాహమూర్తి మనవాఁడై యుండఁగ॥ తక్కు॥

౫

హిరణ్యకశిపుని నిరుచెక్కలు గాఁ
బఱచినసరహరి ప్రక్కను నుండగ॥ తక్కు॥

౬

భూమిస్వర్గమును । పొందుగఁ గొలిచిన
వామనుండు మనకు వాఁడైయుండఁగ॥ తక్క॥

౭

ధరలో క్షత్రియులను దండించిన
పరశురాముఁడు మనకుపాలిట నుండఁగ॥ తక్క॥

౮

దశగ్రీవు మును దండించిన యా
దశరథరాముని దయ మన కుండఁగ॥ తక్క॥

౯

ఇలలో యదుకుల మందుదయించిన
బలరాముఁడు మనకు బలిమైయుండఁగ॥ తక్క॥

౧౦

దుష్టకంసునిని । దుంచినట్టిశ్రీ
కృష్ణుఁడు మన పైఁ । గృపతో నుండఁగ॥ తక్క॥

౧౧

కలియుగాంతమున । గలిగెడు దైవము
కల్కిమూర్తి మముఁ గాచియు నుండఁగ॥ తక్క॥

౧౨

నారాయణదాసులఁ గాచెడిశ్రీమ
న్నారాయణు నెఱ నమ్మి యుండగా॥ తక్క॥

దోహరా.

బ్రహ్మోత్సవములు బ్రహ్మార్పణమని భాగవతుఁడు చేయించన్
బ్రహ్మజనకపదమందునునీగో వన్న యనుచుఁ బ్రజ లెంచన్.

ఈగతి భద్రాచలమున గోపన్నయోగభోగముల నుండన్
త్యాగభోగములసిరులఁ జెలఁగుమాదన్నగారుగోల్కొండన్.
అలగోల్కొండదివానులపుడు లెక్కలు తనిఖీలటుసేయన్
చిలుకార్లక్షలపైకము భద్రాచలమున నిలిచినదాయెన్.
కలఁకఁజెంది మాదన్నగారు అక్కన్నగారి కిది వినిచెన్
అలగోపన్నకు నిది దెల్పను నొకరాయప్పునివేగ మెపనిచెన్.
—ఇది వినరయ్యా!

వ. ఈ ప్రకారంబున అక్కన్నగారివద్దనుండి వచ్చినపరమా ప్తుండు గోపన్నగారితో గోల్కొండలోఁ జేరినతాలూకాల లెక్కలు తనిఖీసేయఁగా మీతాలూకాకు స్తీ ఆఱులక్షలపైకము నిల్వయేర్పడినది. అది తానీషాకుఁ దెలియఁజేయక ముందు గామీకుఁ దెలియఁజేయు మని అక్కన్నగారు చెప్పిరి వినుఁ డని యిట్లనియె.

క. అన్నా! ద్రవ్యముఁ బంపక
యున్నా విఁక నృపతితోడ నూర్జితముగ నే
విన్నపముఁ జేతు నని య
క్కన్నయుఁ దెల్పు మనె ననఁగ నతఁ డిట్లనియెన్.

క. శ్రీరాములకైంకర్యము
నారూఢిగఁ జేసి భద్రనగమందున మీ
కారుణ్యకటాక్షమునన్
ధీరుఁడ నై యున్నవాఁడ ధీరతతోడన్.

క. రాములకటాక్షవీక్షణ
మామోదము గాఁగ నున్న నఱలేకయ మీ

భూమీశువమ్ము పైకం
బేమాత్రము గొఱత లేక । యిఁకఁ జెల్లఁబడున్.

క. భూమీశునికృప గల్గిన
భూమీశునికృపయుఁ గల్గు । భూతలమందున్
భూమీశునికృప లేమిని
భూమీశునికృపయు లేదు । భూతలమందున్.

క. అని యిటులు చెప్ప వారలు
విని యాశ్చర్యంబు నొంది । వెసఁ జని యచటన్
గని యామంత్రులతోడను
వినినతెఱఁగుఁ జెప్పి రంత । విశదముగాఁగన్.

క. శ్రీరామ రామ యని వే
సారక శ్రీరామనామ । సారము గ్రోలున్
రారా రామా యని వే
మాఱును బిల్చుచును నట్టె । మైఁ దా మఱచున్.

వ. ఇవ్విధంబునఁ బల్కిన గోపన్న వాక్యంబులను నడతయును జెప్పఁగా విని వారు దీనాననులై యుండి రంత నిచ్చట గోపన్నగారితోఁ దమవారు అనేకవిధంబులుగా మందలించి సర్కారుపైకము వ్యయమైనందున రాజాజ్ఞకు లోఁబడని క్రమం బెట్లో విచారించుకొమ్మని చెప్పిన విని రామదాసు వారి కిట్లనియె.

తోహరా.

అని తనవారలు చెప్పినపలుకుల । నాలకించి యెంచకను
మనమున రామునిమఱవక యుండెను । మానఘనులుపొగడగను.

—ఇది వినరయ్యా॥

౬. నమ్మితి రామచంద్ర మదినమ్మితి రాజకులేంద్ర మేలుగా
నమ్మితిఁ గీర్తిసాంద్ర కడునమ్మితి దాసచకోరచంద్ర నా
నమ్మిక లేమి చేసెదవొ నమ్మఁగ నర్హులు గానివారలన్
నమ్మనయా! దయాబ్ధి వనినమ్మితి ని న్మది జానకీపతీ!

రాగము - నాథనామక్రియ - ఆదితాళము.

ఏతీరుగ నను దయఁజూచెదవో యినవంశోత్తమరామా
నాతరమా భవసాగర మీఁదను నళినదళేక్షణరామా॥ ఏ॥

౧

శ్రీరఘునందన సీతారమణా శ్రితజనపోషక రామా
కారుణ్యాలయ భక్తవరద నను గన్నది కానుపురామా॥ఏ॥

౨

మురిపెముతో నాస్వామివి నీవని ముందుగఁ దెల్పితిరామా
మఱవక యిఁకనభిమానముంచునీ మఱుఁగుఁజొచ్చితిని రామా॥

౩

క్రూరకర్మములు నేరక చేసితి నేరము లెంచకు రామా
దారిద్ర్యము పరిహారము సేయవె దైవశిఖామణి రామా॥

గురుఁడవు నామదిదైవము నీవను సురుశాస్త్రంబులు రామా
గురుదైవంబని యెఱుఁగక తిరిగెడు క్రూరుఁడనైతిని రామా॥

౫

తాండవమున నఖిలాండకోటి బ్రహ్మాండనాయకా రామా
బంధనమున నీనామము దలఁచిన బ్రహ్మానందము రామా॥

౬

వాసవ కమలభవ వామరవందిత। వారిధిబంధన రామా
భాసురవరసద్గుణములుగల్గిన। భద్రాద్రీశ్వర రామా॥ ఏ॥

౭

వాసవనుత రామదాసపోష కా। వందనమయోధ్య రామా
దాసార్చితమాకభయమొసంగవె। దాశరథీ రఘురామా॥ ఏ॥

తోహరా.

తప్పక పాచ్చా కొలువున నాయా। తాలూకాల్ సహజముగ
నొప్పగఁ బైకము వచ్చెనే యనుచు। నుద్యోగస్థులనడుగ.
అన్ని తాలూకాల్ పైకము వచ్చెను। అని యిచ్చిరి తమలెక్క
తిన్నగఁ జెప్పిరి హాజరత్ ఆభ। ద్రాచలమొక్కటిదక్క.59
ఏల రాదు భద్రాచలపైకం। బేమికారణం బనిన
చాలగ వ్యయపఱిచెనుగోపన్న యు। సర్కారై పైకములోన.
—ఇది వినవయ్యా॥

వ. గోపన్నగారు సర్కారై పైకమును వ్యయముచేసి భద్రా
చల సీతారామస్వాములవారి కైంకర్యములు చేసినా రని
యుద్యోగస్థులు చాడీలు చెప్పుచున్నారు.

రాగము-నాథనామక్రియ-ఆదితాళము.

వినవయ్య తానీషగారు-మా
మనవి చేకొనుఁడయ్య మహారాజా మీరూ వినః॥

౧

దినదినమును వారియింట-విప్ర
వరుల సంతర్పణ విందు లటంట

చేసేది సరకారుదంట-బుజువు
చేస్తాము హార్కార్ల-బంపుమాపెంట వినII

౨

దండికాం(పులు బలసి రందు-చేరి
చేసేటితంటాల నే మనుకొందు
ఆరూలతోలపైక మందు-
నిలిచ సర్కారుకు రాదికముందూII వినII

౩

బొక్కసములు పాడాయె-దే
వాలయములు బహు-చక్కగానాయె
లెక్కలు సరిలేదాయె-హా-
జూరూకు రూకలు రాకానె పోయెII వినII

౪

తత్త్రాధికారులు మీరు-తహ
సీలుచేసేటి యా గోపన్న గారు
చాలా తంటలు చేసినారు తా-
నీమపైకమంత కొల్ల గొట్టారుII వినII

౫

రామచంద్రుల నమ్మినారు-శ్రీ
భద్రాద్రిపురియందు బాగైయున్నారు
జాగుసేయక యింకమీరు-వారిని-
రప్పింపం దెలియు సన్నీకారుబార్లూII వినII

తోహరా.

ఇట్లని చెప్పిన, పాచ్ఛాకన్నుల నెఱ్ఱఁజేసి కోపించెగా
ఎట్లు ఖర్చుజేసెను గోపన్న కుకఎంత కుదర్తని యెంచెగా.61
హర్కారులు మీరాగోపన్నను నఱలేకందఱుఁ జూడ
సర్కార్పైకము లెక్కతో తెండిసకలఖాయిదాతోడ.
—ఇది వినరయ్యా.

క. గోపన్నను దోడ్తెమ్మని
భూపతి నియమించె భూరిభుజమ్లేచ్ఛుల ను
ద్దీపితయమభటుసములగా
చాపయుతులఁ గ్రూరమతులఁబటుతరఖలులన్.

తోహరా.

హుకుం చేకొని యిరువురుహర్కార్లూర్జితంబుగా వచ్చి
గ్రక్కున నాగోపన్న కారుబార్క చేరిలోపలఁ జొచ్చి. 63
క్యాజీ గోపన్న సలాం తుం దేఖ్ తానీషాబల్ హుకుం
ఆవుజీ ఊరోజీ చెల్జీ యని వారాడిరి నిష్ఠురవాక్యం. 64
—ఇది వినరయ్యా.

వ. హర్కారులు రామదాసుగారికిఁ దానీషాహుకుమునుజూపి రమ్మని చెప్పుచున్నారు.

రాగము - అసావేరి - రూపకతాళము.

ఆవుమ్యాఅమారపాచ్ఛాక్పాన్ చెల్ మ్యా
గోల్కొండకు చెల్ మ్యా అరేలేవుమ్యా
అంటే యేమోయాశించేవుమ్యా
అరే వుఠో వుఠో వుఠో చెల్॥ ఆవు॥

౧

తివాసి దండు బెర్యా నేఁడు
దిగూ నబాబువాళుకు మిదిమాకు
నబాబు మాతోసరిగా నేఁడు
చెప్పుకొనీమానముగాపాడు॥ ఆవు॥

అవరంగబాదు తఖ్తాలోనా
అనేకతహశీల్ దార్లున్నారు
వారలపై బాకీలు నున్నా
యేమో నీపై బాకీ శానా॥ ఆవు॥

౩

నిమిషమైనా నిలువనీయం
నిలువలన్నీ ఝూడాపైకం
చేకొనుము వేగమెయివుడు
జేర్బందు చేకొందుము చూడు॥ ఆవు॥

౪

అరలేకా నీవే యీసీమా
కధికారైన వెరువాము మీ
దొరభద్రాద్రిశ్రీరామ
దాసుఁడవని తాళితిమినుమ్మా॥ ఆవు॥

తోహరా.

ఈవిధినాడినవహార్కారులతో రెంతో హితవు మీఱఁగను
భావము దెల్పెఁడి సాధులార ఫకీర్యా దేమినర్కార్లోను.

అని యడిగిన హర్కారులుచెప్పిరికయన్ని ఖజానాల్ వచ్చెగా
విని సీతాలూక్ బాకీలే బహుకనింద యనుచుఁగోపించెగా.
ఇట్లనిచెప్పిన గోపన మనమునకనెలమి మీఱ యోజించెగా
ఎట్లుచేసినమరఘుపతియుండఁగకనెందుకుభయమనియెంచెన్.
—ఇదివినరయ్యా.

వ. ఈప్రకారంబున భద్రాద్రినుండి గోపన్నగారిని ఖండిత మైన విచ్చుకత్తిపహారాలతోఁ దెచ్చునప్పుడు భద్రాద్రినిల యనిం గూర్చి యేమని మనవిచేయుచున్నాడనిన.

చ. కటకట! రామచంద్ర ననుకగావఁగదే యిటు వేగ రాఁగదే
కుటిలమనస్కులై రిపులుకక్రూరభయంకరతర్జనంబులగా
బటుతరరోషభీషణతక బాధలఁ బెట్టఁగఁ దాళఁజాల నీ
పటువిశిఖంబులం దునిమికపాఱఁగఁదోలవె జానకీపతీ.

రాగము-పూరికల్యాణి-ఆదితాళము.

నీసంకల్పం బెటువంటిదో కన
నెంతవాఁడ రామా
వాసి దొలఁగి నీ—దాసజనులు భువి
గాసివడిన యాఘున మెవ్వరిదో॥ నీసం॥

౧

ప్రోచిన మఱి విడఁజూచిన నీకృప
గాచియుండుఁ గానీ
తోఁచితోఁచకను దొడరి కరంబులు
చాఁచి పరులనే యాచనసేయను॥ నీసం॥

౨

పటుతరముగ నీ - మటుమాయలకును
నెటువలె నోరుతును-
చటులతరంబుగఁ జెలఁగుభవాంబుధి
నెటు దాఁటుదు నే నెవరిని దూఱుదు॥ నీస॥

౩

భావజరిపునుత పరమపురుష నీ
భావము దెలియదుగా
దేవదేవ నీసేవకజనులకు
సేవకుఁడను నను గావుము మ్రొక్కెద॥ నీస॥

౪

దరిఁజేర్చెద వని ధైర్యముచే నీ
దరిఁ జేరితిఁ గానీ
అరసిప్రోవక యొయారడిఁబెట్టుట
నెఱుఁగనైతి నాదారవనుకొంటిని॥ నీస॥

౫

శరణాగతరక్షణ భవసాగర
తరణా రిపుహరణా
కరుణఁ జూడు భద్రాద్రినివాసా
అరమరసేయకు హరి నిను నమ్మితి॥ నీస॥

వ. గోపన్నగారు దేహ మనిత్యం బని తానీమహాతుమును జూచి
ధైర్యం బవలంబించి శ్రీరాముల స్తుతించుచున్నారు.

శా. శ్రీరంజిల్లెడుమోముతో మురువుగాశ్రీరాముమేల్ నేలుతో
గారుణ్యామృతధారతో ఘనలసత్కర్త్రవేయహేరాళితో

సారాస్నత్యవిభూషణప్రతతితో । శాంతస్వరూపంబుతో
రారా నాకభయప్రదానమియ రా । రామా మహీజాధిపా.

శా. ఏకన్మానదు దేవ మేవిధమునన్ । బోషించి రక్షించినన్
రాకన్మానవు హానివృద్ధులు మహా । రణ్యంబులో డాఁగినన్
గాకన్మానవు పూర్వజన్మకృతముల్ । కాఁగల్గునర్థంబులుం
లేక న్మానవ దెంత జాలిఁబడినన్ । లేముల్ సిరుల్ రాఘవా.

వ. ఇట్లు చింతించుసమయంబున.

తోహరా.

ఖైదుచేసికొని గోపన నప్పుడు । కారుబార్లు వెడలించి.
హైదరబాదుకుఁ దోడుకపోయిరి । యటుషారాలోనుంచి.
ఈవిధముగ గోపన్నను హర్కా । ర్లేపునఁ గొనిపోవఁగను
భావజుఁగన్న భద్రాచల రాముల । భావమందు నిడుకొనెను.

—ఇది వినరయ్యా॥

ఉ. నమ్మిన నిన్ను నమ్మవలె । నౌనది యట్లవిరోధితమ్మునిన్
నమ్మిన రాజుఁజేసితి వ । నాథులపాలిటిదైవ రాయ నే
నమ్మ మఱెవ్వరిన్ మిగుల । నమ్మితి నిర్మలకర్మ చిత్తవా
క్యమ్ముల నిన్ను నమ్మితి న । ఖండకృపానిధి జానకీపతీ।

రాగము-తోడి- ఆటతాళము

రామా దైవశిఖామణీ-సుర
రాజ మనోజ్జ్వల భూమణీ
తామరసాక్ష సుధీమణీ-భవ్య
తారక భక్త చింతామణీ॥ రా॥

౧

నాఁడే మిము వేఁడు కొంటిఁగా-శర
ణాగత బిరు దని వింటిఁగా
వేడుకై మిము పాడఁగంటిగా-నన్ను
దిగవిడనాడ వద్దంటిఁగా॥ రామా॥

౨

చింత సేయఁగ నేమి లేదుగా-ముందుఁ
జేసిన గతి దప్పఁ బోదుగా
ఇంతకు మిక్కిలి రాదుగా-నే
నితరులఁ గొలిచేది లేదుగా॥ రామా॥

౩

తమ్ముఁడు నీ వాక్కు జంటను-రామ
దాసుని రక్షించుకుంటను
సమ్మతి నుండు మాయింటను-భద్రా
చలవాస నీబంటుబంటను॥ రామా॥

రాగము - యమునా - చాపుతాళము.

దీనదయాళో-దీనదయాళో
దీనదయాపర-దేవ దయాళో॥ దీన॥

౧

కనకాంబర ఘనశ్యామ దయాళో
సనకాది ముని యోగివినుత దయాళో॥ దీన॥

౨

శరధిబంధన రామచంద్ర దయాళో
వరదామరబృందానంద దయాళో॥ దీన॥

౩

నారద మునిదేవనాథ దయాళో
సారసాక్ష రఘునాథ దయాళో॥ దీన॥

౪

దశరథసుత లోకాధార దయాళో
పశుపతిశ్రీచాప భంగ దయాళో॥ దీన॥

౫

ఆగమకల్పిత అమితదయాళో
భోగిశయన పరమ పురుష దయాళో॥ దీన॥

౬

వర భద్రాద్రినివాస దయాళో
పాలితశ్రీరామదాస దయాళో॥ దీన॥

ఉ. అంటినభక్తిచేతను భక్తియం బొకయించుక లేక నమ్మినే
మంటిని బంటుబంటుఁ గడుకన్నొప్పికి మిక్కిలి తాళనంటి నీ
కంటక మేటి కంటి నను గాచుట నీ కిది ధర్మమంటి నా
కంటికి రెప్పరీతి ననుఁ గావు మ టంటిని జానకీ పతీ!

రాగము - యమునాకల్యాణి-ఆదితాళము.

గరుడగమన రారా-నను నీ
కరుణ నే లు కో రా
పరమపురుష యేవేళవు లేల నీ
మఱుఁగుఁ జొచ్చితిని అఱమఱ సేయకు॥ గరుడ॥

౧

పిలువఁగానె రమ్మి-యభయము
తలఁపఁగానె యిమ్మి

కలిమి బలిమి నా కిలలో నీవని
పలవరించితిని నలువను గన్నయ॥ గరుడ॥

౨

పాలకడలిశయనా-దశరథ
బాల జలజనయనా
పాలముంచు నను-నీళ్ళముంచు నీ
పాలఁబడితి నిఁక జాలము సేయక॥ గరుడ॥

౩

ఏల రావు స్వామి-నను నిపు-
డే లు కో వ దే మి
యేలువాఁడ వని చాల నమ్మితి నిఁ
కేల రావు కరుణాలవాల హరి॥ గరుడ॥

౪

ఇంతపంతమేలా-భద్రగి
రీశ వర కృపాలా
చింతలణఁచిశ్రీ రామదాసుని
అంతరంగపతి వై రక్షింపుమి గరుడ॥

తోహరా.

రామరామ నన్నిటు సేయుట నాకెవ్రాఁతఫలమొ నీవలిగో!
కోమలదేహ! కుజనులచే ననుకొట్టించగ మతి గలిగో. 70

—ఇదివినరయ్యా॥

ఉ. ఏమిర రామచంద్రయిఁకనేటికి నేఁచెదు మాటిమాటికిన్
బామరుఁ డౌటనో మిగులఁబాతక జాలములోన నుంటనో

యేమి యొనర్చిన స్సుతుని యొగ్గులఁ దండ్రికిఁ గిన్క పుట్టునే
నీమదిఁ జిత్తగింపు మిఁక నిక్కము నమ్మితి జానకీపతీ.

వ. ఓభద్రాద్రీశ్వరా! నేను బూర్వజన్మంబునఁ జేసిన కర్మశే
షమో లేక మీకరుణకుఁ బాత్రుండనను గానియో యీదు
ర్మతులచేఁ గొట్టించుటకు మనస్సు కలిగియో యివ్విధంబు
గా నన్ను జేయించుట తగునా యని నుతిచేయుచున్నారు.

రాగము - నాథనామక్రియ - ఆదితాళము.

ఏమిరా రామా-నావల్ల నేరమేమిరా రామా
ఏమిరామయీలాగుకష్టము-నీమహిమో నాప్రారబ్ధమో॥

౧

కుండలిశయన వే-దండరక్షకా
ఖండతేజ నా-యండనుండవే॥ ఏ॥

౨

పంకజలోచన-శంకరనుత నా
సంకట మార్పవె-పొంకముతోను ఏ॥

౩

మందరధర నీ-సుందరపదముల
నిందిరేశ కనుఁ-గొందుఁ జూపవే॥ ఏ॥

౪

దినమొకయేడుగ-ఘనముగఁ గడపెడి
తనయునిమీఁదను-దయలేదయయో॥ ఏ॥

౫

సదయహృదయ నీ-మృదుపదములు నా
హృదయకమలమున-వదలక నిల్పెద॥ ఏ॥

౬

రామరామ భద్రాచలసీతా
రామదాసుడను-జేమమలో నేలవే ఏమి॥

తోహరా,

బాగాయెను నిను నమ్మినందులకు ఁభోగిశయన రఘురామా
జాగుసేయకను బ్రోవసమయమిది ఁజగదీశ పరంధామా॥
—ఇది వినరయ్యా.

వ. స్వామీ నిన్ను నమ్మినందులకు నిటులఁ జేయుట తగదు; రక్షించుట కిది సమయ మని మొఱలిడుచున్నారు.

రాగము-శంకరాభరణము-రూపకతాళము.

రక్షింపవిదియేమో-రాచకార్యముపుట్టె-రామచంద్రా
నన్ను రక్షింపకున్నను-రక్షకు లెవరింక-రామచంద్రా॥
రక్షింప విదియేమో॥

౧

అప్పులవారిదో-అరికట్టుచున్నారు-రామచంద్రా స్వామి
చెప్ప శక్యముకాదు-చతుర్గోచరమాయె-రామచంద్రా॥
రక్షింప విదియేమో॥

౨

కుక్షిలో మిమ్ముఁదఁ-గోరిక పుట్టెను-రామచంద్రా స్వామి
ఇక్ష్వాకు కులతిలక-యిఁకనైనఁ గావవే-రామచంద్రా॥
రక్షింప విదియేమో॥

౩

పక్షివాహనా-పాలించి దయఁజూడు రామచంద్రా స్వామి
అక్షయకటాక్ష-అభిమాన ముంచవే-రామచంద్రా॥
రక్షింప విదియేమో॥

౪

అధికుని చేపడితి-అడ్డమేమనుకొంటి-రామచంద్రా స్వామి
అధములకన్నను-అన్యాయమైపోతి-రామచంద్రా॥
రక్షింప విదియేమో॥

౫

భయమేమి నే రామ-దాసుఁడననుకొంటి-రామచంద్రాస్వామి
భయము-బాపిప్రోవుభద్రాద్రిపురనిలయ-రామచంద్రా॥
రక్షింప విదియేమో॥

వ. ఓ భద్రగిరినిలయా! నానుతుల నంగీకరించి యీయాపద
లను బాపి రక్షింపు మని మనవి సేయుచున్నారు.

రాగము-అసావేరి-రూపక తాళము.

రామా నామనవి చేకొనుమా-దైవ
రాయా పరాకు సేయకుమా
స్వామి భద్రాచల-ధామ పావనదివ్య
నామ గిరిజానుత భీమపరాక్రమ రామా॥

౧

దరి లేనిదీనజనులను-గాచు
బిరుదుఁ బూనితివి ఖ్యాతిగను
గురుతర శమనకింకర బాధలకు నీ
మఱుఁగుఁ జేరితి నన్ను అమర సేయకు రామా॥

౨

కపటమానసుఁ డని మతిని-నెన్న
కిపుడు రక్షించుమా సమ్మతిని
అపరాధములకూ నే నాలాయమైతిని
కృపఁజూడుము నాదు-నెపములెన్నక స్వామి॥ రామా॥

౩

పతితపావనమూర్తివైన-నీవే
గతి యని యుంటిమతిలోన
సతతము రామదాసపతివై భద్రాద్రిని
అతులితవైభవ-గతులచే నెలకొన్న॥ రామా॥

వ. ఓభద్రశైలాధివాసా ! మిమ్ముఁగాక నే నన్యమెఱుంగను కన్నడసేయక కాపాడు మనుచున్నారు.

రాగము-శంకరాభరణము-ఏకతాళము.

ఇరతము లెఱుఁగ నయ్యా-
నా-గతి నీవేరామయ్యా
సతతము సీతాపతి నీవే యని
మతి నమ్మితి సద్గతిఁ జెందింపుము॥ ఇతర॥

౧

కోపము సేయఁగవద్దునా
కోరిక లొసఁగు యిూపొద్దు
పామరుఁ డని విడువవద్దు
నాపాపముఁ బాపు మిపొద్దు

ప్రాపు దాపు నాప్రాణము నీవే
యీపట్టున నినుఁ బట్టువిడువ నిఁక॥ ఇతర॥

౨

తప్పు లెన్న వలదంటి-నా
తల్లి దండ్రి నీ వంటి-మా
యొప్పులకుప్పవటంటి-మా
యప్పవు నీ వనుకొంటి
అప్పటప్పటికిఁ దప్పక నీవే
తిప్పలఁబెట్టక తీర్చిదిద్దుకొను॥ ఇతర॥

౩

నామీఁదను దయరాదా-రామ
నామనవిని వినరాదా
వేమఱు నాతో వాదా-నను
వెఱవకుమీ యనరాదా
ప్రేమ మీఱ మాభద్రాచలపుర
ధాముఁడవై రామదాసుని నేలుమి॥ ఇతరము॥

వ. నే నపరాధి నైనను క్షమించి రక్షింపు మని స్తుతింపు చున్నారు.

రాగము - అసావేరి - ఆదితాళము.

నాతప్పులన్నీ క్షమించుమీ-జగ
న్నాథ నీవాఁడ రక్షించుమీ
పాతకుఁ డని యెంచఁబనిలేదు పోషింప
దాత వనుచు నీపదమ్ములే నమ్మితి॥ నా॥

౨

ఈయెడ నానేర మెంచకు-నా
హితవున ద్వేషము లుంచకు
చేయరాని దెల్లఁ-జేసితి క్షమసేయ
కాయ తీఁగెకు నెగ్గు-గా దని మొ్రక్కెద॥ నా॥

౩

కడుపునఁ బుట్టిన తనయుఁడు-ఎంతో
దుడుకుతనము చేసే టప్పుడు
కొడుకా రమ్మని చే-కొనుగాని నూతిలోఁ
బడఁద్రోయునా యెంత-పాపాత్ముడై నాను॥ నా

౪

దాసునిమనవి చేకొంటివా-చక్ర
ధర యిఁక నన్నేలుకొంటివా
నాసామి వీవని నమ్మితి భద్రాద్రి
వాసుఁడవై రామదాసు నేలినతండ్రి॥ నా॥

తోహగా.

ఈవిధమున శ్రీరాములఁ దలఁచుచుఁ నేఁగెను పాద్చాసభకు
భూవరుఁ డగు తానీషా దెమ్మనెభూసురవరుఁ దనకడకు
తెచ్చిరి గోపన్నను పహారాలోఁ దేజరిల్ల దెంపునను
వచ్చినభూసురుఁ జూచి తానిషావైర మెంచి యిట్లనెను.

—ఇది వినరయ్యా॥

## ఫాదుషా రామదాసుల సంవాదము.

రాగము-నాథనామక్రియ-ఆదితాళము.

౧

ఫా:—రండీగోపన్నగారు-మాపైక
ముప్పించండీ వేగామె మీరు
భూమండలములోని గోల-కొండ తురక వాఁడుచాల
బండాఁడనినుంతైన నీగుండెలోననుంచవైతి॥ రండీ॥

గో:—వినుఁడీ తానీషగారు-ఏలనాపైను
ద్దండా కోపము చేసేరు
కండకొవ్వుచేత నేను-తుంటరికము సేయనుభూ
మండలములో మీకీర్తి-నిండగల్గఁ జేసినాను॥ వినుఁడీ॥

౨

ఫా:—తాసంపాదించి చేసిన-ధర్మానఁ గల్గును కీర్తి
యేశాస్త్రజ్ఞుఁడు ఇప్పుడు-నీకీమతి గల్పించినాఁడు॥రండీ॥

గో:—ఘన మైనమీనగరు కొక్క-దినముఖర్చు కనదుస్వల్ప
ధన మిదిగో మీభద్రాచల-పురములో గుడి కట్టినాను॥
వినుఁడీ॥

౩

ఫా:—బలవంతులధనము-వారి-సెలవు లేక ఖర్చుసేయ
తలపోవునని మదిలోఁ-దలపోయవైతి విదేమి॥ రండీ॥

గో:— అస్థిరమానీ దేహ మెట్లా-నెఱనమ్మలేదు నీయట్ల
దొరభద్రాచలశ్రీరామ-దాసుఁడనై చేసితిఁజుమ్మా॥
వినుఁడీ॥



89. గోపన్నను తానీషావద్దకు భటులు కట్టితెచ్చుట. తానీషా ఖైదులోనుండుమని ఆజ్ఞయిచ్చుట.

తోహరా.

గోపనధైర్యస్థైర్యములను గని । కోపమంది తానీష
యేపున నీమద మణగించెద నేనిప్పుడుచూడు తమాష.74
సాలాఖరులో సర్కారైవ్రకము।సరిగ నేలరా దోయి
చాలాతప్పును చేసినావు నా।చనవు నీపయి లేదోయి. 75
నన్ను నెంచకపోయిననూ నా।జాతిని నెంచఁగ రాద
తన్నుఁ దెలియక సెలవు చేయుటకు।తానిష పైకముగాద.
వెక్కస మందక పైకం బంతయు । వేగమె యిస్తున్నావ
కక్కసమైన మామాలుం మేరకు।ఖైదున నుంటున్నావ. 77
పైకం బడిగిన పలుకులు తడఁబడి ।పలుమాటల నాడెదవు
మైకమందినటువలె నున్నాఁడవు।మామన్ జెఱుఁగవె నీవు.78
అని తానీషా యడిగినపల్కుల । నాలకించి గోపన్న
విను తక్సీర్ నే జేసినతప్పులు । వినిపించెద ఘను లెన్న.
నీవు పంపినతహసీల్ పనిలో । నిజముగాను నేనున్న
భావములో హరిభక్తి విడక బహు।భద్రముగానే యున్న
జీవాధారుఁడౌ రామునికో వెల।జీర్ణోద్ధారణ నేనుఁ
నీవాఁడై నేఁ జేసితి హాజరత్ । నీధర్మం బది యనెను.81
గోపన చేసినకైంకర్యమునకుఁ । గొంతదడవు నూహించి
యేపునమునుపటినుకృతమునమున।నెలమిఖిలయోజించి
గోపనపైనే కోపము నేయక । కొంచెముగా విడిచినను
తానగిదిగఁ దహసీల్ వార్లందఱు।నెంచక నడుతురుతుదను.
అనుచుఁ దానిషయునందఱువినహా।ర్కారులతో నిట్లనెను.
వినుడీఁక నొకవారములోఁ బైకము।లెల్ల వసూల్ కావలెను.

అని తానీషాయాగోవన్నను నవుడు బందిఖానకును
గొనిపొమ్మనికూ్రరముగాఁబల్కెనుకొంత లేక మనమునను.

—ఇదివినరయ్యా॥

వ. తానీషాగారు శ్రీరామదాసులవారిని ఖయిదుకుఁ దీసికొని పొమ్మను మని హర్కారులకు నుత్తరవులు చేయుసమయంబున రామదాసుగారు శ్రీరాములవారిని రక్షింపు మని మొఱ పెట్టుచున్నారు.

ఉ. దీక్షవహించి నాకొలఁది దీనుల నెందఱఁ గాచితో జగద్రక్షక మున్ను నాదుప్రవదరాజతనూజ దలంచినంత నే యక్షయమైనవల్వ లిడితక్కటు! నామొఱలాలకించి ప్రత్యక్షముగా వదేమిటికి దాశరథీ కరుణాపయోనిధీ.

రాగము—పాటకురంజి—ఆదితాళము.

ఏడ నున్నాఁడో-భద్రాద్రివాసుఁ-డేడ నున్నాఁడో
నాపాలిరాముఁ- డేడ నున్నాఁడో

౧

ఏడ నున్నాఁడో జాడ దెలియరాదు
నాఁడూ గజేంద్రునికీడుఁ బాపినస్వామి॥ ఏడ॥

౨

ద్రోణిబాణజ్వాల దాఁకినబాలునికిఁ
బ్రాణ మిచ్చినజగ-త్ప్రాణరక్షకుఁడు॥ ఏడ॥

3

పాంచాలిసభలోన-భంగమొందిననాఁడు
వంచన లేకయె వలువ లిచ్చినతండ్రి॥ ఏడ॥

౪

దూర్వాసుఁ డుగ్రము-తో ధర్మసుతుఁ జూడ
నిర్వహించిన నవ-నీతచోరకుఁ॥ ఏడ॥

౫

అతిశయముగ శ్రీభ-ద్రాచలమందున
సాక్షాత్కరించిన జగదేకవీరుఁడు॥ ఏడనున్నాఁడో॥

దోహర.

గోపన నప్పుడు బంధిఖానకుఁగొనిపోవుటను జూచి
యాపట్టణమున నందఱు వగచిరికయను తాపముమదిఁదలఁచి
పోవుచుండఁబ్రజలెల్లరుపురపురకబొక్కుచుదమమదిఁ గుంది
దేవుని రాముని దూఱుచు నుండిరికదీనతతో వగఁ జెంది,
—ఇది వినరయ్యా॥

వ. ఇవ్విధంబున దశరథకుమారస్మరణాయత్తచిత్తుండై తన్నుం గనినపురజనంబు లార్తహృదయులై పరివేదనంబు నొందుచుండం బ్రభునియాజ్ఞానుసారు లైనహర్కారులు బందిఖానాకు గొనిపోవుసమయంబున గోపన్న శ్రీరాముని నిట్లుపేక్షింపందగునా ? యని వేఁడుకొనుచున్నారు.

రాగము-శంకరాభరణము-రూపకతాళము.

తగునయ్య దశరథరామచంద్ర-దయఁదలఁచవేమి-నీకుఁ
బగవాఁడనా యెంతో బతిమాలినఁ గాని పల్కవేమి తగు॥

౧

నగుమోము జూపర-నాయన్న నినుజాల నమ్మినాను-ఇంత
అగడుగఁ జూచిన-నామీఁదనెవరిపాలయ్య నేను తగు॥

౨

పతితులనెల్లఁ బావనులఁ జేయుదునని పలుకనేల-ఇపుడు
అతిఘోరఖలుల మనుచు మమ్ముని విడనాడనేల తగు॥

౩

మన్నించి కావరాకున్నాఁడవే రామా నిన్ను మాన-నే
నిన్నె కాని పరుల నెన్నఁబోను నాకన్నులాన తగు॥

౪

వదవడి మిమ్ముఁ జేరఁబడినవారలను జేపట్టలేదా-నన్ను
వదలిన మీవంటి-వారికి నపకీర్తి పోదుకాదా తగు॥

౫

అనుదినము భద్రాద్రిధాముఁడవని నిన్నరసినాను-నేను
వినయముతో రామదాసుఁడనని విన్నవించినాను॥తగు॥

చ. కుక్షి నజాండపంక్తులొనరఁగూర్చి చరాచరజంతుకోటి సం
రక్షణ సేయుతండ్రివి పరంపరగాఁ దనయుండనైననా
పక్షము నీవు గాఁగదవె పామరుఁడన్ గరుణించు మోజగ
ద్రక్షక కర్తవీవె కద దాశరథీ! కరుణాపయోనిధీ.

రాగము-నాథనామక్రియ-ఏకతాళము-

నెలవా మాకు-నెలవాయీచెలి కేఁగ॥ నెల॥

౧

నెలవా మాకిఁక జలజసంభవనుత
జలజాతనేత్రసజ్జనమిత్ర శ్రీరామ నెల॥

౨

నీవాఁడ నన్నేలుకోవా-యిటు
వేగ రావా సమయముకావ రామయ్య నెల॥

౩

వాసిగ భద్రాద్రివాసా వరరామ
దాసహృదయనివాసా రామయ్యా॥ నెల॥

వ. ఇవ్విధంబున రాముని దలంచుసమయంబున.

తోహరా.

భూపతి యుంచెను బందిఖానలో ॥ భూరిబటులసంఘముతో
గోపన నవ్వుడు ద్వాదశసమములు ॥ ఘోర మైనశీతులతో
తాపము నొందుచుఁ జింతించెను శ్రీ॥ సీతారామాయనుచు
శ్రీపతిరక్షకుఁడని తానుండెను॥ శ్రీహరి హరి హరియనుచు.
—ఇది వినరయ్యా॥

వ. ఈప్రకారముగా రామ స్మరణ సేయుచు వచ్చుచుండెడిరామ
దాసుగారినిహర్కారులు కారాగృహప్రవేశము సేయించిన
తరువాత నప్పరమభాగవతకులాలంకారుం డేకచిత్తుం డై
దేవా ! నా మొఱ నాలకింపక యెం దరిగితి వని శ్రీరామ
దేవుని వేఁడుకొనుచున్నాడు.

రాగము-ఆనందభైరవి-అటతాళము.

ఎటుపోతివో రామ యెటు పోతివో

౧

ఎటు పోతివో నిన్ను ॥ నే వేఁడుకొనుచుంటి
కటకటా నేఁడు నా॥కనులఁ జూతామంటె॥ ఎటు॥

౨

అంధకారమువంటి ॥ బందీఖానలో నున్న
నిందల నెడఁబాపు॥నీకు మ్రొక్కెదస్వామి॥ ఎటు॥

౩

పాపము లన్ని యెడఁ బాపెడివార వీవు
ఆపద దీర్చి నన్నాదుకోమ్మంటి స్వామి ఎటు॥

౪

తానీషగారు వచ్చి తరి తీర్పుఁజేసేరు
పైకముఁబంపించి వేగ బందీఖానా వదలింపక ఎటు॥

౫

అపరాధి నని చాల నతిచేసి మొఱలిడఁగ
నెపముగ వెనుకటి నేరముల నెంచుక ఎటు॥

౬

అప్పులవారువచ్చి యరికట్టుచున్నారు
ఒప్పుకోఁబడునని చెప్పక దాఁగితివే ఎటు॥

౭

నీవు భద్రాచలనిలయుఁడ వయ్యా రామ
ప్రోవవయ్యా రామదాసు నేలెడిస్వామి ఎటు॥

చ. అగణితజన్మ జన్మదురితాంబుధిలో బహుదుఃఖవీచికల్
తెగిపడ నింద లేక జగతీధవ నీపదభక్తినావచేఁ
దగిలి తరింపఁ గోరితి పదంపడి నాదుభయంబు దీర్పవే
తగ వగుచిక్కులన్ని డక దాశరథీ కరుణాపయోనిధీ.

వ. ఈప్రకారంబున రామదాసుగారు కారాగృహంబునం బడి మొఱ లిడుసమయంబున బందీఖానా లేఖకులు పావుసేరు బియ్యమును పావుసేరు ఉప్పును కలిపి బత్తెము కొలువఁగా రామదాసుగారు ఈయన్నము నేలాగున భుజింతును ఓభద్రాద్రినిలయా యని మొఱపెట్టుచున్నారు.

రాగము - కాంభోజి - చాపుతాళము.

కటకట నీదుసంకల్ప మెట్టిదో కాని
కన నెంతవాఁడరా రామా
నిటలాక్షుఁడు తొల్లి నీమాయ గన లేక
తటుకున నీవలఁ దగిలెను గనుక — కట॥

౧

శరణన్న జనముల-బిరబిర బ్రోచెదు
బిరుదు గల్గినదొరవే-ఓరామ
సరిపరివిధముల-మొఱలిడ వినక న
న్నలమట చేసిన-హరి నిన్నేమందు — కట॥

౨

భావజజనక నా-భావ మెఱుంగ వె
వేవేగ దయఁ జూడవే
దేవాదిదేవా యో-దీనశరణ్యా
నీవే దిక్కని నిక్కము నమ్మితి — కట॥

౩

గీర్వాణనుత భద్ర-గిరివాస సర్వ
యోగీశ్వరేశ్వర రామా
సర్వాత్మ రామదాసహృదయాబ్జనిలయా
సర్వాధార పరాకేల రామా॥ — కట॥

తోహరా,

కనుఁగొని గోపన కమపనుం డైక కరుణాసాగర రామా
మనఁగల నేయిూయన్నము దినియేకమార్గము నాకిఁక రామా
—ఇది వినరయ్యా.

రాగము - బేగడ - ఏకతాళము.

ఏలాగు తాళుదు నేనిసేతు రామా
ఈజాలి చేతను దాళఁజాలను రా
దీనజనుల కెల్ల దిక్కు నీవే రామా
మనమున నిన్ను నేమఱవ నో రామా ఏ॥

౧

పావనమూర్తి యోపట్టాభిరామా
కావ నే యీవేళఁ గౌసల్యరామా
శరణని నీమఱుఁగుఁ జేరితి రామా
శరణన్నఁ గాచెడి బిరుదురఘు రామా ఏ॥

౨

ఎన్నరాని ప్రేమ నెందు దాఁతువ రామా
ఆపన్నరక్షకుఁడవె నాపాలిశ్రీరామా
నీసొమ్ము నే ననుట నిజమె యో రామా-నా
దోసములన్నియుఁ దొలఁగించు రామా ఏ॥

౩

జాతికైనఁ జెమట రంజిల్లు రామా-ఆ
తీరు నీమనసునొందదు రామా
వాసిగ నామకీర్తనఁ జేసితిని రామా
రామదాసుని నిట్టుపై రక్షించు రామా ఏ॥

వ. ఈరీతిని స్తుతియించుచుతత్తి సతండు వచనంబుఁ జేసికొనినయ న్నంబు దివ్యాన్నంబై యుండెనంతటఁ బ్రతిదినంబును నా లేఖకు లాసంగుబత్తెంబును బచనంబు చేసి భుజియింపుచు

నబాధితుండై యుండం గొన్ని దినంబులకు తానీష గోవ న్నను బందీఖాన నుంచి బహుదినంబు లయ్యును పైకంబు వసూలు గాకయున్న యది యతం డెటులనున్న వాఁడో విచా రింపుద మని బందిఖానాకాపుదారిభటులను బిలిపించి య డుగ వారలు ఆగోపన్న కాలద్వయంబును దమ రిచ్చు బ త్తెంబుచే నేబాధయు లేక రేయుంబవలును రాముండను నొకనిఁ బేరొ్కని యఱచుచుండుటగనియెద మింతియకాని పైకం బిచ్చునాలోచన చేయుట లే దనిన విని కోపోద్దీపి తుండై ప్రత్యహంబు కొరడాలతోఁ గొట్టునటుల నాజ్ఞా పింప నాబందిఖానాకాపుదారులు కొరడాలతోఁగొట్టుటకు నారంభించిన రామదాసుగారు ప్రయాసకుఁ దాళఁజాలక రామునిం గూర్చి పలవించుచున్నారు

ద్విపద.

రామదాసును భటుల్ రాజసంబునను
సీమలో జనములు చింతిల్లి చూడ
ముప్పిరి తాళ్లను ముసని రెట్టలకుఁ
దెప్పునఁ దగిలించి తేజంబు దూల
పురములో నిజనంబు లరయఁ ద్రిప్పుచును
దరము గానిదురు క్తినురుభుజపీడ
నంబుల రొప్పుల నార్భాటములను
నంబోధి మొఱయుచం దంబునఁ జేసి
యోరిపాతకుఁడ నీయుబ్బణంచెదము
వేఱుబుద్ధులు మాని వినుము మాపలుకు

గొబ్బునఁ జెల్లించు । గోల్కొండ దస్తు
నిబ్బరంబున నుండ । నీ యబ్బసొమ్మె
చెల్లింపకున్నఁ జెచ్చెరఁ గొనిపోయి
విచ్చలవిడిగను । వేధింతు మనుచు
మండలేంద్రుని ముఖ । మంటపంబునకు
దండతాడితుఁ జేయఁ । దగురీతిఁ దెచ్చి
కట్టిరి చేతులు । కాళ్లు కంబమున
కొట్టిరి కొరడాలఁ । గొయని యార్య
పట్టమి గానక । భాగవతుండు
ఆర్తి మొఱలిడఁబూనె । హరిని దలంచి.

రాగము - అసావేరి - ఆదితాళము.

అబ్బబ్బా దెబ్బలకుఁ దాళలేర-రా-
మప్పా గొబ్బునననాదుకోర॥ అ॥

౧

మేలు సేయఁగ లే-నంటిఁగదరా-మేల్
చేసితిఁ కేమి భయ మంటిఁ గదరా
వరహాలు మొహరీలు జమచేస్తిగదరా
నీపరిచారకులకు నేఁ బంచిపెట్టితి గదరా॥ అ॥

౨

పరుల కొక్కరువ్వయినా లేదు గదరా
ఓపరాత్మ నీపాదములు నమ్మినారా
కొరడాలుతీసుక కొట్టిరిగదరా
హరనుత గోవింద హరి తాళలేరా॥ అ॥

౩

ఆత్మలోపల నిన్ను నెఱనమ్మినారా
శరణాగతత్రాణ బిరుదేమైనదిరా
శరధి బంధించినశౌర్య మెక్కడరా
రాక్షససంహార-రక్షింపవేరా॥ అ॥

౪

రామా భద్రాద్రిశ్రీరామ రామా-నీ
నామ మెప్పుడుభజియించితిఁగదరా
రామదాసునినిటులఁజేయించితేరా॥ అ॥

౫. ఈప్రకారంబున శ్రీరాములంగూర్చి పలవించుతఱిరాముం డు భక్తపరాధీనుండు గావున నాతనిమాహాత్మ్యంబుననా దెబ్బలవలనం గలుగుశ్రమ నివారణం బగుచుండ నొక తఱి నాభటులు సేయుబాధలం దలంచుకొని యిట్టిదుర్జ యుల యాజ్ఞాబద్ధుఁడనై యుండునటులఁ జేసితిగదా స్వామి యని విచారింపు చున్నారు.

సీ. ఎన్నఁటిదాఁక నోర్తునిఁక నెన్నఁడు నాకనుకూలుఁడయ్యెదో
విన్నప మెంత చేసినను వీనులు మూసుక యున్నయట్లు నీ
వున్న దియేమికారణమొ యొక్కనిమాత్రమునన్నుఁగావు
నీకన్నను నాకు దిక్కెవరు గల్గుదు రీయెడ జానకీపతీ!

రాగము - బిలహరి - అటతాళము.

రక్షించు దొరవని నమ్మితి-నన్ను-
శిక్షింపఁ దప్పేమి చేసితి?

రక్షింప మీకంటె రాజు లెవరున్నారు
దాక్షిణ్య మింతైనఁ దలఁపున నుంచవు॥ రక్షిం॥

౧

నీపాపె నెఱనమ్మి యుంటిని-నన్ను
గాపాడుబిరుదు నీ దంటిని
చేపట్టి విడనాడఁ జెల్లదు ఇక నాకు
దాపుదండయు మీరే దైవము సాక్షిగ ॥రక్షిం॥

౨

ఎంతో వేఁడిన నేల పల్కవు-నే-
నెంతద్రోహినో దయఁ జూడవు
ఎంతేసివారల నేలేటి కర్తవు
అంతకంతకు నాపై నలుమలుఁ జూపేవు ॥రక్షిం॥

౩

భద్రాద్రివాస మీబంటను-ఇతర-
పాపము లేదు నావెంటను
అద్రిజసన్నుత యమరాదివందిత
భద్రేభవరద నాపాలిటిదైవమ ॥రక్షిం॥

ఉ. నిన్నని చాల నమ్మితిని ( నేఁటికి నాదురవస్థ వాయదో
పన్నగతల్ప యోజనక ( భావమునం దయఁజూచి యాపదల్
అన్నియుఁబాఱఁ ద్రోలి సుఖసమ్మందఁగఁ జేయవె రామచంద్ర
నీకన్న కుమారునింబలెనె ( కావుము శీఘ్రము జానకీపతీ.

రాగము ఖరాలి - ఆదితాళము.

రామ నీదయనాపై రాదుగా-పతిత
పావననామమే నీబిరుదుగా
సామజవరద నిన్నేమని దూఱుదు
ఏమియదృష్టము యెంతవేడినగాని॥ రామ॥

౧

ఊపుల నడుగగజాలఁగా-మీ-
శ్రీపాద సేవమాకుఁ బదివేలుగా
భావజజనక నాభావము తెలిసితే
నీవేదైవ మనుచు నేనమ్మియున్నాను॥ రామ॥

౨

నీకే నేను సురులు కొంటిఁగా-నే-
నితరులకు-లోఁగక యుంటిఁగా
ఆఁకొన్నవాఁడనై యనవలస నింటిగాని
నీకే దయలేకున్న నేనేమి సేయుఁవాఁడ॥ రామ॥

3

ప్రేమ నిబ్బర మాయెఁగా-
భద్రాచల ధామ యిదేమాయగా
భూమిజనాయక నాస్వామి వీ వనుచుఁ
గామించి సేవించురామదాసుఁ బ్రోవ॥ రామ॥

వ. ఇవ్విధంబున దయఁజూడు మని మొఱలిడుచుండం గొన్ని
దినంబులకుఁ దర్వాతఁ దానీష మరల గోపన్న పైకము

చెల్లించినా యని యడుగ, ఖజాంజీ లేదన నీదినంబు మొదలావిప్రునిఁ బ్రతిదివసంబును నొక్కొక్కజాము ముండ్లకంపలపై నడిపింపుఁడని యాజ్ఞాపింప నారాజభటులు ముండ్లకంపలమీఁద నడిపింపఁగా నప్పుడు రామదాసు శ్రీరాములం జేరొక్కని యిట్లనుచున్నారు.

౮. కానలలోన నీవు బహుకష్టము లొందుచు రాక్షసావళిం
బూని వధించయోధ్యమును బొందుగ నేలినయట్టినీక్రియన్
ఏమనుగ్రామమున్విడిచి యేమియుఁదోఁపకయున్నవాఁడనో,
భానుకులేశ గ్రామమునఁబట్టుగ నిల్పవె జానకీపతీ.

రాగము — కల్యాణి - రూపకతాళము.

రామా దయఁజూడవే-భద్రాచల
ధామా నను బ్రోవవే
రామా దయఁ జూచి రక్షించి మము నేలు
రామా రణరంగ భీమా జగదభి- రామా॥

౧

రాజీవదళలోచనా-భక్తప
రాధీనా భవమోచనా
రాజరాజకులరాజరాజార్చిత
రాజితవైభవ రాజలలామా॥ రామా॥

౨

తాటకసంహరణా-మేటిరా
క్షసకోటి మద హరణా

నీటుతో నీనామకోటి వ్రాసితి నీకు
సాటిలేదని సారెసారెకు వేడితి రామా॥

౩

దిక్కు నీవని నమ్మితి-నీపాదముల
మక్కువఁ గని మ్రొక్కితి
చిక్కులఁ బెట్టకు చిన్నిభద్రాద్రిని
గ్రక్కున వెలసిన చక్కనిసీతా॥ రామా॥

వ. ఈతీరున స్తుతియింపఁగానాబాధ నివారణం బగుచుండ మఱి యాకతతిఁ దానీష గోపన్న చేతులకుఁ గిట్టికోలలు వేసి కొట్టు మనఁగా నప్పుడు శ్రీభద్రాచలనిలయునిం దలంచి రామదాసుగా రిట్లని మొఱపెట్టుచున్నారు.

ఉ. రామ యిదేమిరా నిరపరాధుని దుర్జను లేఁచుచుండఁగా నేమి యెఱుంగనట్టుల సహించుక యున్నప నేమి చెప్పరా నీమది కింత సహ్యమగునే నే యిఁక నెవ్వరు నాకు రక్షకుల్ కోమల నీల వర్ణ! రఘుకుంజర! మద్గతి జానకీపతీ!

రాగము - అసావేరి - చాపుతాళము.

అబ్బబ్బా దెబ్బలకు నోర్వలేరా
జబ్బుసేయక రారా తబ్బిబ్బాయెరా॥ అబ్బ॥

౧

అట్టే నినుఁ బూజించినట్టిచేతుల నిదిగో
గిట్టి కట్టికొట్టే రెట్టు తాళుదునయ్యా॥ అబ్బ॥

౨

రట్టు దీర్చి యీవేళ గట్టిగా నీవు నా
చేట్టఁబట్టి యేలుకో పట్టాభిరామా అబ్బ॥

౩

శరణాగతత్రాణ బిరుదాంకుడవు గాదా
శరధీ బంధించిన శౌర్య మేమయెరా॥ అబ్బ॥

౪

పరంధామ నీపాదములయాన వినరా
పరులకొక్కకాసు నే నియ్యలేదురా॥ అబ్బబ్బా॥

క. తానీష యొక్కనాఁడు జ
వానుల బిలిపించి తైదికేవర్తన లదుగక
మానవనాథా! ద్రవ్యము
తా నీయఁగఁ దలఁపఁ డతని దండింపఁ దగున్.

వ. అని యిట్లనేకవిధంబుల విన్నవించి రాజాజ్ఞను పొందిన
వారె.

ద్విపద.

రామదాసుని దెచ్చి రచ్చలో నిల్పి
కోమలంబైనయాకోకలు విప్పి
కట్టి స్తంభంబున గట్టిగా బిగిచి
కొట్టిరి కొరడాల గుఱుతులు పెట్టి
యేవిరా వరహాలు ఏవి మొహరీలు
ఏవిరా మాడలు నిపుడు తెప్పింపు

తెప్పింపకున్న నీ దేవుని నిన్ను
నొప్పింతు మిప్పుడు నోర్వంగఁగలవె
వద్దురా యాకలు - వరుసతో నిపుడె
పద్దులు సేయక బాకి చెల్లించు
పొద్దులు పుచ్చుక పోవలె మేము
హద్దులు గట్టుక మడ్డి సేయుకుము
ఇఁకమీఁద మేము నీ కెక్కువపనులు
పగఁగొని యిత్తుము బాగుగా వినుము
అని చేరి కొరడాల నంటించఁగాను
మునిచేతులెత్తుక మొఱలిడఁ దొడఁగె॥

క. గొబ్బున రావే శ్రీహరి
నిబ్బరముగఁ ద్రాటఁ గట్టి నెఱిని బిగింపన్
దెబ్బల కెట్లోర్తును నే
నబ్బబ్బా తాళఁజాల నార్తశరణ్యా!

రాగము-బిలహరి-చాపుతాళము

రావయ్యా భద్రాచలరామా
రమణీయజగదభిరామలలామా
కేవలభక్తి విలసిల్లఁగ భావము
దెలిసిన దేవుఁడవై తే॥ రావ॥

౧

పొద్దున నిన్నుఁ బొగడుచు నెల్లపుడు
సద్దు మీఱఁగాను భజన చేసెదను

గద్గదితనమునఁ బొ్రద్దులు పుచ్చుచు
ముద్దులు గులుకుచు మునుపటివలె నిటు॥ రావ॥

నన్నుఁ గన్నతండ్రి నామదిలోన నీ
కన్న నితరులఁ గొలిచెద నా
శ్రీకర దివ్య ప్రభాకరకులర
త్నాకరపూర్ణసుధాకర తేజా॥ రావ॥

౩

అంజలి సేయ నీ వఱమఱ లేని
యడియేని నీవు కటాక్షముప్రాని
ముజ్జగములకునుముద మిడుపదముల
గజ్జెలు గదలఁగ ఘల్లుఘల్లు మన॥ రావ॥

౪

దోషము లెంచని దొర వని నీకు
దోసిలి యొగ్గితిఁ దొలుత సరాకు
దాసునితప్పులు దండముతోఁ దీఱు
మీసాము గలిగిన పోషకుఁడైన॥ రావయ్య॥

మఱియు నేమని కొనియాడుచున్నాఁడు.

దినకరచంద్రనేత్రములు ౹ దివ్యకిరీటము కుండలంబులుఁ
ఘనమగుకౌస్తుభంబు కనకాంచితచేలము లక్ష్మి చెంగటఁ
దనరెడునట్టిరూపమును ౹ దాసుఁడు సంతస మందునట్లుగా
ననిశముఁ జూపి యాపదలనన్నియుఁ బాపవె జానకీపతీ.

రాగము-కల్యాణి-చాపుతాళము

ఇన్ని గల్గిమీ రూరకున్న నే-నెవరివాఁడనౌదు
కన్నతండ్రివలె రక్షించుటకును కరుణయేలరాదు॥ ఇన్ని॥

౧

అక్షయమియ్యఁగఁదలఁచిన శ్రీమహాలక్ష్మిదేవి లేదా
రక్షింపంగాదలచిన భూమియె రత్నగర్భ గాదా!
పక్షపాత మెడలించినఁ జేతిలోఁ బరుసవేది లేదా?
ఈక్షణమున దయగలిగిన సంచిత-ధన మున్నదిగాదా॥ ఇ॥

౨

కనుఁగొని నిర్హేతుకకృపఁజూచిన-కల్పతరువు లేదా
మనవాఁడని నెనరుంచినఁ జింతామణియున్నదికాదా॥
పెనవడు వెతదీర్పను శరణాగతబిరుదు నీదెకాదా
వనజభవాండములేలు దొరలు దేవరవారలెకాదా॥ ఇన్ని॥

౩

కరిప్రహ్లాదవిభీషణాదులను గాచితివని వింటి
హరహరబ్రహ్మాదులకంటెను నిను అధికుఁడవనియంటి॥
సిరినాయక నీమఱుఁగుఁజొచ్చితిని చేపట్టు మటంటి
కరుణతో భద్రాచలరామదాసుని కావవెయనియంటి. ఇ॥

వ. ఈవిధంబున భద్రగిరీశుని ధ్యానించుచుండ నాబాధలు నివారణం బగుచుండ రాజభటులు రాజాజ్ఞాక్రమంబున మఱికొన్ని దినంబులకు ఖడ్గంబులపై నడిపింప నుద్యమించిన నీశ్రమంబు నివారించుటకు శ్రీరాములకంటె నన్యులు లే రని రామదాసుగారు స్తుతిసేయుచున్నారు.

చ. పరులకుఁ జేతి కియ్యకయె । పంకజలోచన నీదుహస్తముం
గరివరుమీఁద నుంచి కృపఁ । గాచినరీతిని నాశిరంబుపై
నిరవుగ హస్తము న్నిలిపి । యింపుగ దండనసేయ కేలుకో
నరసఖ వాసుదేవ సుర।నాయక మాధవ జానకీపతీ!

రాగము-పున్నాగవరాళి-ఆదితాళము

ఏమి రామప్రభో నీదయా
నామీఁదనురాదేమయా

౧

పామరుఁడను జడుఁడను దాసుఁడను
నేమవర్జితం బగు నరపశువను
నీ మహాత్వమెన్న నెంతవాఁడను
రామరామయని తలఁతు నిరంజన॥ ఏమి॥

౨

పరులను వేఁడ నంటినీ- నీ
పదయుగములె నమ్మియుంటిని- న
న్నఱమరసేయవద్దంటిని-శ్రీ
హరిహరియని వేఁడుకొంటిని
మొఱలిడినంతనె కరివరునేలిన
దొరవని నమ్మితి-నిరసింపఁదగదుర
మందరగిరిధర త్రిభువనసుందర
యిందిరాసుందరీమనోహర॥ ఏమి॥

౩

ఏల నాపైఁ గోపము - ము న్నేమి చేసితినో పాపము
నీలవర్ణ నీరూపము-నిరతము కన్నులఁజూపుము

మేలొనరించెడి శ్రీలోలుఁడవని
చాలనమ్మియుంటి జాలముసేయక
యేలుకొనుము-గాసిలోలనుసురరిపుజాల
కాల జాలమేల కరుణాలవాల ఏమి॥

౮

ఈసమయమునను గావర - జగ
దీశ జనకసు తా వ ర
చేసితి నఘముల గావర
నేను జేసెదను నీసేవర
ఆసించిన శ్రీరామదాసుని నిటు
మోసము చేసిన దోసంబెవరిదో
వాసవార్చితాంఘ్రి వనజయుగ కై
లాసవాస భవ్య భద్రగిరీహారి॥ ఏమి రామప్రభో॥

వ. మఱియు నేమని కొనియాడుచున్నారు.

ఉ. తాటక నేసి తత్తనయుఁ దర్పమణంచియు వాలిఁద్రుంచియు
న్నీటుగ రావణాదులను నే పణఁగించిన నీదుశక్తియుఁ
బాటియుఁ దప్పెనే యకట పద్మవిలోచన నాదుశత్రులన్
దీటని యున్నవారి నిదె తెప్పునఁ ద్రుంపవె జానకీపతీ!

రాగము-మధ్యమావతి-ఆదితాళము.

ఓరఘువీరా యని నేఁ బిలిచిన
నోహో యనరాదా
సారెకు మఱివేసారియున్యము
చేరదు నామది యేరాధీరా॥ ఓరఘు॥

౧

నీటఁ జిక్కి కరి మాటికి వేసరి
పాటలాధర నీపాటలుపాడఁగ
మేటిమకరితల మీటి కాచుదయ
యేటికి నాపై నేఁటికిరాదో॥ ఓరఘు॥

౨

మున్నుసభను నా-పన్నత నొందఁగ
నిన్నుకృష్ణయని యెన్నఁగద్రౌపది
కెన్నోవలువలిచ్చి మన్ననఁ బ్రోచిన
వెన్నుఁడ నామొఱవింటివో లేదో॥ ఓరఘు॥

౩

బంటునైతి నని యంటు పరాకున
నుంటివి దెలిసె ముక్కంటివినుత నా
జంటఁ బాయకను వెంటను రమ్మని
యంటి భద్రగిరి రామదాసపోషక॥ ఓరఘు॥

వ. అని యట్లనేకప్రకారంబుల నాశ్రితబాంధవుం డగురామ
చంద్రులం దలంచుభాగవతుని నడిపించుతఱి నాఖడ్గంబు
లు ధరాతలంబునఁ గుంగిపోవుటను రాజభటులు గాంచి
యాశ్చర్యంబునొంది మరలఁ గారాగృహంబునకుం గొని
చని యేతద్వృత్తాంతంబు తానీషాగారికిఁ దెలియంజెప్పి
మీఁదియుపాయం బెట్లొకో యని నుడివిన.

తోహరా.

అన విని యాజ్యాహుతిచే వెలిఁగెడునన్నివ లెనుదా మండి
పెనఁగొని వీఁపున గుండుఁబెట్టి పురవీథులు ద్రిప్పుచురండి.

అని ఖండితముగ నాడినపల్కుల నాలకించి వేగమున నానతి సేయఁగఁ బ్రారంభించిన హరిదాసుఁడు మూర్ఛిలిన.
-ఇదివినరయ్యా.

ద్విపద.

తడయక జైల్ఖానతలుపులు దెఱచి
జడుని కైవడి ధరాస్థలిఁ బడియున్న
బాడబు నేకాంతభక్తాగ్రగణ్యు
జాడ దెలియఁగలేక చారు లాఘునుని
నిఱుతుసంకిళ్ల నేపఱఁ బాదములను
కరముల బంధించి కరుణారహితులు
గ్రక్కున నుక్కుగుం డొక్కటి దెచ్చి
ఉక్కణంగఁగ భానుకరోత్తముశిఖను
బట్టి నేలకు వంచి పదుగురు నెత్తి
పెట్టినవీఁపునఁ బెనుభారమైన,
మోవఁజాలక ఓం నమోరామ యనఁగఁ
గావలివారలు ఖడ్గముల్ పూని
తనయిరుప్రక్కలఁ దఱుముచు రాఁగ
ఘనభార మగుటచేఁ గాళ్లు వడంక
భూతలాధిపునాజ్ఞఁ బోరిపోరి భటులు
నీతిదప్పినయట్టి కూఁతలతోడ
గోల్కొండవీథులఁగొని త్రిప్పుచుండ
నాల్క యెండఁగ రమానాథుని మదిని,

దలపోసి తలపోసి ◊ తలయూఁచి యూఁచి
వినుతించె నిట్లని ◊ విశ్వేశుఁ గూర్చి.

ఉ. దండము రామచంద్ర శరదభ్రవినిర్మలకీర్తిసాంద్ర వే
దండధరోగ్రవీరభట దండన కోరువఁజాల కిప్డు నీ
దండను జేరినాఁడఁ బర దైవము వేఁడఁగఁజాల నార్త
వేదండశరణ్య నాకభయదాన మొసంగవె జానకీపతీ!

రాగము - ఆనందభైరవి - ఆదితాళము.

భారము లన్నిటికీ-నీవే కలవని ని-
శ్చయుఁడనై యున్నానురా
వారిధిప్పక నీవు దరిజేర్చెదవని
బ్రముదోచిందిరా-శ్రీరామ భారము॥

౧

అతిదుష్కృతములు నే-నన్ని చేసితి నిజమే
నయ్యా నా మతేమాయెరా
పతితపావనబిరుదు వహియించినావని
ప్రఖ్యాతి గొన్నావురా-శ్రీరామ॥ భారము॥

౨

ఏరీతినైన నే నినునమ్మియున్నాఁడ
నన్నేలుటది కీర్తిరా
నేరుపు నేరము లెంచిచూచుటకు
నే నెంతవాఁడనురా-శ్రీరామ॥ భారము॥

౩

మునునినుఁ జేరి కృతార్థులైనవారి
ముచ్చట విన్నానురా

వినివిననట్లున్నావేమని పలుమాఱు
విన్నవించ నేరరా-శ్రీరామ భారము॥

౪

శరణన్నవారి రక్షణసేయు బిరుదు ని
శ్చయమై యున్నాదిరా
మఱి పెముగానన్నిటికి నేఁబట్టినది
మునగకొమ్మ గాదురా-శ్రీరామ భారము॥

౫

బహువిధముల నిన్నుఁ బ్రస్తుతించుమని
బ్రహ్మ వ్రాసినాఁడురా
విహితజనములలో నేనెవ్వఁడోయని
వేఱుచేయకపోవరా-శ్రీరామ భారము॥

౬

వాసిగభద్రాచలేశుఁడవని చాల
వర్ణింపుచున్నానురా
భాసురముగ రామదాసునేలునట్టి
భావము గన్నానురా-శ్రీరామ భారము॥

శా. అంతర్దానుఁడువోయె మురారియిటు నేనార్తుండనై యేడ్వగో
రంతైనం గరుణించిచూడ వయయో శ్రీరామా పరంధామశ్రీ
కాంతా యీఘనపాపకర్మములచేఁ గాఱింపఁగాఁ జేయకీ
సంతాపంబు హరింపఁజేసి నను నీసాన్నిధ్యముం జేర్పవే.

గీ. వాలుసమ్మెట్లు కోర్చినవజ్రమనఁగఁ
గాఁకలకు వన్నెకెక్కినకనక మనఁగ

రావానివాతికిఁ దొరలనికరా జనంగఁ
దన్నుఁ జేయించుబాధలంకీ దలఁకఁ దయ్యె.

వ. ఈక్రమంబున సీతాపతిని భజించునాభాగవతకులాలంకా
రునిశ్రమం బాశ్రితబాంధవుండగుశ్రీరామునికటాక్షంబుచే
నివారితం బగుచుండ నొకనాఁడు తానీషా యితం డెవ్విధం
బునఁ గష్టంబులకు నోర్చియుండువాఁడో మఱియునుం జూ
చెద నని యత్యుగ్రుండై నిండువేసవిలో నినుకతిన్నియలపై
నిలువుం డని యాజ్ఞాపింప భటులతనిం గొనిచని యాలాగు
న నొనర్ప నారామచంద్రపాదపద్మారాధకుం డగురామ
దాసుగారు స్వామి నేమని వేఁడుకొనుచున్నారు.

రాగము - యమునాకల్యాణి - ఏకతాళము.

శరణాగతరక్షణబిరుదని నే
శరణంటిఁ గదయ్యా
వెఱవకుమని యభయం బొసఁగవె
ననుఁ గన్న తండ్రివయ్యా॥ శర॥

౧

కరివరదాసిరు లొసఁగను దశరథ
నందన రావయ్యా
నిరతము నీనామము నాజివ్హకు
రుచి గొన నియ్యవయ్యా॥ శర॥

౨

నరహరి బాలునిఁ గాచిన శ్రీజగ
న్నాథా వినవయ్యా

గరుడవాహనుఁడ వై నాకన్నులఁ
　　గానుపింప వయ్యా॥ శర॥

౩

ఆదిదేవ మీచిత్తము భాగ్యము
　　భావ మెవరిదయ్యా
నీదాసులకును నేదాసుఁడ దయ
　　యుంచి యేలుమయ్యా॥ శర॥

౪

హరి నీతోడసమానమైన మా
　　యావు లింకెవరయ్యా
కరుణాసాగరుఁడని మొఱలిడఁగా
　　నరు దేమిటి కయ్యా॥ శర॥

౫

కోరితి నాదైవము నీవేయని
　　దూఱితిఁగదవయ్యా
నేరములెంచక గారవించి కృపఁ
　　జూడు నల్లనయ్యా!॥ శర॥

౬

ముద్దులు గుల్కఁగ రామదాసుఁ డని
　　ముచ్చటాడుమయ్యా
పద్దుల నీడేర్చెడి భద్రాచల
　　పతి వీవే గదయ్యా॥ శర॥

వ. ఇవ్విధంబునసగోపన్న యీశ్రమను సహించి రామకీర్తనంబు చేయుచుండ నావేసంగితీక్ష్ణత యతనియొడలి నంటుదయ్యె

నట్టియెడ నిది రామానుగ్రహంబు గదా యని మఱియుచు రామునిం దలంచి నృత్యంబు సలుపుచుఁ గీర్తించుచున్నారు.

ఉ. రాముఁడు రక్షకుండు రఘురాముని నమ్మినబంట నేను నా కేమిభయంబు చింత లేఁక నేటికి నేమి ఘటించినన్ రఘు స్వామిది కీర్తి సత్యమిది సత్యము నాకు పనేమటంచు నే నీమహనీయకీర్తి విని నిన్నెద నమ్మితి జానకీపతీ!

రాగము - ఆనందభైరవి - ఆదితాళము.

రామునివారము-మా
కేమి విచారము
స్వామి నీదే భారము-దా-
శరథే జీవాధారము॥ రాము॥

౧

తెలిసితెలియ నేరము-మా
దేవుని దేయుపకారము
తలఁచినశరీరము – మది
పులకాంకురపూరము॥ రాము॥

౨

ఘోరాంధకారము సం
సారమే నిస్సారము
శ్రీరాములయవతారము-మది
జింతించుటే సారము॥ రాము॥

౩

ఎంతెంతో విస్తారము-ఆ
వింతలయొయ్యారము

ఎంతో శృంగారము-మా
సీతేశునియవతారము॥ రాము॥

౪

ఇతరుల సేవకోర్వము-రఘు
పతినే నమ్మినారము
అతిరాజసులఁజేరము-మా
రామునిదాసులైనారము- మది
రంజిల్లుచున్నారము॥ రాము॥

రాగము- ధన్యాసి- ఆదితాళము

కోదండరాములు మముఁ గన్నవారు-ధరలో
నాదరించి పెంచి విడనాడలేరు॥ కో॥

౧

మోదముతోఁ గూడుక తమ్మునిజోడు-ఖలులు
బాధించువేళలో నాకు భక్తితోడు॥ కో॥

౨

సీతారామనామమే మాజిహ్వయందు-యముని
దూతల బాఱఁదోలెడి దొడ్డమందు

౩

పట్టాభిరాములఁ జెయి పట్టినాము-మేము
గట్టిగ యమునికి నామముఁ బెట్టినాము॥ కో॥

౪

ప్రేమతో భద్రగిరీశ రావదేమి
రామదాసుని రక్షింప వేగ రామస్వామి॥ కో॥

సీ. నిఖిలరోగంబుల నిర్మూలముగఁ జేయు
భవభయంబుల నెల్లఁ బాఱఁదోలు
బంధనంబులఁ బటాపంచలు గావించు
నొలయ నాపదలను నులిమివైచు
శాత్రవవిజయంబు సతతంబు సమకూర్చుఁ
దూలించు బహువిధదుఃఖములను
దలఁ జూపకుండ దుర్దశలను దొలఁగించు
సకలశుభంబుల సంగ్రహించుఁ
తే. బరమపావనమంగళప్రదము గానఁ
గలితధర్మార్థకామమోక్షములలోన
నెసఁగుభక్తుల కొసఁగని దెద్ది లేదు
ఏమి చెప్పుదు శ్రీరామనామమహిమ.

రాగము- గౌళపంతువరాళి- ఆదితాళము.

శ్రీరామ నీనామ-మేమి రుచిరా
ఓరామ నీనామ మెంత రుచిరా॥ శ్రీ॥

౧

కరిరాజప్రహ్లాద-తరణిజవిభీషణులఁ
గాచిన నీనామ మేమిరుచిరా॥ శ్రీరామ॥

౨

కదళీఖర్జూరాది-ఫలములకన్నను
పతితపావననామ-మేమి రుచిరా॥ శ్రీరామ॥

౩

దధిఘృతమధురస-ఫలములకన్నను
పతితపావననామ-మేమిరుచిరా॥ శ్రీరామ॥

౪

నవరసపరమాన్న-నవనీతమునకంటె
నధికమౌనీనామ-మేమిరుచిరా॥ శ్రీరామ॥

౫

పనసజంబుద్రాక్ష-ఫలరసముకంటె
నధికమౌనీనామ-మేమిరుచిరా॥ శ్రీరామ॥

౬

అంజనాతనయహృ-త్కంజతలమునందు
రంజిల్లునీనామ-మేమిరుచిరా॥ శ్రీరామ॥

౭

సదాశివుఁడునిను-సదా భజించెడి
సదానందనామ-మేమి రుచిరా॥ శ్రీరామ॥

౮

సారము లేనిసం-సారమునకు సం
తారకమగునామ-మేమిరుచిరా॥ శ్రీరామ॥

౯

శరణన్న జనముల సరగున రక్షించు
బిరుదు గల్గిననామ మేమిరుచిరా॥ శ్రీరామ॥

౧౦

తుంబురునారదులు-డంబు మీఱఁగగా
నంబుచేసెడినామ-మేమి రుచిరా॥ శ్రీరామ॥

౧౧

అరయభద్రాచల-శ్రీరామదాసుని
నేలిననీనామ మేమి రుచిరా॥ శ్రీరామ॥

గీ. ఇవ్విధంబున రాముని । నేకచిత్త
వృత్తిఁగొల్వఁగ భక్తుని । వేధఁ బాపెఁ
దన్మయంబున నాతఁడు । తనువు మఱచి
చిత్రరూపంబుకైవడిఁ । జేష్ట లుడిగె.

వ. ఈప్రకారంబున రామునియందు మనంబు లీనంబుచేసి తన్మయత్వంబుఁ జెంది యొండెఱుంగక చిత్రరూపంబుకైవడి నుండిన రామభక్తునిం గని యాభటులతండు నిర్జీవుండయ్యెగాఁ దలంచి కదలించి గోపన్నా యనిపిలువఁగనుదమ్ములం దెఱచి యెదుట నుండుకింకరులం జూచి రామా యన నీబ్రాహ్మణుండు జాలగాఁడని తలంచి యతనిం గొనిపోయి బందిఖానాలో నుంచి పరమభద్రంబునఁ గాపుండ నొక్కనాఁడా గోపన్న యుదయంబునఁ బలు దోముటకొఱకు నూతికి నీళ్లు చేఁదఁబోవుసమయంబున నచ్చట నొకవృశ్చికంబతనివ్రేల మీటిన నప్పు డాతండు బాధవలనం బరిభ్రమింపుచు స్వామికిఁ దనబాధ నెఱుకపఱుచుచున్నాఁడు.

రాగము-ఆనందభైరవి-రూపకతాళము.

మేలైనచిటికెనవ్రేలు-ప్రాతగ
కాల మందునఁ గుట్టె తేలు
బాలత్వమున నేను బావినీళ్లకుపోయి
కాలుపెట్టఁగ చిన్న తేలు పొడిచెనయ్యా॥ మే॥

౧

చలివచ్చె నీనొప్పి చేత-దీని
వేదన పాపిష్టి ఘాత

యీలాగైన నే-నేలాగు తాళుదు
మూలమైన గురు-మూర్తిపాదములాన॥ మే॥

౨

మిక్కిలి నలుపుచున్నాది-రామ
గ్రక్కున నాదరించేది
వెక్కసపెట్టుచు కడతేరనీయదు
మ్రొక్కెదనాస్వామి-నేనోర్వఁజాలను॥ మే॥

౩

దరిచూపుస్వామి కేశవా-యిట్లు
నరులు చేసిన రీతిఁ జేసెదవా ?
పుడమిలోపల భద్రగిరి రామదాసుని
బడలనీక కా-పాడుతండ్రివి నీవె॥ మేలైన॥

వ. ఈప్రకారంబున వృశ్చికదష్టుండైనను రాముని స్తుతించుచు బాధలం బొందక యుండెడి రామదాసుని జూచి భటులితండు మహానుభావుం డని చేరవచ్చి యీశ్రమంబున కేలాగున సహించెదవు దీనిం బాపికొనుట కేమైన నుపాయాంతరంబు లున్నవా యనిన నతం డాభటుల కిట్లనుచున్నాఁడు.

రాగము- నాథనామక్రియ-చాపుతాళము.

రామునివారమైనాము-ఇతరాదుల గణనసేయము

౧

ఆమహామహుఁడునస-హాయుడై విభవము
గా మమ్ముఁ జేపట్టి-గారవించును సదా॥ రాము॥

౨

యమకింకరుల జంకించెదము-పూని
యమునైన ధిక్కరించెదము
అమరేంద్రవిభవము-అది యెంతమాత్రము
కమలజునైన లక్ష్యముసేయకున్నాము॥ రామ॥

౩

గ్రహగతులకు వెఱవబోము-మాకు
గలదు దైవానుగ్రహము
ఇహపరములకు మాకిక నెవ్వ రడ్డము
మహి రామ బ్రహ్మమంత్రము పూనియున్నాము॥ రామ॥

౪

త్రిభువన దేవదేవుండు రామ
తీర్థాలదైవరాయండు
శుభదాయియై చాల-విభవముగాఁ బ్రోచి
ప్రభుడై రక్షించునురామదాసులనెల్ల॥ రామ॥

వ. కావున నిట్టిప్రభావము గలరామనామంబును సర్వకాల సర్వావస్థలయందు దృఢం బగుభక్తిగలిగి స్తుతిచేయుచుఁ బూజింపుచుఁ గీర్తింపుచు నర్తింపుచునుండుదినంబె సుదినం బని యాభటుల కెఱింగింపుచు భక్తిపరవశుం డైయానం దనృత్యంబు సలుపుచుఁ గీర్తన చేయున్నారు.

రాగము - సావేరి - ఆదితాళము.

దినమే సుదినము-సీతారామ
స్మరణే పావనము

౧

ప్రీతినైనఁ బ్రాణ-భీతినైనఁ గలిమి
చేతనైన మిమ్మతీరు దలచిన॥ దినమే॥

౨

అర్థాపేతును దినము-వ్యర్థము గాకుండ
సార్థకముగ మిమ్ము-ప్రార్థనచేసిన॥ దినమే॥

౩

నిరతము మెఱుఁగుబంగరుపుష్పముల రఘు
వరుని పదమ్ముల-నమరఁ బూజించిన॥ దినమే॥

౪

మృదంగతాళము-తంబుర శ్రుతి గూర్చి
మృదురాగముల కీర్తనలు పాడినవిన్న॥ దినమే॥

౫

ఘనమైనభక్తిచేఁ-జెనఁగొని యేవేళ
మనమున శ్రీరా-మునిజింతించిన॥ దినమే॥

౬

భక్తులతో నను-రక్తిని గూడుక
భక్తి మీఱఁగ భక్త-వత్సలుఁ బొగడిన॥ దినమే॥

౭

దీనశరణ్యా మ-హానుభావ యో
గానలోల నన్నుఁ గరుణింపు మని కొల్చు॥ దినమే॥

౮

వాసిగ శ్రీహరి-దాసులఁ గూడుక
వేయుచు గంతులు-వాసుదేవుని బాడు॥ దినమే॥

౯

అక్కఱతోడ భ-ద్రాచలమున నున్న
చక్కనిసీతా-రాములఁ జూచిన॥ దినమే॥

వ. ఇవ్విధంబున శ్రీరాముని స్తుతించునట్టిదినమేనుదినంబని రాజభటుల కెఱుక సేయుచునుండం గొన్ని దినంబులకు గోపన్న కు గర్భశూల కాన్పించినం దదీ యశ్రమంబు నోర్వనోపక రాముని దలంచి మొఱ లిడుచున్నారు.

ఉ. రాముఁడ వందునో పరశు రాము జయించినయట్టిజానకీ
రాముఁడవందునో! ఖలునిరావణుఁద్రుంచినమేటితో యదు
శ్యాముఁడ వందునో సకలశాత్రవసైన్యవిరామ రామ నే
నేమని పిల్తునయ్య యఱలేటికిఁ దెల్పవె జానకీపతీ!

* రాగము-త్రిపుట-ఆదితాళము.

పాహిమాం శ్రీరామా యంటే పలుకావై తివీ-నీ
స్నేహమెట్టిదాని చెప్ప-నోహో హో హో-
హో హో హో హో

౧

ఇబ్బంది నొంది యాకరి-బొబ్బ పెట్టినంతలోనె
గొబ్బునఁ గాచితివానీ జబ్బు సేయక-
నిబ్బరముగా నే నెంతో-కబ్బమిచ్చి వేడుకొన్న
తబ్బిబ్బు చేసెదవు రామ-అబ్బబ్బబ్బబ్బబ్బబ్బబ్బ ॥పాహి॥

౨

సన్నుతించువారి నెల్ల-మున్ను-దయతోఁ బ్రోచితివని
పన్నగశాయి నే విని విన్నవించితి

* అచ్చు ప్రతులలో యదుకుల కాంభోజి యని యున్నది.

విన్నపము వినకయెంతో-కన్నడచేసెదవురామ
యెన్నఁటికి నమ్మరాదు-రన్నన్నన్నన్నన్నన్నన్న ॥పాహి॥

3

చయ్యనభద్రాచలనిలయ-స్వామివనినమ్మి నేను
వెయ్యాఱువిధముల నుతి-చెయ్యసాగితి
ఇయ్యెడను రామదాసుని-కుయ్యాలించిప్రోవకున్న -నీ
యాయ్యార నేమనవచ్చు-నయ్యయ్యయ్యయ్యయ్యయ్య
యయ్యో ॥పాహి॥

వ. ఈప్రకారంబున సర్వంబును రామార్పణం బనియును రామ భక్తులగువారల కేవిధంబున భయంబుగలుగ నేరదనియుఁ దెల్పు రామదాసుగారివాక్యంబు లాలకించి యాభటులలోఁ గొందఱు దుర్ణయు లితనికి దైవసహాయం బెట్లు గలుగు ? రాజద్రోహి యగునితనికి దైవ కారుణ్యంబు గలుగ నేర దిత నికిం దగినట్టిశిక్షలు సేయ నుపక్రమింత మీశ్వరుం డితని యందుఁ గృప గలవాఁడగు నేని తానె యితని బాధ మాన్పిం చుంగాక చూతమని పట్టాకత్తులచే విసరుటకై రాజాజ్ఞను బొంది యాకృత్యంబు నుపక్రమించుసమయంబున రామ దాసుగారే మనుచున్నారు.

ఉ. తాపము మాన్పి పాపములఁ దగ్ధము చేసి కృపారసంబు నే నాపయిఁగుప్పిగుప్పితమ నామమునాహృదయంబులోపలన్ బ్రాపుగ నిల్పి యాపదలఁ బాపవెనీచరణంబు లెప్పుడున్ బ్రాపని నమ్మియుంటి ననుఁ బాయకయుండవె జానకీపతీ!

రాగము - కాపీ ఆదితాళము.

చరణములే నమ్మితి-నీదివ్య-చరణములే నమ్మితి
వారిధిగట్టిన-వరభద్రాచల వరదావరదావరదానీదివ్య॥చ॥

౧

ఆదిశేష నన్ను అమర సేయుకు
మయ్యా అయ్యా అయ్యా నీదివ్య॥ చరణ॥

౨

వనమున కాతిని వనితగ జేయునీ
చరణము శరణము శరణము నీదివ్య॥ చరణ॥

౩

పాదారవిందమే-యాధారమని వర
పడితిని పడితిని పడితి నీదివ్య॥ చరణ॥

౪

వెయ్యాఱువిధముల-కుయ్యాలించి వేరా
వయ్యా అయ్యా నీదివ్య॥ చరణ॥

౫

బాగుగనన్నేలు-భద్రాచలరామ
దాసుఁడ దాసుఁడ దాసుఁడ నీదివ్య॥ చరణ॥

వ. మఱియు నేమని కొనియాడుచున్నారు.

రాగము-ముఖారి-ఆదితాళము.

రామరామ నీవేగతిగద సం-రక్షణంబుసేయ
ఏమనందు హాదైవమ నీమన-సింత కరగదాయె॥ రామ॥

౧

పుడమిలోన నావంటిదురాత్ముఁడు-పుట్టఁడింకనంటి
విడువఁబోకు మయ్యాయనిమున్నే-విన్నవించుకొంటి॥ రా॥

౨

ఎన్ని విధంబుల-బిలిచినఁబలుకవు-ఏమదృష్టమందు
నెన్నరానివైవస్వతువేదన-కెట్లు తాళుకొందు॥ రామ॥

౩

న్యాయమటయ్యా! మ్రొక్కఁగ నామొఱ-నాలకించిరావు
శ్రీయుతముగ నినునమ్మినదాసుల-కోర్కెలొసఁగినావు

౪

స్వామి నేను నీవాఁడను నాయెడ-చలము సేయకయ్యా
ప్రేమదీఱ నినుఁగని కొనియాడెద-మోము జూపవయ్యా

౫

నేమ మొప్ప భద్రాచలమందిర-నిన్ను నమ్మలేదా
ప్రేమఁజూచి నీబంటగు శ్రీరామ-దాసు నేలరాదా॥ రామ॥

వ. ఈప్రకారంబున స్తుతించిన నా భక్తులు వ్రేసినవిసరుకత్తుల చే
నతండు బాధలం బొరయకమఱియును రామా! దయయుం
చిప్రోవు మనుచున్నాఁడు.

క. తటమట మేటికిఁ జేసెదు
కటకట పరమేశ మున్ను ఘంటాకర్ణుఁ
ఎటువలెఁ బుణ్యునిఁ జేసితి
వటువలె ననుఁ బ్రోవరావె యంబుజనాభా!

రాగము మధ్యమావతి- అటతాళము.

రామా నను( బ్రోవఁగ రాదా- నను(గన్న సీతా
భామామణికైనజాలి లేదా-నామీఁదనీకు-
ప్రేమలేకుండుటమర్యాదా-రక్షించెభార-
మేమైనా మీకు లేదా-భద్రాచల
ధామా సుంతైన నెనరు-తల(పుననిలుచుటకాదా॥ రా॥

౧

నీలోన జగము లుండు(గాక-జగములలో-
లీలతో నీవుందుగాక-యీజాలి చేత-
నేలాగు తాళుదు నెందాఁక నను(బ్రోవ లేక
యీలాగుననుండుట పరాకా-యెంతో లేదనక॥ రామా॥

౨

నానాఁటికెంతో సులభమున-నీవను పెన్ని
ధానము దొరకెను మాకు శానా-ఎటులైననిన్ను
మానా నాకన్నులానా-సర్వదైవాలకు మ్రొక్కెద నా
జరుగక వచ్చినానా-నీవాఁడాను గానా? రామా॥

౩

ఈసమయమున రామదాస-పోషక చిద్వి
లాసా భద్రాచలవాస-తెలిసి కృప(
జేసిరక్షింప( బ్రయాసా-ఆసురవర్గనివాసా
గాసిమాన్పు శ్రీవాస-కావకుండుటిది బాసా॥ రామా॥

చ. పిలిచిన( బల్కవేమి నను(బ్రేమను గన్నులజూడవేమి నేఁ
దల(చినతప్పులన్ని మఱిసితప్పక చూపెదవేమి యయ్యయో

పలుమఱు నీవె దిక్కనుచుఁ బట్టితి నీ పదపద్మయుగ్మముం
బలుచఁదనంబుఁ జేసి నను బాములఁబెట్టకు జానకీపతీ!

వ. కావుననో సీతాపతీ! నన్ను రక్షింపక పోవుటకుగారణ
మే మను చున్నారు.

రాగము - సురట - అటతాళము.

స్వామి నన్ను రక్షింపవేమి-సీతారామ
స్వామి నన్ను రక్షింప వేమి॥ స్వామి॥

౧

మఱవక నిన్నే నమ్మియుంటి-నీదివ్యనామ-
స్మరణమెప్పుడు చేయుచుంటి-సత్కృపనిహ-
పరములిచ్చువాఁడని యుంటిఎందునైనమీ-
సరివేల్పు లేఁడని-మఱిమఱిచాటుచుంటి॥ స్వామి॥

౨

జాతి నాతిగఁ జేసినావు-అజామిళుని-
హేతుకకృపఁబ్రోచినావు-ప్రహ్లాదుని-ప్ర
ఖ్యాతిగను రక్షించినావు-ద్రౌపదికిదయ-
చేత చీరలొసఁగినావు-నామీఁద నేమి-
హేతువోగాని దయనుంతైనరానీవు॥ స్వామి॥

లీలావిభూతిజన్మముల-నెత్తుచుండెడి-
మేలు నీపాటి-నాకుచాలు-ఎంతని బతి
మాలుకొందు నను నీపాలు-చేయుటేపది

వేలుభాగ్యములు దోషాలు—చూడక నన్ను
నేలుకొను టేనాకు-మేలు సంతోషము॥ స్వామి॥

౪

సకలలోకములు నీలోను-లోకములం బా-
యక నీవు సంతోషముతోను-ఉన్నాఁడవనుచు-
ప్రకటించి శ్రుతులు చాటఁగాను-కర్ణములా మోద
కరముతోడనె విన్నాను-ఇట్టివాఁడవు-
ఇఁక నీవు ప్రోవకున్న-నెవరు ప్రోతురు నను॥ స్వామి॥

౫

దాసమానసపద్మభృంగా-సంతతసద్వి
లాస పక్షిరాజతురంగా-శ్రీసీతామనో
ల్లాసయిందనీలశుభాంగా-శ్రీభద్రాచల
వాసా సత్కరుణాంతరంగా-ఏవేళ రామ
దాసప్రసన్నమైన కరుణాసాగర రామా॥ స్వామి॥

వ. ఇవ్విధంబునం బేర్కొని, మఱియు నేఁ జేసిన నేరములేమి స్వామి యని వేఁడుచున్నారు.

రాగము - సావేరి - చాపుతాళము.

సీతారామస్వామి-నే - జేసిన నేరములేమి?
ఖ్యాతిగనీ పద-కంజయుగము నే
ప్రీతిగఁదలఁపక-భేద మెంచితినో?॥ సీతా॥

౧

రంగుగ నాపది వేళ్లకు రత్నపు
టుంగరములు నిన్నడిగితినా?

సంగతి బంగరు శాలువ పాగా
లంగీల్ నడిక ట్లడిగితినా?
చెంగటిభూసురపుంగవు లెన్నగ
చెవులకు చౌక ట్లడిగితినా?
ముంగరగొలుసులు ముత్యపుసరములు
నంగనలకు నిన్నడిగితినా? సీతా॥

2

ప్రేమతో నవరత్నంబులుజాఁపిన
హేమకిరీటం బడిగితినా?
కోమలమగు నీమెడలో పుష్పపు
దామము లిమ్మని యడిగితినా?
మోమోటం బిడకుండఁగ నీదగు
మురుగులుగొలుసులు నడిగితినా?
కమలేక్షణ మిము సేవించుటకై
ఘనముగ రమ్మని పిలిచితిఁ గాని॥ సీతా॥

3

తఱచుగ నీపదముల నమరిన సరి
గజ్జెల నినునే నడిగితినా?
కరుణారస ముప్పొంగఁగ గజతుర
గము లిమ్మని నేనడిగితినా?
పరమాత్మక నీబంగరుశాలువ
పైఁ గప్పగ నే నడిగితినా?
స్మరసుందర సురవర సంరక్షణ
ధన మిమ్మని నిన్నడిగితినా? సీతా॥

ప్రశస్తభద్రాద్రీశుఁడ వని నిను
ప్రభుత్వ మిమ్మని యడిగితినా?
దశరథసుత నీచేతధరించిన
దానకంకణం బడిగితినా?
విశదముగా నీమేలిమి మొలనూల్
వేడుకతో ని న్నడిగితినా
ఏమను భూమిని కుచ్చెల నేలకు
నెక్కువగా ని న్నడిగితినా? సీతా॥

వ. ఇత్తఱి నను గరుణించి కాపాడవయ్యా పట్టాభిరామ స్వామీ! యని యనుచున్నారు.

రాగము - సౌరాష్ట్రము - ఆదితాళము.

కరుణించు దైవలలామా-అహో-
పరమపావననామ పట్టాభిరామా॥ కరు॥

౧

అన్నవస్త్రము లిత్తు మనుచు-దొర
లన్నారు మనిచెద మనుచు-ఆయు
రన్నంప్రయచ్ఛతి యనుచు-నూర
కున్నాను నీవెమా కున్నా వనుచు॥ కరు॥

౨

మఱియింత కాలము దనుక-మిమ్ము
మఱచితి నని తప్పుగొనక-మమ్ము

దరిఁ జేర్చుమింత లేదనక-మీద
శరణాగత త్రాణ బిరుదుండిగనుక॥ కరు॥

3

పరులను గొలుచుట కన్న-భద్ర
గిరి రాఘవుల వేడుకొన్న-నిహ
పరములు గలవని విన్న-నేను
దరహాసముఖ రామ దాసప్రసన్నా॥ కరు॥

వ. శ్రీభద్రాద్రినిలయా! మీరే దైవమని యింతకాలము వఱకు నోర్చితిని. నన్నుంగాపాడక యుపేక్షించుటకుఁ గారణముఁ జెప్పుమని కీర్తన సేయుచున్నారు.

రాగము-పంతువరాళి-ఆటతాళము.

దైవము వని మీరలేక-యింత
తాళితిఁగాక పరాకా
దేవుఁడ వని నిన్ను-దీనత వేఁడితి
కావ లేనిబిరుదు-కారణమేమయ్య॥ దైవ॥

౧

కొలువునిల్పిననాఁటివాఁయీ-నీవు
తలఁప వదేమిబడాయీ-నన్ను
నిలిపినజీత మీవోయి-నీకు
అలసీతా దేవి దురాయీ!
బెళుకుచుతిరిగెదవు-పెన్నీట నిలుపుదు
అలచెదనీబంట-నౌరా నన్నెఱుఁగవా॥ దైవ॥

౨

దొరవై నందుకు బైటచతురా-మూల
దూఱుక తలఁ జూపవేరా
నీసాటివారిలో నదురా-పేద
సాద లున్నారని బెదురా
అబ్బురముగ మూల-డబ్బియ్యలేకను
బొబ్బరింపుచునోటి-పెదవులు తడిపెదవు॥ దైవ॥

౩

కలిగియు నీకింత లండా-అరి
గట్టుదునా యెదురెండా-బల్
చెలువమైనపూలదండా-మెడ
జుట్టుదె రామకోదండా
ధరలోన నొకరిని-దరిఁ జేర్చి సొమ్ముకు
గుఱి జూపకున్న నే-గుండెత్తుకమాన॥ దైవ॥

వ. శ్రీభద్రాద్రీశ్వరా! పెట్టుపోఁతలకై యాచింపలేదు గాని నోటిమాటలైన నాడరాదా! పలుకు బంగారమా స్వామీ! యని నుతించుచున్నారు.

రాగము-ఆనందభైరవి-రూపకతాళము.

పలుకే బంగార మాయెనా-కోదండపాణి-
పలుకే బంగార మాయెనా?

౧

పలుకే బంగారమాయె-పిలచిన బలుకవేమి
కలలో నీనామస్మరణ-మఱువ జక్కనితండ్రి॥ పలుకే॥

౨

ఇరవుగ నిసుకలోన-బొరలినయుడుతభక్తికి
గరుణించి ప్రోచితివని-నెఱనమ్మితిని నన్నెతండ్రి॥ పలుకే॥

౩

జాతి నాతిగఁ జేసి-భూతలమునఁ బ్ర
ఖ్యాతి చెందితివని-ప్రీతితో నమ్మితి తండ్రి॥ పలుకే॥

౪

ఎంతవేఁడిన నీకు-నుంతైన దయరాదు
పంతము సేయ నే-నెంతటివాఁడనయ్యా॥ పలుకే॥

౫

శరణాగతత్రాణ-బిరుదాంకుఁడవు గావా
కరుణించు భద్రాచల-వర రామదాసపోష॥ పలుకే॥

౫. పలుకు బంగారం బైనను నీదయకుఁగూడఁ బాత్రుఁడను గానా? జానకీమనోవల్లభా! యని వేడుచున్నారు.

రాగము-పున్నాగవరాళి-ఆదితాళము.

ఏలదయరాదే-రామయ్య నీ-కేలదయరాదే!
శ్రీల మేలుకై పాలుపడితి నని
యేల యీదంభము చాలుఁజాలు నికఁ॥ ఏల॥

౧

బ్రహ్మగూర్చఁగదే-అహో పర
బ్రహ్మ కావఁగదే
బ్రహ్మజనక భవ-బ్రహ్మేంద్రాదులు
బ్రహ్మానందము-పాలైనారట! ఏల॥

౨

పాపములచేత-రామయ్యా-నే
నోపలేను గదే
శ్రీపభూప యే-పాప్రులేక మీ
ప్రాపే కోరితి-గోపరూప యిఁక॥ ఏల॥

౩

తలఁపఁగాఁజాల-నానంద బాష్ప
జలము లూటెఁగదే
నీలనీరదనిభకోమలరూప భద్ర
శైలవాసరామదాసుని నేలఁగ॥ నేల॥

వ. పలుకు బంగారంబైనను నీకు దయ రాకుండినను నన్ను రక్షింప నీవుతప్ప నన్యులు లేరు గావున 'దశరథరామా గోవిందా ముకుందా' యని వచించెద నను రక్షింపుము. లక్ష్మణాగ్రజా' యని వేడుచున్నారు.

రాగము-కాపి-చాపుతాళము.

దశరథరామ గోవిందా-మమ్ము-
దయజూడు పాహి ముకుందా! దశ॥

౧

దశముఖసంహార-ధరణిజపతి రామ
శశి ధర పూజిత-శంఖచక్రధర॥ దశ॥

౨

మీపాదములె గతి మాకు-మ-
మ్మేలుకో స్వామి పరాకు

మాపాలఁ గలిగిన-శ్రీపతి యేప్రొద్దు
కాపాడి రక్షింపు కనకాంబరధర॥ దశ॥

3

నారాయణ వాసుదేవా-నిన్ను-
నమ్మితి మహానుభావా-
గరుడగమన హరి-గజరాజరక్షక
పరమపురుష భక్త-పాపసంహరణా॥ దశ॥

.

ధరను దారకనామమంత్రం-రామ-
దాసూల కెల్ల స్వతంత్రం
ఇరవుగ గృపనేలు-మిపుడు భద్రాద్రిని
స్థిరముగ నెలకొన్న సీతామనోహర॥ దశరథ॥

వ. అని మఱియును ఓభద్రాద్రినిలయా ప్రణతార్తిభంజనా! పరమపురుషా! హరీ యని సంబోధనరూపముగ కీర్తనము చేయుచున్నారు.

రాగము-ఆహిరి-ఆదితాళము.

రామహో సీతారామ హో॥ రామ॥

౧

రామహో నే శరణన్న-నామొఱాలకించి కావవు
కరుణలేదుగదర నాదు-ష్కర్మమేమొ తెలియదాయె॥ రా॥

మ్రొక్కి నిన్ను వేడఁగా నా-దిక్కుఁ జూడ వేమిసేతూ
చక్కనయ్యా! నాయంది-ఱక్కడీవైరము పుట్టె॥ రామ॥

౩

ఎట్టు కేలకైన నిన్నూ-గట్టిగానమ్మితి నేను
పెట్టుపోఁత లడుగ లేదు వట్టిమాటాడంగ రాద॥ రామ॥

౪

నన్ను సంరక్షించుటకు నెన్న రానిబరువ దేమి
మన్ననఁజేసి నేఁడు నాదు కన్నులకెదురైవసించు॥ రామ॥

౫

దినము దినము నీచుట్టు దీనుడై నే దిరుగగానూ
కనికర మింతైన లేక కఠినమిలాగాయె గద రా॥ రామ॥

౬

సారెసారెకు నిన్ను వేఁడీ భారకుఁడ వనుచునమ్మి
కోరిపిలిచినాను నన్నుఁ దేఱిచూడ వేమి సేతు॥ రామ॥

౭

చాలనమ్మినాను నాథ స్వామి భద్రశైలవాస
యేలుకోనుము రామదాసునెప్పుడును నేమఱక॥ రామ॥

వ. ఇన్నిదినంబులుగ నీబందిఖానాయందు దిడుమలఁ బడుచు నిను వేఁడుచు నాడుచుఁ బాడుకొని యుండ నొకదినంబు నన్నైన నీగతి యిటులాయెఁగా యని నీభక్తుఁడ నైనననుం జూచి యాదరింపవైతి వికనైనఁ బ్రత్యక్షంబై పలుకరాదా యనియనుచున్నారు.

రాగము-కాంభోజి-ఆదితాళము.

ఇక్ష్వాకుకులతిలకయిఁకనైనఁబలుకవె రామచంద్రా- నన్ను
రక్షింపు మింక నో రఘుకులతిలక-శ్రీ-రామచంద్రా

౧

చుట్టుప్రాకారములు సొంపుతోఁ గట్టిస్తి-రామచంద్రా-ఆ
ప్రాకారానికిఁ బట్టె పదివేలవరహాలు రామచంద్రా॥ ఇ॥

౨

గోపురమంటపాలుకుదురుగ గట్టిస్తి రామచంద్రా-నన్నుఁ
గ్రొత్తగఁజూడక యిత్తఱిఁబ్రోవుము-రామచంద్రా॥ ఇ॥

౩

భరతునకుఁజేయిస్తి పచ్చలపతకము రామచంద్రా - ఆ
పతకానికిఁబట్టె పదివేలవరహాలు-రామచంద్రా॥ ఇ॥

౪

శత్రుఘ్నునకు నేను జేయిస్తిమొలత్రాడు రామచంద్రా
మొలత్రాటికిఁబట్టె మొహరీలుపదివేలు రామచంద్రా॥ ఇ॥

౫

లక్ష్మణునకు వేస్తి ముత్యాలపతకము రామచంద్రా-ఆ
పతకానికిఁబట్టె పదివేలవరహాలు రామచంద్రా॥ ఇ॥

౬

సీతకుఁజేయిస్తి చింతాకుపతకము రామచంద్రా-ఆ
పతకానికిఁబట్టె పదివేలవరహాలు రామచంద్రా॥ ఇ॥

౭

వాహనములు మీకు వరుసతోఁజేయిస్తిరామచంద్రా-జగ
న్మోహన సంకిళ్లు వేసిరికాళ్లకు రామచంద్రా॥ ఇ॥

౮

కలికితురయి నీకు పొలుపుగఁజేయిస్తిరామచంద్రా-నీవు
కులుకుచుఁ దిరిగెద-వెవరబ్బసొమ్మని రామచంద్రా॥ ఇ॥

౯

మీతండ్రి దశరథ మహారాజు పెట్టెనా రామచంద్రా-లేక
మీమామ జనకమహారాజుపంపెనా రామచంద్రా॥ ఇ॥

౧౦

అబ్బతిట్టితినని యాయాసపడవద్దు రామచంద్రా-ఈ-
దెబ్బలకోర్వక అబ్బ తిట్టితి నయ్య రామచంద్రా॥ ఇ॥

౧౧

ఏటికిజల్లిన నిల్లాయె నాబ్రతుకు రామచంద్రా-నేను
అధమునికంటెను అన్యాయమైతిని రామచంద్రా॥ ఇ॥

౧౨

సర్కారుపైకము తృణముగనెంచుమీ రామచంద్రా-ఈ
దెప్పరమునఁగాచి యప్పుదీర్చుమయ్య రామచంద్రా॥ ఇ॥

౧౩

కౌసల్యపుత్రక దశరథతనయశ్రీ రామచంద్రా-కావు
క్షేమమున భద్రాద్రి లోనెలకొన్న-శ్రీరామచంద్రా॥ ఇ॥

౧౪

భక్తులందఱిని బరిపాలించెడి రామచంద్రా నీవు
క్షేమముగ శ్రీరామ దాసునినేలుము-రామ॥ ఇక్ష్వాకు॥

వ. ఓభద్రాద్రివాసా! నామీఁద నీకు దయ రానికారణం
బును జెప్పుమని వేడుచున్నారు.

రాగము—ఆనందభైరవి—ఆదితాళము.

ఏమిటికి దయరాదు-శ్రీరాములునన్ను-
నేమిటికి రక్షింపవు-శ్రీరాములు

పరులను నేవేఁడబోను-శ్రీరాములు-నీకే
కరములు జాచియున్నాను-శ్రీరాములు॥ ఏమి॥

౧

పండ్రెండేండ్లాయె నేను--శ్రీరాములు-బందీ
ఖానాలో నేయుండినాను-శ్రీరాములు
అర్థము తెమ్మనుచు నన్ను-శ్రీరాములు-ఇప్పు
డరికట్టఁదలచున్నారు శ్రీరాములు॥ ఏమి॥

౨

తానిష గారిజవానులు-శ్రీరాములు-నన్ను
తహాసీలు చేయుచున్నారు-శ్రీరాములు
ముచ్చటైనయాడ వేమి-శ్రీరాములు-నీవు-
ఇచ్ఛేయర్థములియ్యవేమి-శ్రీరాములు॥ ఏమి॥

౩

నీ చేతగాకున్న నింక-శ్రీరాములు-మా
తల్లీ సీతమ్మ లేదా-శ్రీరాములు
మాతల్లి సీతమ్మకైనా-శ్రీరాములు-నేను
మనవి జెప్పుకొందునయ్యా-శ్రీరాములు॥ ఏమి॥

౪

ఆసించియుండినదాసుని-శ్రీరాములు-నీకు
పోషించుభారము లేదా-శ్రీరాములు
నిన్నే నమ్మినాఁడనయ్య-శ్రీరాములు-నేను
గట్టిగా నా నెమ్మదిలో-శ్రీరాములు॥ ఏమి॥

౫

ఇల్లు వెడలి రావ దేమి-శ్రీరాములు-మీకు
విడిది భద్రాచలమాయెనా-శ్రీరాములు
వాసిగభద్రాద్రిని వెలసిన-శ్రీరాములు-రామ
దాసునీ రక్షింపరావా-శ్రీరాములు॥ ఏమి॥

వ. ఇట్లు దృఢప్రజ్ఞుం డైన రామదాసు రాములంగూర్చి ఇంకను నిట్లని దూఱుచున్నారు.

రాగము-మధ్యమావతి-చాపుతాళము.

నిన్నా బోనిచ్చెదనా-సీతారామ॥ నిన్ను॥

౧

నిన్ను బోనిచ్చెదనా?-నన్ను రక్షింపక
యెన్నివిధముల నా-కన్నులాన రామ॥ నిన్ను॥

౨

రట్టుచేసి నిన్నరికట్టుదు నింక-
దిక్కుగలిగితే మొఱఁ బెట్టుకోర రామ॥ నిన్ను॥

౩

గట్టిగ నీపాద-కమలము లెప్పుడు
బట్టినామదిలో-గట్టి వేయుదు రామ॥ నిన్ను॥

౪

బడిబడి మీవెంటఁ బడి తిరుగఁగ నెంతో
జడియక నీవెందు జరిగెదవుర రామ॥ నిన్ను॥

౫

తడయక నీతలి-దండ్రు లొచ్చినగాని
విడిచిపెట్టిన నీకొడుకనురా రామ॥ నిన్ను॥

౬

మావాఁడని మొగమోటములేకుండ
సేవఁజేసి రవ్వచేయుదురా రామ॥ నిన్ను॥

౭

నీవు భద్రాచల నిలయుఁడవై నన్నుఁ
గావవయ్య రామదాసవిలాస॥ నిన్ను॥

నాకు మోక్షమియ్యక నీ వొకయడుగు నైన దాఁటఁ గూడ దనుచున్నారు.

రాగము-మధ్యమావతి-ఆదితాళము.

బిడియమేలనిఁక మోక్షమిచ్చినీవడుగు దాఁటిపోరా
తడవాయెను నేనోర్వలేను దొర-తననుదాచుకోరా॥ బిడి॥

౧

మురియుచు నిదురను జెప్పినట్టువిన-ముచికుందుఁడఁగాను
అరుదుమీఱ తల నెగురవేయనే-హనుమంతుఁడఁ గాను
సరగున మెచ్చులమాటలు విననే-జాంబవంతుఁడనుగాను
బిలుబిలుమవలలో పలఁబడనే-విభీషణుఁడఁగాను-మాను॥ బి॥

౨

మాయచేతవంచింపఁబడఁగనే-మాహేశుడగాను
న్యాయములేక యిటునటుఁదిరుగను-నారదుండగాను
ఆయముచూడి హరి నరుఁడని కొలువను-నర్జునుండఁగాను
నాయాదుండనిమదిలో మురియను-దశరథుడనుగానుమాను॥

౩

గరిమతోడ మాసీతను జూచి-కాచితి నిందాఁకా
పరఁగ భద్రగిరి శిఖరనివాసా-పరబలసంహారచాపా

నరహరి ననురక్షింపుము వేగమె-నారాయణహరా
మఱచినిదురలో నైనను మీపద-సరసిజములుమఱవ॥ విడియు॥

వ. శ్రీభద్రాద్రినిలయా! నా కభయం బొసంగక నిన్నడుగు దాఁటనియ్య ననుచున్నారు.

రాగము - వరాళి - చాపుతాళము.

అడ్డుదాఁటి కదలనియ్యను-నా
కభయ మియ్యక నిన్ను విడువను

౧

గడియగడియకు తిరిగితిరిగి
యడిగితిని వేసరిక వచ్చెను
గడువుదప్పిన నేను నీఁకబహు
దుడుకుతనములు సేయుదును నిను॥ అడ్డు॥

౨

కుదురుగఁ గూర్చుండ నియ్యను-నీకుఁ
గోపమువచ్చిన భయపడను
ఇది మదిని నెఱిఁగియు నింకనీ మొగ
మోటమేమియు లేదు దగ నా
హృదయకమలమునందు నీమృదు
పదములను బంధించి వేయుదు॥ అడుగు॥

౩

లేపు మా పని జరిపినను నే-
నావుఁ జేసెదువాఁడగాను

ప్రాపు నీవని నమ్మికొలిచినఁ
బాపముల నెడబాపి దయతో
శేప శేపకునీదు మోమిటు
చూపకుండిన నోర్వఁజుమ్మి? అదుగు॥

४

పతితపావనబిరుదు లేదా-నన్ను-
బరిపాలన సేయరాదా?
ప్రతిదినంబును దేవతలు భూ
పతివటంచును వేఁడినను నీ
హితవుజనములువచ్చినన్ను
వేఁడికొనినను విడువ నిన్ను॥ అదుగు॥

×

రాక్షసాంతక సీతారమణా-సార-
సాక్ష సద్గుణభక్తాభరణా
ఈక్షణంబున దీనజనుఁడని
మోక్షమియ్యక యుంటివైనను
సాక్షిఁబెట్టి నేఁడు వేరొక
దీక్షచే సాధింతు నిన్నూ॥ అదుగు॥

౬

భూరిభద్రాచలవాసా-రామ-
భుజగశయన భక్తపోషా
కూరిమిగ నినువిడిచిపెట్టిన-
ధరణిలో భద్రాద్రిరాఘువ

రామదాసుడ నెడినామము
మాఱుపేరున బిలువు నన్ను॥ అడుగు॥

వ. అని యివ్విధంబునఁ బుడమిపట్టిమగనిం బ్రార్థించి వేసరి యోరామా! నాకొదవదీర్చుటకు సమర్థత లేదయ్యేనేని జగదంబ యగుసీతామహాదేవికైనం జెప్పి, సామాన్యజన కృతబాధాపీడితుండనై భవద్దాస్యంబు గోరియుండెడినన్ను బాధావిరహితునిగాఁ జేయింపరాదా? దాసజనసంరక్షణము సేయుట నీకు మేర గాదా? స్వామీ! యని గోపన్నగారు మొఱఁ బెట్టుకొనుచు నున్నారు

రాగము-ఆనందభైరవి-రూపక తాళము.

రామా నీచే నేమి కాదుగా-సీతా
భామాకైన జెప్పరాదుగ

౧

సామాన్యులు నిన్ను సకలబాధలుపెట్ట
నామొఱాలకించి-మోనమైనజూపవు॥ రామా॥

౨

శరచాపములశక్తి దప్పెనా-నీ-
శౌర్యము జలధిలో జొచ్చెనా
కరుణమాలిపైకము దెమ్మని భక్త
వరులబాధింప నీధైర్యమెక్కడఁబోయె॥ రా॥

3

శంఖచక్రాల్పట్టినందుకా-దాస-
జనుల రక్షింపవ దెందుకా?

పంకజాక్ష భక్తపరిపాలనశీల
పంకములేకాని బింకము లేదయ్యా॥ రా

తల్లిదండ్రి వనుకొంటినీ-నా-
యుల్లములో నమ్మి యుంటినీ!
కల్లరిజనములు-కారుబారులుసేయ
జల్లని కృప నాపైఁ జల్లవైతివిపుడు॥ రా॥

ఇంటివేలు పనుకొంటినీ-నీ-
కంటె దైవములే దంటినీ
ఒంటిగా పైకను నొప్పించుమనియుంటే
వెంటనంటి నాజంట రావైతివి॥ రామా॥

ఇట్లనేకప్రకారంబుల రాముని దూఱి గడువ దరంబు గాని దీర్ఘ కాలశిక్షకు వగచి వగచి.

ద్విపద.

అని యిట్లు రామదా ॥ సారాటమునను
తనమది విసికి యి ॥ ట్లని తలపోసె
రామచంద్రుని నమ్మి ॥ రవ్వపాలైతి
భూమిజపదపద్మ ॥ ములకు మ్రొక్కలిడి
నాపాటు లెఱిగించి ॥ నయముగా నన్ను
గాపాడఁ దలచును ॥ గన్నతల్లికిని
బుత్రులపై బాళి ॥ పోలఁగా హెచ్చు
గాత్రము ల్వాడినఁ ॥ గడుఁ గుందుచుండు

కావున మాయమ్మ కల్పకవల్లి
సేవింప రక్షించు సీతమ్మతల్లి
యని యెంచి సీతామహాదేవినపుడు
తనదుహృత్పద్మమందనువొంద నిల్పి
యోమహా మహాలక్ష్మీ! యోమధురవాణి
యోమంజుభాషిణి! యోపురాణి
యోజగత్కారిణి యోరమారమణి
యోజగన్మోహిని యోజగజ్జనని
మఱువక మీయనోమాత నన్ జూడు
మొ్రక్కెద నని యిట్లు మొఱలిడఁ దొడఁగె.

గీ. ప్రేమతోడుత రాముని ప్రేర్తిఁ దలఁచి
విసివి వేసారి మనమున వెతలఁ జెంది
జానకీదేవిపదములు సాఁగి మ్రొక్కి
తుత్రత మొనర్పంగఁదొడఁగె నానుజనహితుఁడు.

రాగము-అసావేరి - చాపుతాళము.

రామచంద్రులు నాపై-చలము చేసినారు
సీతమ్మ చెప్పవమ్మా!

౧

కటకటా వినఁ డేమి సేయుదుఁ
గఠినచిత్తుని మనను కరఁగదు
కర్మములు నెటులుండునోకద!
ధర్మమే నీకుండు నమ్మా! రా

౨

దినదినము మిచుట్టు దీనతతోఁ దిరుగ
దిక్కెవ్వరింక మా కోయమ్మా
దీనపోషకుఁడనుచు వేఁడితి
దిక్కులన్నియుఁ బ్రకట మాయెను
ఒక్కమాటైనాను వినఁడు
ఎక్కువేమని తలఁతు నమ్మ॥ రా॥

౩

కౌసల్యాతనయుఁడు-కపటము చేసాడు కారణమిటు లుండెను
కన్నడ చేసెదవా-నీకన్నులకు వైభవంబ
విన్నపింపఁగదవమ్మనీ-కిన్న దిక్కెవ్వరోయమ్మ॥ రా॥

౪

దశరథాత్మజుఁ డెంతో-దయశాలియనుకొంటి
ధర్మహీనుడఁటే యమ్మా-
దాసజనులకు దారి యితేఁడఁటఁ-వాసిగ భద్రగిరీశు
రామదాసుని నేలినాడటఁ - రవికులాంబుధిసోముఁ డితడట॥

అని మఱియు నే మనుచున్నారు.

రాగము - శహానా - చాపుతాళము.

జనకతనయ నాదు మనవిగైకొని జగ
జ్జనకునితోఁ దెల్పవే-ఓజననీ॥ జనక॥

౧

పనిబూని ననుఁ బెట్టెబాధ లన్ని టిని
పాటించి మహి లెన్నగా-ఓజననీ॥ జనక॥

౨

పన్నెండేండ్లనుండి-పగలు రేయినా
పన్నుఁడనై మిమ్ములా - ఓజననీ
ఎన్నెన్నో విధముల సన్నుతించినఁగాని
కన్నులఁ జూడఁ డాయె-ఓజననీ॥ జనక॥

౩

కన్నీరు లేకుండ-నున్న తీరు నా
కెన్నఁడు లేదుగదా-ఓజననీ
కన్న తండ్రులంత-కరుణమాలి భువిని
ఉన్నవారలు - గలరా - ఓజననీ॥ జనక॥

౪

అజునివారుని ప్రేమ-నాశ్రయించిన న
న్నాదరింపక పోదురా-ఓజననీ!
గజరాజు మకరిచే గాసిఁ జెంది వేఁడఁ
గాచి రక్షింపలేదా - ఓజననీ॥ జనక॥

౫

నిజముగ మీపాద-భజనచేసిన వాని
నిర్దయజూచినారు- ఓజననీ! జనక॥
సుజనాళినిము న్నెటువలెఁ బ్రోచిరో
నిజముగాదని తోఁచెను-ఓజననీ

౬

అసిపత్రములఁ బాని-యుగ్రులై నొసలిపై
విసరుచుందు రెప్పుడు-ఓజననీ !
మిసమిస మనుకోఱ-మీసము ల్దువ్వుచు
కసిదీఱసన్నాడిసి-గాసించుచున్నారు జనక॥

౯

అశనిపాతములన-న్నలసటనొందఁగ
విసరివిసరి కొట్టఁగా - ఓజననీ
వశముగాదునిమిష - మైన నోర్వఁజాల
జలజాక్షీ ! దిక్కెవ్వరే ! ఓజననీ ! జనక॥

౮

గడియగడియకు నన్ను-గఁగని దూతలవలెఁ
గడుభీతి నొందింపఁగా-ఓజననీ!
ఎడతెగనియాపద-యెప్పుడ్దుగలిగెను
నెవరితో విన్నవింతు-ఓజననీ! జనక॥

౯

తడవేలపైకము-తెమ్మనితహసీలు
తానీష సేయింపఁగా-ఓజననీ
ఇడుమలఁ బడలేను - ఊర్విపైఁ బ్రాణములు
విడిచి మిమ్ముఁజేరెద-ఓజననీ॥ జనక॥

౧౦

అదిగో వచ్చెదరని యిదిగో వచ్చెదరని-
యెదురుచూచుచు నుంటినీ-ఓజననీ!
ఒదిగి చిన్న వోయి-బందిఖానలో నే
నొంటరిగా నుంటిగదా!-ఓజననీ॥ జనక॥

౧౧

సుదతిరో తెల్లవాఱినవెనుక నన్నింకఁ
బ్రతుక నియ్యరు భటులు-ఓజననీ-
అతిభీతినొందినే నార్జించితిని విష
మాలస్యమిఁకఁజేయకు-ఓజననీ॥ జనక॥

౧౨

పరమపురుషుఁడింత-యఱమర చేసినఁ
బరుల నెవ్వరి వేడుదూ-ఓజననీ
సరసిజోదరునకు-సమ్మతి గాకున్న
సత్కీర్తి దక్కునఁటే-ఓజననీ॥ జనక॥

౧౩

మఱిమఱిమ్రొక్కెదు-మందలించినా
మనసు నీ కైపోయెఁగా-ఓజననీ-
సిరినాయిష్టము-చెల్లె నేఁటివరకు
వెఱపులన్నియుఁ దీరెగా-ఓజననీ॥ జనక॥

౧౪

అలివరో యన్నదమ్ముల నిటుపంపుమీ
యర్థముతోఁగూడను-ఓజననీ!
గతివేరేలేదు స-ద్గతి నొందించుటకుఁ
బతితపావనుఁడు దప్ప-ఓజననీ! జనక॥

౧౫

ఇతర మెఱుఁగక మీరే-గతియనినమ్మిక
నిదివఱకున్నాఁడనూ-ఓజననీ-
సతతము భద్రా-చల రామదాసుని
సంతరింప సమయమూ-ఓజననీ! జనక॥

వ. మఱియు నింకనేమని కొనియాడుచున్నారు.

రాగము - కల్యాణి - ఆదితాళము.

ననుబ్రోవమని చెప్పవే-సీతమ్మతల్లీ!
ననుఁబ్రోవమనిచెప్పవే

౧

ననుబ్రోవమనిచెప్పూ నారీశిరోమణి-
జనకునికూఁతురా! జననీ జానకమ్మ! నన్ను॥

౨

ప్రక్కను జేరుక - చక్కాలి నొక్కుచు
చక్కగమరుకేళి-సొక్కియుండెడివేళ॥ నను॥

3

లోకాంతరంగుడు-శ్రీకాంత నిను గూడి
యేకాంతమున నేక-శయ్యా నున్న వేళ॥ నను॥

౪

అద్రిజవినుతుడు-భద్రగిరీశుఁడు
నిద్రమేల్కొను వేళ-నెలఁతరో బోధించి॥ నను॥

తోహరా.

అని పలుమాఱును ప్రార్థనసేయఁగ నాలకించి సీతమ్మ
తనపతిసన్నిధి నిల్చివేఁడుకొనె దాసునిమొఱ వినిలెమ్మ!
తనయునిఁ గాపాడుటకీ విప్పుడు తడవు లేక యేతెమ్మ
చని రయమునభక్తునిగాచియుశరణాగతబిరుదు చేకొమ్మ॥
మును ప్రహ్లాదు విభీషణు గరివరు మొఱవిని కావఁగలేదా
అనుదినమును నినువేఁడెడిగోపన నాదరింపఁ గృపరాదా!
—ఇది వినరయ్యా.

ద్విపద.

అని యిట్లు రామదా సడలుకొనంగ
విని జానకీదేవి విలసిల్లుకృపను

శ్రీమించు ననవరత్న సింహాసనమున
సౌమిత్రి భరతుండు శత్రుఘ్నుఁ డధిక
వినయంబుతోఁ గొల్వ విబుధులు మెచ్చ
మునివరుల్గొనియాడ మోదంబుతోడ
నిండోలగంబున నివసించి యున్న
చండాంశు తేజుని సత్యసంకల్పు
శ్రీరామచంద్రు నీక్షించి సేవించి
చారు శృంగారవాత్సల్యలావణ్య
యౌవనలక్షణ యిందీవరాక్షి
యవ్వనజాప్తకులేంద్రుతో ననియె.

రాగము - బేగడ - ఆదితాళము.

అని యిట్లు రామదాసడలుకొనఁగ సీత
వినిపతికడకేగెనూ,
పలికూనిభక్తవత్సల రామచంద్రనా
మనవీచే కొమ్మనెను॥ అని॥

౧

వినవయ్య నీకు నే విన్నవింతునొక్క-
ఘనకార్య మీవేళనూ
అనఘయెల్ల రాజ్యము కొనియాడఁ పా
వనముగ వేనోళ్లనూ॥ అని॥

దాసపోషణబిరుదాంక సజ్జనులను
గాసి నొంద జేతురా

దేశీమనైన ది-నేశవంశజు లిట్లు
మోసము సేయుదురా? అని॥

౩

కరిమొఱలిడ నాఁడు-దురుసుగ నేఁగి మ
కరిదుంచి కరిగావవా?
పరమపావనరామ-చెఱసాలనున్న భూ
సురు నేల రక్షింపవో! అని॥

౪

అతిపాపి యైనయ-జామిళు నేలితి
వత డేమి నీచుట్టమా?
పతితపావన భ-ద్రాద్రినిలయ రామ
పాలింప విది దిట్టమా ? అని॥

౫

భద్రగిరీశుఁడు-భక్తులపాలిటి
పారిజాతం బనుచును
భద్రాత్ముఁడై యున్న వాఁడు రామదాసు
పాలించెద వనుచును॥ అని॥

ఆ. అనుచుఁ దృష్టి సనక శ్రీ యాజగన్నాయకు
దేవి మరల దేవ శ్రీదేవు మోము
నందుఁ జూడ్కి నిల్పి శ్రీ యారాటమునఁ దన
భావ మెల్లఁ దెలియఁ శ్రీ బడఁగ ననియె.

రాగము-ఆహిరి-చాపుతాళము

వేరే యోచన లేటికీ — ముమ్మాటికి?
వేరేయోచన లేటికి - ఓరామ॥ వేరే॥

౧

అపదుద్ధారకుడనుమాట నిజమైన
నీప్రొద్దు నీతని బ్రోచుటయే సాక్షి॥ వేరే॥

౨

ధ్రువ ప్రహ్లాదాదుల-ధ్రువముగ నేలినది
ధ్రువమైన నీతని-దిక్కుఁ జూచుటె సాక్షి॥ వేరే॥

౩

దీనజనపాలకు-డనుమాట నిజమైన
మానక యీతని-మన్నించుటే సాక్షి॥ వేరే॥

౪

ఆర్తపరాయణ-బిరుదుఁ గోరిన - వీని
యార్తిపోద్రోలి నీ-వాదరించుటెసాక్షి॥ వేరే॥

౫

శరణన్న జనుల నాక్షణమున బ్రోచెడి
బిరుదులున్న నితని వేగ గాచుటె సాక్షి॥ వేరే॥

౬

ఘనమైన భద్రనగ-మందున గలవేని
రామదాసుని నేలి-రక్షించుటే సాక్షి॥ వేరే॥

రాగము - యదుకులకాంభోజి - ఏకతాళము.

నామనవివిని వేగ ప్రాణనాథా-రామ
దాసుని వదలించుమి ప్రాణనాథా

౧

పాచ్ఛాయ నేప్లేచ్ఛుడు-ప్రాణనాథా-తుచ్ఛ
తుచ్ఛవాక్యము లాడెనయ్య ప్రాణనాథా॥ నామ॥

౨

లక్షపైకము దెమ్మనుచుప్రాణనాథా-ఎంతో
శిక్షచేయుచున్నాడయ్యా ప్రాణనాథా॥ నామ॥

౩

శరణన్న రక్షింతు నని ప్రాణనాథా-శర
ణాగతబిరుదువహిస్తివి ప్రాణనాథా॥ నామ॥

౪

తురకపైకముచెల్లింపుడు ప్రాణనాథా-ఎంతో
త్వరితముగాను నేగిరండు ప్రాణనాథా॥ నామ॥

౫

సీతాదేవిపలుకులకుఁ జిత్తమందు-రాములు
సంతసించి వెడలెద మ్మునితో ముందు॥ నామ॥

తోహరా

అన విని రాముం డతిహర్షంబునఁ గనె జనకాత్మజతోడఁ
గాని తెత్తుముగోపన్న నిపుడుగోల్కొండకుఁజనిమాతోడఁ

—ఇది విసర్జయ్యా.

తే. అనుచుఁ బ్రియురాలి నర్మిలి నాదరించి
తమ్ముఁ గనుఁగొని రమ్ము పోదమ్మటంచు
లక్ష్మణునితోడ రాముఁ డాహ్లాద మొప్ప
వేసముల సేవకులరీతి వేసి రిట్లు.

వ. అని యిట్లు సీతామహాదేవి బోధించిన భక్తపరాధీనుండగు భరతాగ్రజుండు దీనత్వంబున వనరు చున్నగోపన్నగారిని చెఱసాలకు వెలివఱచునుపాయం బెయ్యది యని సౌమిత్రితోడ నాలోచించి తానీషాకుపైకము చెల్లించుట

దే మంచిదని నిశ్చయించి యన్నయును దమ్ముఁడును సేవ
కవేషధారులయి తరలి రెటువలెననిన.

రాగము - మధ్యమావతి - రూపకతాళము.

జట్టీలాగూలు దొడిగిరీ-రామలక్ష్మణులు
పట్టూ ఛట్టీలు గట్టిరీ

౧

అట్టి రామదాసుని చే-పట్టి రక్షింతుమని
గట్టిగాను దశరథ -పట్టి రామలక్ష్మణులు॥ జట్టి॥

౨

జల్తారుపాగాలు చుట్టిరీ-రాణించు
సరిగా శాల్వాలు పైని గప్పిరీ
లలితమగు తెల్ల నం-గీలు దొడగి వేగముగా
చెలువ మమర కస్తూరి - తిలకము దిద్ది బాగా

3

విల్లూనంబులు పట్టిరీ-నడుమున బాఁకు
బిల్లా లొడ్డాణము బెట్టిరీ
బల్లిదులైధన-మెల్ల నుల్లమారల భూ
వల్లభునకునిపుడు చెల్లింతుమని వేగ॥ జట్టి॥

౪

ధనమూరవాణా చేసిరీ-వేగమె బహుస
ధను లగుచు వెడలి వచ్చిరీ
ఒనరగ గన్నూలు - మూని తెలచునంతలోన
ఘనుఁడు తానీషాయుంత్ః-పురముఁ జొచ్చి వచ్చిరీ॥ జట్టి॥

వ. ఇవ్విధంబున రామలక్ష్మణులు సేవకవేషధారులై హైదరబాదులో తానీషాయంతఃపురము జొచ్చి వచ్చుచుండ చెఱసాలయందు రామదాసుగారేమి సేయుచున్నారనిన.

ఆ. రామవిభుఁడు నేఁటిరాత్రి ప్రోవకయున్న
విషము గ్రోలి ప్రాణవితతి విడుతు
ననుచు నిశ్చయించి యధిక నిశ్చింతుఁడై
విషముగిన్నె నునిచి విబుధవరుఁడు.

ఆ. బడలి నిద్రఁ జెంది పడియున్న, నత్తురక
పతియు నిద్రఁ జెందె సతిని గూడి
స్వప్నమంద లేచి సరగునఁ బతి తన
పత్నితోడ నొనరఁ బలికె నిట్లు.

రాగము - మోహన - ఆదితాళము.

కలికి యీకల సొంగము-గను వినవే-ఓకలికి
పలుకఁగ నీతో మై-పులక లొదవెడినే కలికి॥

౧

అప్పుకలుగువాడె - యవని రామదాసుడు
ఇప్పుడతనికై నేడు - ఇద్దరు గూడి జోడు
కిప్పము పుచ్చుకొనుడు - తెప్పున మము బంపుడు
తప్పకయాసగుఁడుమాకు - తడవులేక రసీదనుడు॥ కలికి॥

౨

రామలక్ష్మణులట - వారర్క వంశజులట
రామదాసుపైన మట - రసీదందబంపెనట
రాములవారు చెల్లించట - రసీదందిపోయిరట॥ కలికి॥

3

ఏమికారణము యెఱుఁగను - ఈకల
యేమని చెప్పుదు నెలలోగ యీవింత
యీమహిమలు ఆరాములవి గాఁబోలు
జామువా త్తున్నది-జయము మొఱపజయము ॥కలికి॥

వ. ఇవ్విధంబునఁ దనస్వప్నవృత్తాంతంబు తానీషా తనభార్యతోఁ జెప్పుచుండుసమయంబున సేవకవేషధారులయిన రామలక్ష్మణులు తానీషాయంతఃపురములోని కరిగి భార్యతోఁ గూడి నిద్రించుశృంగారభవనకవాటంబు కరంబులచే మీటి యిట్లని యను చున్నారు.

రాగము - గౌళిపంతు - ఏకతాళము.

తలుపు తియ్యవయ్యా తానీషా-నీ
కియ్యెడ పైకము-నియ్యవచ్చితి మయ్యా

౧

ఫాలనేత్రుని తుమ్మి-పూల బూజించిన
మేలుదొరవు నీవు - మేలుకోవయ్యా॥ తలు॥

౨

నీలకంఠుని మల్లె-పూల నర్చించిన
మేలుదొరవు నీవు - మేలుకోవయ్యా॥ తలు॥

3

దీనుడైన రామ-దాసునిపైని న
మానముగను కృప-మానో వేగమున॥ తలుపు॥

ద్విపద.

రామలక్ష్మణు లంత । రయము మొప్పగాను
నేమంబు మీఱ బల్ । నేర్పుతో నచటి
ప్రాకారాలు పండ్రెండు । పటుగతి దాఁటి
దారయుఁ దానును । తానీషయున్న
బంగారు శృంగముల్ । రంగగుమహలు
సింగము ల్వాదలలో । శీఘ్రంబ చొచ్చి
నటువలెఁ జొచ్చి య । చ్చట నిల్వఁగాను
తటుకున తానీష । తలు పట్టి తెఱచి
భార్యను భద్రంబు । గా నుండు మనుచు
గార్యదక్షులను । గ్రమ మొప్పఁగాంచి
రామలక్ష్మణు లని । లక్షింపలేక
కామమోహితుడయి । కళవళ మొంది
యీయర్ధరాత్రిలో । నీమేడలోని
కేయుపాయంబున । నే తెంచిరొక్కో!
వీర లెవ్వరో యంచు । ధీరుండ డతండు
వారిచక్కఁదనంబు । వర్ణించె నిట్లు.

సీసమాలిక.

వసుధలో జనుల కీ । పస గలనుందరం
బీవిలాసంబు నే । నెందుఁ గానఁ
గోటిసూర్యులకాంతి । కొల్లఁబెట్టఁగ గట్టి
తేజంబు గలయట్టి । దేహములును

పూర్ణచంద్రుని బోలి ౯ పొలు పొందుముఖములు
సారసంబులఁబోరు ౯ జవురుకన్ను
లల కనుంగవలపై ౯ లలి మించుకస్తూరి
బొట్టును పట్టు దు ౯ ప్పట్లు పైని
రత్నకుండలకాంతి౯రం గైనచెక్కిళ్లు
కంబుకంఠంబులు ౯ కరము మెఱయ
వైజయంతీమాల ౯ వక్షస్థ్సలిని గ్రాలఁ
గరములఁ గుఱుచవిం ౯ డ్లొఱపుఁ జూవ
బంగారుచెఱఁగుల ౯ బా గొప్ప ధట్టీలు
సింహామధ్యములపైఁ ౯ జిందులాడ
ధట్టీల బాకులు ౯ తళతళ మెఱయంగ
శరాశరంబులు ౯ చేతఁ బట్టి
వచ్చి యశ్వమువాలులోఁ౯జొచ్చి రీధీరు లీ
వీరులఁ జూడగా౯వెఱగు పొడమె

తే. భీకరులు వీర లెవ్వరో౯నా కెఱుంగ
రాకయున్న దటంచును ౯ రాజు దలఁచి
నేల చూడంగ వరహాలు ౯ నిండియున్న
కారణంబున వారల ౯ కనియె నిట్లు.

రాగము - మధ్యమవతి - ఆటతాళము.

ఏదేశము మీది యెవ్వరు పంపిరి
యెందుకై వచ్చితిరి
భేదమొందకయతి - భీతినొందకమాకు
ఖ్యాతిగఁజెప్పిన కాచేము మి మ్మిపుడు॥ ఏదే॥

౧

అజునికైన నలవి-కాదు ఇచటికిరాగా
అర్ధరాత్రమందునా
గజసింహములనైన-ఖండించుభటులెంతో
కావలియుండగ-గడచి వచ్చితిరెట్లు? ఏదే॥

౨

అర్థమంతయుఁజూడ - నాశ్చర్యమాయెను
ఈభార మెటు తెస్తిరి
భద్రభూముల కయిన-బరువెతోఁచు నీ
యర్థము మీరెచట-నార్జించి తెస్తిరి॥ ఏదే॥

౩

మీరూపు మీసొగసు-మీచక్కదనమెన్న
లేరు ఈధరయందున
మారువేషములను - మాయనేరుపులతో
బన్నినారని తోఁచెను ఏదే॥

౪

ఇంతరాతిరివేళ-నీయర్థమిప్పుడు
ఎంతని పరకాయింప
రంతుసేయక రే-పంత చెల్లింపుఁడు
అంతదనుక ఖైదు-లో నుండు డనె నతఁడు॥ ఏదే॥

ఇటు లడిగినతానీషాకు కైతవభటు లేమనుచున్నారు.

రాగము - మోహన - ఆదితాళము.

భద్రాద్రిపురమున మేము-బహు
దినములనుండి కాపురము

అద్రిజాధిపబ్రహ్మేం-ద్రాదులకెల్లను
భద్రము లొసఁగెడి-భవ్యనిధానము॥ భద్రా॥

౧

ఇనవంశజుల మే మిద్దఱము-చాలా
దినముల నుండి యున్నాము
అనిశము రామదాసు-నాజ్ఞ చొప్పున మేము
పనులు సేయుచు నింట-బాగుగ నుందుము॥ భద్రా॥

౨

ఖయిదుఁజేసినవార్తదెలిసి - యిల్లు
బయలు దేఱి మిమ్ముఁ గలసి
పైకముచెల్లించి-భక్తునియాపద
బాపికొంపోయెడి-పనికై వచ్చినాము॥ భద్రా॥

౩

భక్తుడయినరామదాసు-నెంతో
సక్తు జేస్తిరి మంచిమేలు
ముక్తినిదానమా-యుక్తిదెలియక యా
సక్తి నర్థాపేక్షకై యిటు రొస్తిరి॥ భద్రా॥

౪

మించినకార్యమేమాయె-నెంతో
వంచన చేయుటు లాయె
సంచులన్ని మీరే - యెంచిరసీదు వ్రా
యించిసెలవు నిప్పించండివేగమె॥ భద్రా॥



57. రామలక్ష్మణులు రామదాసు చెల్లించవలసిన పైకమును తానీషాకు అంతఃపురమున నిప్పించి రసీదు నడుగుట.

[తానీషా రామలక్ష్మణుల సంవాదము.]

రాగము - నాథనామక్రియ - ఏకతాళము.

౧

తా. ఏదేశమున నుండువారూ-మీరు
ఎందుండి యిటు వచ్చినారూ॥
రా. తొలుత గోదావరియందూ-మా
స్థలము భద్రాచలమందూ

౨

తా. ఎవరి జవానులు మీరూ-మి
మ్మెవరు పంపఁగ వచ్చినారు
రా. దాసజవానులు మేమూ-రామ
దాసు పంపగవచ్చినాము

౩

తా. ఏమికులమువారు మీరూ-మీ
రిద్దఱు నేవరుసవారూ
రా. ఇనవంశమున బుట్టినాము-మే
మిద్దఱ మన్నదమ్ములము

౪

తా. ఏమి నామము గలవారూ-మీ
రేమి నేమము గలవారు
రా. రామోజి లక్ష్మోజినామం-మేము
రామానుజ మతమువారం

౫

తా. ఎన్ని దినములనుండి మీరూ-వారి
సన్నిధి కొలువై యున్నారు
రా. తాతముత్తాతలు మేమూ-మూఁడు
తరములనుండి యున్నాము

౬

తా. ఏమి జీతము నిచ్చువారూ-మీ
కేమి జీవన మిచ్చెదరు
రా. సమ్మతి లేక జీతాలు-ప్ర
సాదానికే కుదిరినాము

౭

తా. ఎందుకు పంపించినారూ-మీ
రేమి పనిగ వచ్చినారు
రా. సర్కార్కార్యాకీ పయికం-మా
చేతబంపగ వచ్చినాము

౮

తా. అర్థ మంతయు దెచ్చినారా-లేక
వ్యర్థముగా వచ్చినారా?
రా. వ్యర్థులము మేము కామూ-మీ
యర్థ మంతయు దెచ్చినాము

౯

తా. భైరోజీ భైరోజీ మీరూ-మీ
మాటలు చూడగ వేరు

రా. ఖైతోవారముగాము మేమూ-మీ
భేటికి నిట వచ్చినాము

౧౦

తా. లక్షలాఱును దెచ్చినారా-యిం
శిక్షలో నుండు మన్నారా!

రా. లక్షలాఱును నియ్యగలమూ-పది
లక్షలు మేమియ్యగలమూ

౧౧

తా. పంపినపయికము తెండీ-యా
పయినీ తమాషా చూడండీ

రా. పదివేలు తెచ్చినామండీ-యా
పయిని మా చేత లేదండీ

౧౨

తా. మగురూర్లాటలుమిరూ-మాతో
మందలించుచు నున్నవారు

రా. మగురూర్వారితో మేము-మరి
మాట్లాడువారము కాము

౧౩

తా. ధనము మా చేతికియ్యండీ-యా
వెనుక ఖైదులోకి పొండీ

రా. ఖైదులోకి మేముపోమూ-మీ
ఖజానపయికి మిచ్చేము

౧౪

తా. చెల్లింతురా ద్రవ్యమంతా-ర
శీదుల నడుగుట వింతా!
ఉంగరంబు విడెమందూ - ను
ప్పొంగుచు దొరదట్టియందు॥
మొహరుజేసినంతలో నా-జగ
న్మోహనాంగులు సంతోషమున.

వ. ఇవ్విధంబునఁ బయికము చెల్లించి నిలుచున్న రామలక్ష్మ
ణులం జూచి తానీషా వారు తెచ్చినపయికమును జూచి
యాశ్చర్యంబు నొంది యేమి తలంచుచున్నాఁ డనిన.

రాగము-శంకరాభరణము-రూపకతాళము

ధనముఁ జూచినంత తబ్బిబ్బులాయెను తానీషాకును
కనువిచ్చిగర్జింప కక్కసమాయె శ్రీరామునకును॥

౧

ఆసనమిప్పించయోచనపుట్టెను తానీషాకు-అతని
మోసపుచ్చిపోవ యోచనపుట్టె శ్రీరామునకు॥

౨

పన్నీరుగంధము పూయ మనసుపుట్టె-తానీషాకు-ఇంత
నున్నమైన తీయ మనసుపుట్టకపోయె రామునకు॥

౩

పసిడిశాలువు గప్ప విశదముగా దోఁచె-తానీషాకు
ముసిముసినగవుల మాటలాడఁ దోఁచె-రామునకు॥

౪

పతితపావనులని మతిలోనె తోచెను-తానీషాకు
మితిలేనిపుణ్యాత్ముడితడని తోచె-శ్రీరామునకు॥

౫

రంగుగ నికనైన రశీదునిమ్మనె-తానీషాతో
పొంగుచునిమిషాన రసీదువ్రాసిచ్చె-రామునకు॥

౬

రాతిరె రశీదు రాము డియ్యదలచె-దాసునకు
ఖ్యాతిగాను భద్రగిరిస్థిరమాయె శ్రీ-రామునకు॥ ధనము॥

తోహరా.

రామచంద్రుఁడార్లకులవరహాల్ కిరయమున నెంచకయిచ్చెగా
క్షేమమిఱ దానీష సలామనికెపెంపుగ వెడలియువచ్చెగా
---ఇది వినరయ్యా॥

వ. ఇవ్విధంబున భక్తార్తిభంజనుండగు శ్రీరాముండు తమ్మునితోడం గూడి తానీషాయంతఃపురంబునఁ బైకము చెల్లించి రసీదందిరామదాసునకారసీదు నిచ్చుటకై తానీషాచందంబున రూపంబు దాల్చి చెఱసాలకురా నుద్యోగించుసమయంబున రామదాసు మేల్కొని జాముప్రొద్దుండుటఁ గని యిదివఱక దేవుండు తనకు సాక్షాత్కరించి రక్షింపక పోయె నని నిష్ఠురవాక్యంబుగా 'పద్రిజయుం బ్రహ్లాదుండును నిట్టి నిర్దయాత్ముం డగునీనామస్మరణం బొనర్చి యెవ్విధంబునం గృతార్థులైరో రామా' యని మొఱలిడుచున్నారు.

రాగము - కల్యాణి - రూపకతాళము.

ఆదరణ లేనినీనామమంత్రజప
మదిర జేమనిచేసెరా రామా॥
అదె నీకునామీఁద-ముద మొప్ప దయయున్న
నదిదెలిసి మాట్లాడరా రామా॥ ఆద॥

౧

పరమద్రోహివి నిన్ను-పతితపావనుఁడని
ప్రహ్లాదుఁ డెట్లు దలచెనూ
పరమపావనిసీత-నడవికంపినపాప
కర్మునకు దయ వచ్చునా? ఆద॥

౨

పరబ్రహ్మ మని-బరమేష్ఠి యేరీతిఁ
బ్రస్తుతి చేసేనురా
పరసతనకై యిలను-భంగపఱిచినవాని
వరలక్ష్మి యెటుమెచ్చెరా? రామా॥ ఆద॥

౩

ఎన్నగా శబరియెం-గిలిభక్షణము చేసి
నట్టివ్యభిచారి వీవు
నిన్నునమ్మఁగ రాదు-నిను దైవమనరాదు
నిజమూ నామాటలు రామా॥ ఆద॥

౪

ఆదరణలేని నీ-నామమంత్రంబనుచు
నాడితీ నిను దూఱితీ

ముద్దుమాటలు గాని-మూర్ఖవాదముగాదు
మురహరా నను గావ రా॥ ఆడ

౫

ముద్దుమోముచూపి-ముదమొప్ప రక్షించు
భద్రాద్రిపరిపాలకా!
వద్దురా కృపనేలు-రామదాసుని మీఁద
వైరమా? చలమ? రామా! ఆడ

మ. అతికాఠిన్యుఁడ వీవు నిక్కముగ సత్యాపన్నుఁడ న్నేను
మతిలో నించుకజాలి పుట్టదిఁక నేఁడే దేవుఁ జింతింతు
గతియేతో ప్రవఁజరింతునన్యమెఱుఁగం గాంక్షించినీప్రాపుఁ
చ్చితి నీచిత్తమదెట్లు వచ్చినసరే శ్రీభావనారాయణా

వ. నీ వెట్టివాఁడ వైనను నాకు నీకంటె నన్యులు లేరు గాన నీ
కన్నైన నాయెదుట సాక్షాత్కరించి ముచ్చట లాడవయా
స్వామీ! యని యనుచున్నారు.

రాగము - నాథనామక్రియ - రూపకతాళము.

ముచ్చటైన నాడవేమిరా-కోదండపాణి-
ముచ్చటైన నాడవేమిరా?

౧

ముచ్చటైన నాడవేమి-ముదముతో మీపాదములు
మఱవక యెల్లప్పుడు నా-మదిని విడువక తలతు నేను॥ ము

౨

ఎందాక నే వేఁడుకొందు-ఏమి సేతీ వేళయందు
చెంత జేరితిని నన్నా-చేపట్టుము మొ్రక్కెదను॥ ము

౩

పండ్రెండేండ్లాయె నేను-బందిఖానాలోనే యుండి
నల్లులు దోమల చేత-నలుగుచున్న దీదేహము॥ము॥

౪

చైత్రవైశాఖములిపుడు-చెప్పతరముగాదె యెంతో
తహసీలు సేయగనాకు- జామీనైనా యెవ్వరు లేరు॥ ము॥

౫

తానీష గారు వచ్చి-తహసీలు చేసెదరు
కాసులుపంపించి నన్ను-గరుణచే చెఱవిడిపించు॥ ము॥

౬

నేనొక్కడనమీకు- నుంతనాపై నెనరు లేదు
మాతల్లిసీతమ్మకైన-మనవిచెప్ప కెటుపోతివో॥ ము॥

౭

ఒంటరిగానున్నా నింటి-దగ్గఱ నెవ్వరు లేరు
జంటతో సీతాలక్ష్మణుల-వెంట నేకూడుకో వచ్చి॥ ము॥

౮

వేమాఱుశ్రీభద్రాచల-రామస్వామి మీరిప్పుడు
రామదాసుని చేపట్టి-రక్షింపకున్నావు తండ్రి॥ ము॥

౧. ఏరాజాలము సేయఁగాఁ దలఁచినావే మోతలం బైనఁగా
నీరా దీనుల నేఁచ నీకు సరిగాదే నే తోఁచెఁ గాఁబోలు నే
నోర్చె రూపంబులు సేయు నీమహిమ లేకేను న్విర్విగాము న్నె వి
న్నారా తాతయగారిముద్ర యెట్లైకేనం దప్పదన్నరురా
రారా నాకభయప్రదాన మియరాకేరామా మహీజాధిపా.

వ. రామదాసుగారు సీతానాథునిం గూర్చి నన్ను రక్షింపకు న్న భవత్పితృమాతృకళత్రభ్రాతలకుం దప్పినవాఁడ వగ దు వని యానఁబెట్టుచున్నారు.

రాగము-పున్నాగవరాళి-ఆదితాళము.

రక్షించు దీనుని-రామరామ నీ-రమణితోడు-నన్ను
రక్షింపకున్నను-మీతండ్రి దశరథ-రాజుతోడు

౧

అరుదుమీఱఁగ విభీషణుని బ్రోచితి-వల్లనాడు-అట్లు
కరుణింపకున్న మీతల్లి కౌసల్యా-దేవితోడు॥

౨

గిరిగొన్న ప్రేమ సుగ్రీవుని బ్రోచితి-వల్లనాడు-అట్లు
సిరులియ్యకున్న మీ కులగురులైన-వసిష్ఠుతోడు॥

౩

అలికులవేణి యహల్యాశాపము పాపి-తల్లనాడు-అట్లు
కలుషము లన్నియు బాపకున్న ల-క్ష్మణునితోడు॥

౪

పాపాత్ముఁడైనయ-కాకాసురునిఁ బ్రోచితి-వల్లనాఁడు-అట్లు
నెపములెంచక కృపజూ-డకున్న మీ-వింటి తోడు॥

౫

వదలక నీమీఁద-నే నాసలు పెట్టి-వలసె నేఁడు-భద్రా
చలరామదాసుని నేలకున్న నీపా-దములతోడు॥ రక్షించు॥

వ. కరినేలింది హాళిక్కి ద్రౌపదికి గోకలిచ్చి యిచ్చింది ద బ్బఱ కాకాసురునిం గటాక్షమునఁ జేకపట్టిందబద్ధం బహో

శర ణన్న గా బగవానితమ్మునికి రాజ్యం బిచ్చుట ల్గల్ల! యీ
త్రతటి నన్నేలిన నిక్కమీ కథ లనంత తా! భావనారాయణా!

వ. అని యివ్విధంబునం దూఱి లోకనాథుండగుసీతానాథుండు
రక్షింపక యున్న మిక్కిలి వగచి భక్తుండు గావునఁ దన్నుం
దెలియక యజ్ఞానకృతంబున స్వామీ! నినుదూఱితి నాయప
రాధంబు సహించి రక్షింపు మని కీర్తింపుచున్నారు.

రాగము- కాంభోజి-అటతాళము

ఆసపెట్టితినని ఆయాసపడవద్దు-రామచంద్రా-నా
పామరత్వము చేత-బతిమాలుకొనియెద-రామచంద్రా॥

౧

తామసింపకనన్ను-దయతోడఁ గృపజూడు-రామచంద్రా
తడయకమీతల్లి-దండ్రియానదీతె-రామచంద్రా॥

౨

సేవకునిగ జేసి-చేపట్టిరక్షించు-రామచంద్రా
చెలువుగ సీతా-దేవియానదీతె-రామచంద్రా॥

౩

కోరికదయచేసి- కొదవలు దీర్పవే-రామచంద్రా
కొమరొప్ప మీకుల-గురునానలుదీతె రామచంద్రా॥

౪

నెనరుంచి నామీద-నిరతము బ్రోవుము-రామచంద్రా
వినయముగా సౌమిత్రి-యానదీతెనయ్య-రామచంద్రా॥

౫

వేడుక మీఱగ-వేగరక్షింపువో-రామచంద్రా
జోడుగభరత-శత్రుఘ్నులానదీతె-రామచంద్రా॥

౬

జంటగ మీవెంట-బంటుగ నేలుము-రామచంద్రా
తంటలేక మీ-వింటియానదిదె-రామచంద్రా॥

౭

ఆదరింపుము నన్ను-అడియేఁ దాసుడ-రామచంద్రా
వాదేల రామదాసునిబ్రోవుమింక శ్రీ-రామచంద్రా!

వ. ఇవ్విధంబున నానలుదీర్చి విసంబుగొని జీవంబువిడిచిహరిం జెందెద నెన్ని దినంబులున్నను మరణంబునిత్యంబగుటం జేసి యీరీతినేలకాలంబు గడపవలయునని దృఢనిశ్చయుండయి శరీరపరిత్యాగంబునకు ముందుగా రాముని హృదయస్థునిం జేసి సమస్తోపచారంబులంబూజించెదంగాక యని మానస పూజానియమము సేయుచున్నారు.

రాగము - ధన్యాసి - ఆదితాళము

రామరామ శ్రీరామా రామా
రామాయనరాదా-మనసా
కామితఫలదుండగు శ్రీసీతా
కాంతుని గనరాదా-మనసా॥ రామ॥

సలలితముగ రఘువరునకు సింహా-
సన మీయఁగరాదా-మనసా
నలినభవామరపరివేష్టితు ధ్యా
నము సేయఁగరాదా-మనసా
బలుఁడౌ రాముని రారమ్మని యా
వాహన సెయరాదా-మనసా

వెలయఁగపాద్యము శ్రీభద్రాచల
విభున కీయరాదా-మనసా॥ రామ॥

౨

ఆదిత్యార్చితుఁడగు రామున కీ
వర్ఘ్యం బియరాదా -మనసా
వేదవేద్యునకు నాచమనంబును
వేగ నీయరాదా - మనసా
నాదనురూపున కర్థిమెయిని స్నా
న మొనర్పఁగరాదా-మనసా
పాదార్చిత భూవిభున కద్భుత వ
స్త్రము లీయగరాదా-మనసా॥ రామ॥

౩

భూతనయాధిపునకు నీ వుపవీ
తం బివ్వగరాదా-మనసా
ఖ్యాతిగ దశరథసుతునకు మేల్ శ్రీ
గంధం బియరాదా-మనసా
కేతకికుసుమములు జాజులు నర్పణ
చేసెద మనరాదా-మనసా
శ్రీతులసీదళములు గొని యాశ్రిత
పోషుని కీరాదా-మనసా॥ రామ॥

౪

కపిలఘృతంబున ధూపదీపములు
గావింపగరాదా-మనసా

నృపసత్తమునకు దీపారాధన
నిపు డియ్యగరాదా-మనసా
తపనులపాలిటి వానికి నై వే-
ద్యము సేయగరాదా-మనసా
కృపణవిరోధికి తాంబూలంబులు
నిపుడె యివ్వరాదా-మనసా॥ రామ॥

౫

నృత్తగీతవాద్యమ్ముల నాతని
తృప్తి సేయరాదా-మనసా
చిత్తజజనకుని మత్తత లేకను
హాత్తియుండరాదా-మనసా
మెత్తనిశయ్యాయు-మేలగుదిండ్లును
మెప్పుగ నీరాదా-మనసా
ఱొత్తఱి నైనను మఱవక శ్రీహరి
భక్తి సలుపరాదా-మనసా॥ రామ॥

౬

రాముడు కొలువై యుండెడి వేళ ప
రాకు చెప్పరాదా-మనసా
రాముని నామము నేమఱకెప్పుడు
నోమి తలపరాదా-మనసా
రామ రఘుగ్రామణి సీతాహృ
త్కామద యనరాదా-మనసా
శ్రీమద్భద్రాచలధామా-శ్రీ.
రామా యనరాదా-మనసా॥ రామ॥

ఉ. శ్రీదము లాశ్రితావనవిశేషవినోదము లాగమాంతస
మ్మోదము లబ్జజాద్యమరముఖ్యమనఃకమలార్చనాంతరా
హ్లాదము లార్తరక్షణమహాత్త్వపటుత్వ సమస్త శిష్ట క
ష్టాదములౌ దలంపుమన సా హరిపాదములాశ్రయింపుమా!

వ. ఇవ్విధంబున మానసనియమంబును చేసి రామదాసుగారు
మానసపూజ నిట్లులు సేయుచున్నారు.

రాగము - కాంభోజి - జంపెతాళము.

సకలేంద్రియములార-జరుగ సమయము గాదు
సద్దుసేయకయుండరే
ప్రకటముగ మాయింట-పండుగై జానకీ
పతిపూజ సేయువేళ-మీరు॥ సక॥

౧

నిరతమును పదునాల్గు-భువనములు కుక్షిలో
నిర్వహించెడిస్వామినీ
యిరువుగను నాహృదయ-కమల కర్ణికమధ్య
మున భక్త నుంచికొని
శరణాగతత్రాణ-బిరుదుగలిగినతండ్రి
గరుణింపు మని వేడుచు
నరసింహదేవునకు-పంచామృతస్నాన
మొనరించు వేళ మీరు॥ సక॥

౨

తళుకుతళుకునముద్దు-గులుకుజిగి కుందనపు
నిలువుటంగియు దొడిగి వే

నలరు ఘుమఘుమఁ బరిమ-ళించు వనమాలి కా
హారములు మెడను వేసీ
లలితకౌస్తుభముఖ్య-దివ్యరత్నముల చొ
క్కపుతాళి మెడనువేసీ-
అలదయాపర విగ్ర-హునకు భుజకీర్తులును
హరికి సవరించువేళ-మీరు॥ సక॥

3

పదియూఱువన్నె బం-గరుశాలు దట్టికట్టి
విదియచందురుని గేరు-
నుదుటఁ గస్తురినామ-మునుదిద్ది తామరస
సమమృదువు పదములందు
కదిసి మువ్వలుపాద-సరములందెలుఘల్లు
మన ఫాంకముగను నుంచి
అదట నొడ్డాణమును-మొలనూలు ఘంటలు
హరికి సవరించువేళ మీరు॥ సక॥

౪

కౌమోదకీశంఖ-చక్రనందక శార్ఙ్గ
శార్ఙ్గకాంచిత కరముల
శ్రీమించుకనకంపు-హురుమంజి ముత్యాల
చికిలికడియము లమర్చి
పేమచక్కని వేళ్ల-ముద్దుటుంగరములను
ప్రియమొప్ప వీనులందు
మామనోహరునకు-వజ్రముల మకరకుం
డలము లమరించువేళ మీరు సక॥

౫

శిరమునను శతకోటి-సూర్యులను మించు భా
సురకిరీటము ధరించి
హరిపాదకమలముల-కును మంచిస్వర్ణంపు
బువ్వులను పూజచేసి
యురుధూపదీప నై-వేద్యతాంబూలాది
సకలోపచార మొసగి
సరసభద్రాద్రీశు-నకు రామదాసుండు
సాష్టాంగ మొనరించువేళ మీరు॥ సక॥

వ. ఇవ్విధంబున దేహేంద్రియప్రపంచంబుల మఱచి తన్మయత్వంబున రామదాసుగారు మానసపూజ గావించుచుండఁ జెఱసాలకు వచ్చి శ్రీరామలక్ష్మణులు రామదాసునిఁ జూచుట యెటువలె ననఁగా.

రాగము - నాథనామక్రియ - ఏకతాళము.

రామదాసునిజూచిరీ రామలక్ష్మణులు॥ రామ॥

౧

రామలక్ష్మణులు-రాజుకు రూకలు
తామే యొసగియు-దయతో వచ్చి

౨

పరమభక్తుని-చరణయుగ్మమున
బరువుగ వేసిన-యిఱుకుసంకిళ్లను
ఇరువదివ్రేళ్లను-బెరిగినగోళ్లను
వెరవుగ నాతని-శిరము వెండ్రుకలు

మఱిజడలును బడి-కరమునసూత్రము
పొరలినగాత్రము-నెఱిలోడగ్గఱ
గరళముంచుకొని-హరిహరియంచును
ఎఱుక లేకయే-ధరబవళించిన॥ రామ॥

౩

అన్నదమ్ము-లా పన్నరక్షకులు
పన్నుగాను-గోపన్నయున్నతీ
ర్లన్నియు మదిగని-కన్నులనీరిడి
అన్న లక్ష్మణా-తిన్నగలోపల
విన్నదనువున జని-గిన్నె విషంబును
మన్నునగలిపియుఁ-గన్నుమొఱఁగి రా
వన్నాయన యా-పన్నగాంశజుఁడు
గ్రన్నన జేయగ-జెన్నలరుచు హరి॥ రామ॥

౪

గిరినిభమగుకరి-మురియుచు సరసిని
సరగున జని జల-మరుదుగ ద్రావియు
తిరిగెడుతఱి మక-రిని గని చరణము
దురుసుగ నొడిసిన-కరకరినొందుచు
కరి 'హరి హరి' యని-పరిపరివిధముల
మొఱలిడవినికర-మరుదుగ సరగున
నరిగి మకరిశిరో-హరణమొనర్చియు
నఱమర లేకయె-కరి నేలినహరి॥ రామ॥



శ్రీ రామలక్ష్మణులు తానీషా వేషధారులై రసీదును బందిఖానలోనుండు గోపన్నకు నిచ్చుట.

×

ధర సుగ్రీవుడు-మఱి వాలికి తా
వెఱచి వేగ తన-పురము విడిచి బలు
మఱుగుగా నతడు-తిరుగగా నపుడు
సరగున నాతని-వెఱవకు మని చని
హరిహయపుత్రుని-బరిమార్చియు నా
హరిరాజ్యంబును-గరుణనొసగి యు
త్తఱి నిగాచినటు-లురగేశుం డా
వరలక్ష్మణుడును-హరిగోపాలుడు॥ రామ॥

తోహరా.

గజపతి బ్రోచినఘనుడగు రఘుపతి కరళపురిన్నేను వేగ
నిజదాసుని కది తెలియక ముందుగ నిలపయిదోసెను బాగ
రసీదుచేకొని తానిషచందము రాముడు వేషముదాల్చెన్
వశీకృతుండై గోపన యున్న బందికానకడ నిలిచెన్. 99
రామలక్ష్మణులు గోపనభక్తికి రయమున మెచ్చిరి వేగ
ప్రేమను 'రామదాసా' యనుచును పేరిడి పిలిచిరి బాగ.
రామదాస మీ బాకీపయికము రానాయెను నిది వినుము
ప్రేమతో నిచ్చదనిపుడు రసీదును బ్రియముతోడ జేకొనుము
ఇటు ప్రియవచనము చెప్పి రసీదును నిచ్చి రామదాసునకు
బటుతరముగ నా రామ లక్ష్మణులు పయనమైరి నెలవునకు.
ఈలీ రంతర్ధానము కాగా నిట్లని గోపన యెంచెన్
సీతేశుడు చేసినకార్యం బని చిత్తమందు ధ్యానించెన్॥
—ఇది విన రయ్యా॥

వ. ఇవ్విధంబున భక్తవత్సలుం డగు శ్రీరామచంద్రుండు లక్ష్మణసహితుం డయి నిజదాసుండగు గోపన్నయొక్క శ్రమము నివారణ మగుటకుం దగిన కృత్యంబు లొనర్చి యంత ర్హితులయినమీద రామదాసుగారీ యమానుషకృత్యంబు లొనర్చుటకు నీకింకె సమర్థు లెవ్వరును లేరు. నీమాయ యిట్టిదని తెలిసి వర్ణించుటకు బ్రహ్మేంద్రాదులకుం దరంబుగాదు. నే నెంత వాఁడను. కాబట్టి నన్ను జడుండని విడనాడక కాపాడుము. సీతామనోనాయకా! యని వినుతి సేయుచున్నారు.

రాగము - కల్యాణి - రూపకతాళము.

ఏమయ్య రామ బ్రహ్మేంద్రాదులకునైన
నీమాయ దెలియ వశమా?
కామారివినుతగుణ-ధామ కువలయదళ
శ్యామా నను గన్నతండ్రి రామా॥ ఏమ॥

౧

సుతుడనుచు దశరథుడు-హితుడనుచు సుగ్రీవు
డతిబలుం డనుచు-గవులు
క్షితినాథుడనుచుభూ-పతులు కొలిచిరిగాని
పతితపావనుడనుచు-మతి దెలియ లేరయిరి॥ ఏమ॥

౨

చలికా డనుచు పాండ-వులు విరోధివటంచు
నల జరాసంధాదులు
కలవాడవని కుచే-లుడు నెఱింగిరి గాని
జలజాతుండని నిన్ను-సేవింపలే రయిరి॥ ఏమ॥

3

నరుడవని నరులు తమ-దొరవనుచు యాదవులు
వరు డనుచు గోపసతులు
కరివరదభద్రాద్రి-పురనిలయ రామదాస
పరమాత్ముడని నిన్ను-భావింప లేరైరి॥ ఏమయ్యా॥

చ. హరునకు నవ్విభీషణునకద్రిజకుం దిరుమంత్రరాజమై
కరికి నహల్యకున్ ద్రుపదకన్యకు నార్తి హరించుచుట్టమై
పరగినయట్టినీపతితపావననామము నాదుజిహ్వపైఁ
దరముగ నుండఁ జేయఁగదె దాశరథీ కరుణాపయోనిధీ!

వ. ఇవ్విధంబున రామదాసుగారు శ్రీరాముని మహిమానువ
ర్ణనంబు సేయుచుఁ దన్మయత్వంబున నుండునప్పుడు.

ద్విపద.

అంతట దానీష యదరుచు లేచి
చింతగూర్చినమది సేద దేర్చుచును
బువ్వుబోణినిజూచి పాలతిరో వినుము
ఎవ్వరో వచ్చిన దెఱుగ లేనైతి
నెఱిగియుండితి నేని యిప్పుడేవారి
చరణాంబుజంబులు సరగునబట్టి
కరమర్థిఖాజించి కరుణ వడయుదును
పరమాత్ములని నేను భావింపనైతి!
మనుజులబోల రా మహితాత్ములరయ
లోకపాలకు లిట్లు లోలతగాను
వైకుంఠమందుండి వచ్చిరా నేడు

తాళుఁ డంచనన్నైతి కదనరగా నిపుడు
వేళ గాదనన్నైతి వెంగలి నైతి
వ్రాసి యిచ్చెద రసీ దోసాధులార!
వాసి మీఱగ దెలకవాఱగా ననుచు
ననన్నైతి నేజాల నపరాధి నైతి
నను నేమనందు నో కనలినయతాక్షి!

వ. అని మఱియు నే మని యనుచున్నాడు.

రాగము - కన్నడ - ఏకతాళము.

కల నిజమాయెనే-ఓకలికిరో వినవే॥ కలనిజ॥

౧

చూపున బాలురే-సొగసైన రాతులే
రేపునరారే యో-రాణి మహాత్ములే॥ కల॥

౨

నామదిలోన-నరులన గారే
ఈమహిలో నే-నెఱుగనివారే॥ కల॥

3

పురములుచూడగ-పురాణ పురుషులే
మర్యాద లేదే-మహానుభావులే॥ కల॥

౪

దాసజవానులే-జాతి కబీరులే
వాసవవినుతులే-వారిజనేత్రులే॥ కల॥

౫

భద్రాద్రివాసులే-భవ్యవిభాసులే
భద్రాత్మరామదాస-పాలితవిలాసులే॥ కల॥

రాగము - ఆనందభైరవి - ఆదితాళము.

తెలియకనే మోసపోతిని-దేవ
దేవుం డని తెలియనైతిని తెలి॥

౧

నలినాక్షీ వినవె కే-వలమగుశ్రీభద్రా
చలధాముఁ లయినశ్రీ-రామలక్ష్మణుల ని
శ్చలముగ వివ-రింపనైతిని చాల
నిసిలో ద్వారమందునా
తలుపుగొట్టుచు బిల్వఁగా సా
మాన్యులని నే నెంచుకొంటిని॥ తెలి॥

౨

రక్షించుమని వేడనయితిని-ద్రవ్యా
పేక్ష గల్గినవాడ నైతిని
తత్క్షణమున వారా-ర్తరక్షలవరవాల్మి
ర్లక్ష్యముగ నొసగిన-సాక్షాత్కారులను
పక్షమున కరుణాకటాక్ష-వీక్షణాలం కారదానవ
శిక్ష సజ్జనపక్షభువన-రక్షనను రక్షించు మని నే॥ తెలి॥

3

కనకాసనమియ్యనైతినీ-క
స్తూరిగంధము బూయనైతిని
ధనము జూచి మోహ-మున తబ్బిబ్బైతిని
మనమున నతడాది-దేవుడనుచుభక్తి
వినయపూర్వకముగ బొగడుచు. మనమునశ్రీపాదపద్మము
నెనరుమీఱగపట్టుకొనిన-న్నేలుకొమ్మని యడుగనైతిని॥ తెలి॥

౪

పసిడిసాలువు గప్పనైతిని—మంచి
  పన్నీరునేజిల్కనైతిని
విశదముగాలంక-వేగ మెక్కపతోను
దశకంఠానుజునకు-మసలకనొసఁగియు
శశిముఖిసీతతో-భద్రాచలమున
వసియించి వేడుక వసుధలోపల రామ
దాసుని పోసఁగ నేలిన రామచంద్రుని॥ అలె॥

తోహరా.

అనితనసతితో దహాతపాపొందుచు | నపుడు తెల్లవాఱఁగను
గొనితెమ్మనెనా రామదాసుని | గొలువున కతిరయముగను.
ఆమాటలు విని యతిరయంబునను | నక్కనమాదనగారు
రామదాసుని దగ్గఱఁబోయియు | రయమునఁనిట్లన్నారు 105
ఇకవుగ నీకై రామలక్ష్మణులె | యూగొల్కొండకు వచ్చి
యాఱులక్షలపయికము సరిగా | నలులేదయె చెల్లించి 106
రశీ దందుకొని వెళ్లిపోయి రఁట | రాత్రివేళ నే వారు
విశదముగా నిమ్మును దెమ్మనెను | వేగ మె తానిషగారు. 107
అనియిటు దెల్పుచుగాళ్లగొలుసులను | నతిరయముసదీయించి
కనకపుపల్లకిలోనిడి తెచ్చిరి | కడుసంభ్రమమున నుంచి. 108
కొలువులోనఁ దానీషా గొబ్బున | గోపన్నను దాఁజూచెఁ
నిలిచియె తనచెయ్యెత్తి సలామని | నీవె ధన్యుఁడని మెచ్చెఁ.
—ఇది విసరయ్యా.

వ. ఇట్లు కొలువుకూటంబునకు వచ్చినగోపన్న గారికిఁ దగినమ
ర్యాదలు చేసి తాను సర్కారుపయికము చెల్లించినందుక

యి వారి కియ్యవలసిన రశీదు రాత్రికాలంబున రామదేవు
నిచేత నిచ్చియుండియు విస్మృతి నొంది రశీదు దీసికొనుట
కయి రామదాసుగారిని వేఁడుకొనుచున్నారు.

రాగము - సౌరాష్ట్రము - ఆదితాళము.

రామదాసుగారూ రండీ
రశీ దందుకొండీ॥
ప్రేమమీఱ శ్రీరామలక్ష్మణాలు
తామేధనమంతయు చెల్లించిరి॥ రామ॥

౧

ఎంతపుణ్యమతివో యీశ్రమ-నెట్లువహించితివో
ఇంతవాడవని యెఱుఁగక చేసితి
సంతముంచకుము పరమదయాళో॥ రామ॥

౨

తప్పు లెన్నబోకు-మిక సు-యప్పుదీరెమాకు
కుప్పబోసి ధన-మప్పగించక యె
ఱప్పపాటుచను-జెప్పక పోయిరి॥ రామ॥

౩

కానలైతిమున్ను-ఇంతటి-ఘనుడవనుచు నిన్ను
మాను బలము ప్రస-న్నుదిలో నిడి స
మ్మానముగా నను-మఱవక బ్రోవుము॥ రామ॥

౪

తురకజాతి గనుక నేను-దుర్బుద్ధి నైతి
నరహరి భక్తుడ-వని నినుదెలియక
పరిపరివిధముల-బాధలు పఱచితి॥ రామ॥

౫

రామదాసవనుచు-తెలియక-రవ్వచేసినాత
ప్రేమ భద్రగిరి-ధాము లైన శ్రీ
రాములక్ష్మణుల-కేమి కటాక్షమొ॥ రామదాసుగారూ॥

తోహరా.

రామదాస వని రంజనసేయక రచ్చలబెట్టితి నేను
నీమహిమను శ్రీరాములవారిని నీక్షించితి నీదయను. ।10

అనియిటు తానిష రామదాసుని నతిశయముగ బ్రార్థింపఁ
వినుధన్యుడవీవనుచు తానిషకు విహితముదాసుఁడుచెప్పెన్
—ఇది వినరయ్యా.

వ. అని యిబ్బిధంబునం బ్రార్థనపూర్వకంబుగా విన్నవించుచున్న తానీషాను జూచి గోపన్నగారి ట్లనుచున్నారు.

—రామదాసు తానీషాల అభినందనము.—

రాగము - వాథవాము క్రియ - రూపక తాళము.

౧

రా. ధన్యుడవు తానీషా నీవు-సన్ను
గన్నయ్యపదములు కనులగన్నావు॥
నిన్నటిరాతిరి వారు-వచ్చి
ఎన్నిముచ్చటలాడి-యేమే మన్నారు
ఎన్నెన్ని వేడిన రారు-నీవు
పుణ్యమూర్తి విగనుక-పొడచూపినారు॥

తా. ధన్యుఁడవు గోపన్న నీవు-మా
దాశరథికి నిజ-దాసుఁడై నావు
సామాన్యుఁ డనియెంచుకొంటి-నేను
పామరుఁడై మిమ్ము బాధింపుచుంటి ధన్యు॥

౨

రా. ఏమిపూజలు చేసినారు-మా
స్వామిభద్రగిరి-ధాములమీరు
ప్రేమతో సేవించినారు-శ్రీ
రాములకృప గల్గి-రంజిల్లు డీరు
తా. పైకము దీసుకి పొండి-మీభద్రా
చల రామదాసులై పట్టమేలండి
అయిందెల్ల వేసుకొండి-మీరు
అనుదినము రాముల-నర్చించండి ధన్యు॥

౩

రా. ఏటిమాటలు పలికేదరు-నా
కేటికీరాజ్య మీయిలలో నేమిరు
నేటి జన్మమె త్తినారు-మా-
సాటివారలె యీజ-గంబున లేరు
తా. భద్రాచలమా-నెప్పటికి-రాము-
భద్రునకిచ్చితి బాగుగాపినుమీా
ముద్రనిశానీల్ చేకొనుమీ-శ్రీ
భద్రాద్రివరరామదాసుఁడై మనుమీ॥ ధన్యుడవు॥

వ. అనిన రామదాసుగారేమనుచున్నారు.

రాగము-నాథనామక్రియ-ఆదితాళము.

దరిసెనమాయెను-శ్రీరాములవారి దరి॥

౧

దరిసెనమాయెను-ధన్యుడవైతివి
యురమునందుసిరి-మెఱయుచున్నవాని॥ దరి॥

౨

శుభులకుయోగి-ప్రభులకునైనను
అభిముఖుడై యానమును జూపనివాని॥ దరి॥

౩

కండక్రొవ్వున పను-మఱచువాని తల
చెండెదనని కోదండమెత్తినవాని॥ దరి॥

౪

పరమభక్తులకిల సిరులొసంగెదనని
కరమునదాన కింకిణముగట్టినవాని॥ దరి॥

౫

స్థిరముగ భద్రా-చలరామదాసుని
నరసిపోచెదనని-బిరుదుదాల్చినవాని దరి॥

వ. అనిన వినితానీషా రామదాసుగారితో నేమనుచున్నాడు.

శ్లోసా రా.

ఎంతోయిడుమల బెట్టితి నిక నన్నీ క్షింపుము నీకృపను
వంతుగ రాములు తెచ్చినవరహాల్ కవడిగను జేకొమ్మనెను
భద్రాచలమును నెప్పుడు నిచ్చెద బాగుగ మాన్యముగాను
ముద్రనిశానితొయిస్తాం చేకొను ముదముతో చెల్ జీయనెను.

తానిష చెప్పినమాటలువిని యాయతివర రామదాసుండనెను
మానముతో మము విడిపించినదే మాకిది లక్షలు అనెను.
ఇచ్చినమాన్యము వరహాలన్నియు నింపుగ రఘుపతి కనెను.
నిశ్చలభక్తిగ రాముల మఱువకు నీవు ధన్యుడని చనెను.

——ఇదివినరయ్యా

వ. ఇట్లు తానీషాగారు రామదాసుగారి ననేక విధంబుల బ్రార్థించి రామలక్ష్మణులు తనకు జెల్లించిన మోహరులక్షల వరహాలును విశేషవస్త్రాభరణంబు లొసంగినం బుచ్చుకొని పరివార జనంబులతో భద్రాచలంబునకు బోవుచు రామకీర్తనంబు ఎట్లు సేయుచున్నారనిన.

శా. శ్రీరామా రఘునందనా రఘుపతీ సీతామనోనాయకా
కారుణ్యాభయదానహస్తవరదా కాకుత్స్థవంశోద్భవా
దారిద్ర్యాంధతమిస్రతాపహరణా తత్త్వాబ్ధిచంద్రోదయా
రారా నామదిలో వసించి కృపతో రక్షింపరా మ్రొక్కెదన్.

రాగము-నాదనామక్రియ-ఆదితాళము.

నిను నమ్మియున్నవాడరా-ఓరామా

౧

నినునమ్మియున్నవాడ నను బరుల వేడనీక
మన్నన జేసిపాలింపవే-ఓరామా॥ నిను॥

౨

గతిమాలివ్రతముచెడుటే కాని యుండేమిసుఖము
వెత బొందంగ జాలనే-ఓరామా॥ నిను॥

౩

మానమువిడి కను-మాలవుపొట్టకొఱకై
మానవుల వెంబడింతునే-ఓరామా॥ నిను॥

౪

సతతమురక్షించు చతురతనీకున్నప్పుడుమది
జంచలింప నేటికే-ఓరామా॥ నిను॥

౫

సతతముశ్రీభద్రాద్రిస్వామి శ్రీరామదాస
పతివైన న్నాదరింపవే-ఓరామా॥ నిను॥

సీ. సకలభూతవ్రాతసంఘవిధ్వంసంబు
రామతారకమంత్రరాజ మరయ
సకలరక్షోవీరజాలనిర్మూలంబు
రామతారకమంత్రరాజ మరయ
సకలపురాణాదిసన్నుతతత్త్వంబు
రామతారకమంత్రరాజ మరయ
సకలతీర్థామ్నాయసారసంగ్రహవేది
రామతారకమంత్రరాజ మరయ

తే. సకలమునిజనచిత్తాబ్జసారభృంగ
మైనశ్రీరామనామంబుసనుదినంబు
స్మరణగావింపఁగల్గునుసత్ఫలంబు
రామ తారక దశరథరాజతనయ!

వ. ఇవ్విధంబున రామదాసుగారు మార్గముపట్టి పోవుచుండఁ గొంతదూరంబునకు భద్రాచలంబుగోపురంబు దృగ్గోచరం బగుటయు సంతసంబునదాని నిట్లని వర్ణించుచున్నారు.

రాగము-ఆనంద భైరవి-రూపక తాళము.

కలియుగ వైకుంఠము-భద్రాచల
నిలయము సేవింతము॥
అలివేణులారమి-రానందముగ వేగ
విలసిత మైనట్టి వేడుక జూడరె॥ కలి॥

౧

కాంచనసౌధములూ-వానికి-కెంపు
మించినదూలములూ-వజ్రములు చె
క్కించిన స్తంభములూ-పగడములనిభ్ర
మించగ ద్వారములూ
అంచయాన నుతి-యెంచ లేనుగదె
మంచిపచ్చలుగూ-ర్పించినవాకిండ్లు॥ కలి॥

౨

బంగారుగోపురములూ-కోవెలలు వె-
లుంగు మాణిక్యములూ-భేరీమృ
దంగాదనాదములూ-భాగవతుల సం
గీతపు కీర్తనలూ
రంగైననకల్యాణ-రత్నమంటపముల
శృంగారమేమని చెలియావిన్నపంతు॥ కలి॥

3

తీరైనపురవీధులూ-సొగసైన కో-
నేర్లు సోపానములూ-సకలఫల
తరువు లుపవనములూ-నందుల ఋషి
గంధర్వావాసములూ

సరసిజాక్షివినవె-సరిలేని గోదా
వరిస్నానమున సంపత్కరమై యొప్పినది॥ కలి॥

చక్కని స్త్రీపురుషులు-పట్టణమందు-
పిక్కటిల్లఁగ-వింతలు-బ్రాహ్మణులు
మక్కువతో జేసెడి పూజలు-వేదశాస్త్ర
తార్కికవైష్ణవులు
గ్రక్కున వారిని-కన్నులజూచిన
నెక్కైన పుణ్య-మేమని తెల్పుదు॥ కలి॥

రామాతులాడగనూ-సీతనుగూడి
హేమపీఠమునందునూ-పూర్ణకళలు
మోహముల వెలుగగనూ-పరివారములు
ప్రేమతోఁ గొలువగను
స్వామి భద్రాద్రి-రామదాసుల నేలు
స్వామిశ్రీకోదండ-రామునివాసము॥ కలి॥

వ. ఇవ్విధంబున స్తుతియింపుచు మార్గమును బట్టి పోవుచుండ గొందఱుచోరులీతండు హైదరాబాదు తానీషావద్ద నుండి శ్రీరాములకైంకర్యంబునకై విశేషద్రవ్యంబు గొనిపోవుచున్నవాఁడని యడ్డగించుతఱి రామదాసుగారు చోరులు వచ్చినసడియెఱింగి తంబురచిటితాళంబులధరించి రాముఁడెదైవంబని నమ్మియున్నవాడు గాన నీచోరులచే నాపదరా

కుండగ నను నీస్థలంబునకుఁ జేర్పుమని రామకీర్తనంబు నెటుల చేయుచున్నాఁడనిన.

రాగము-ఆనందభైరవి-రూపకతాళము.

పాహి రామప్రభో-పాహి రామప్రభో
పాహి భద్రాద్రివైదేహి రామప్రభో॥ పాహి॥

౧

శ్రీమన్మహాగుణస్తోమాభిరామ మీ
నామకీర్తనలు వర్ణింతు రామప్రభో
సుందరాకార-మన్మందిరోద్ధార సీ
తేందిరాసంయుతానంద రామప్రభో॥ పాహి॥

౨

ఇందిరా హృదయారవిందాధిరూఢా
ఇందిరాకార సానంద రామప్రభో
ఎందు నేఁ జూడమీ-సుందరానందముల్
కిందునో కన్నులిం-పొంద రామప్రభో॥ పాహి॥

౩

పుణ్యచారిత్రలావణ్యతారుణ్యగాం
భీర్యదాక్షిణ్య శ్రీ-రామచంద్రప్రభో
కందర్పజనక నా యందురంజిలిసదా
నందుండవై పూజలందు రామప్రభో॥ పాహి॥

౪

విందుగాఁ జెవులకు న్విందుగా నీకథల్
కందుగా మిమ్ము శొంపొందరామప్రభో

వందనము చేసిమును-లందఱునుఘనులైరి
విందవైనట్టి గో-విందరామప్రభో॥ పాహి॥

౫

బృందారకాదిస-ద్బృందార్చితపదార
విందసందర్శితానంద రామప్రభో
తల్లివి నీవె మా-తండ్రివి నీవె మా
దాతవు నీవె మా-భ్రాతరామప్రభో॥ పాహి॥

౬

పల్లవాధరలైన-గొల్లభామలఁగూడి
యుల్లమలరఁగనురం-జిల్లు రామప్రభో!
మల్లరంగంబుసం-దెల్లమల్లులజేరి
యుల్లకంసునిజంపు-మల్ల రామప్రభో! పాహి॥

౭

కొల్లలుగనీమాయ-వెల్లిసిరియఁగఁజేయ
సల్లాపమునక్రీడ-సల్పు రామప్రభో!
తమ్ముడు నీవు పార్శ్వమ్ములంజేరి వి
ల్లమ్ము లెక్కిడినిల్చు-టిమ్ము రామప్రభో॥ పాహి॥

౮

క్రమ్ముకొని శాత్రవులు-హుమ్మనుచు వచ్చెదరు
ఇమ్మైనబాణము-ల్చిమ్ము రామప్రభో!
రమ్ము నాకిమ్ము యభ-యమ్ము నీపాదముల్
నమ్మినానయ్య - శ్రీరామచంద్రప్రభో॥ పాహి॥

౯

కంటి మీశంఖము-గ్గంటిమీచక్రమున్
గంటి మీపాదము-ల్గంటి రామప్రభో!

వింటి మీమహిమ వె-న్నంటి తమ్ముడు నీవు
జంట రారయ్య నా-వెంట రామప్రభో॥ పాహి॥

౧౦

మేము మీవారమై-నాము రక్షింపు మ
న్నాముజాగేల శ్రీ-రామచంద్రప్రభో!
నామునో వీధిపై-ప్రేమతో నుండుమీ
భూమిజాసహిత జయ-రామచంద్రప్రభో॥ పాహి॥

౧౧

మీమహత్త్వంబువి-న్నకా మనస్సందుఁ బ్రే
మంబువే మఱిబుట్టు-స్వామి రామప్రభో!
ఏమిరా యన్న మీ-కేమి నేరమ్ము జే
సేము గాకున్న దూ-తేమి రామప్రభో॥ పాహి॥

౧౨

శ్యామలం సుందరం-కోమలం జానకీ
కాముకం త్వాంభజే-రామచంద్రప్రభో!
కామితార్థమ్ములి-చ్చేమహత్త్వమ్ము వి
న్నా మొఱాలించునా-స్వామి రామప్రభో॥ పాహి॥

౧౩

కామితప్రదుడవై - ప్రేమతో రక్షించు
స్వామిసాకేతపురి-రామచంద్రప్రభో!
అన్న రావన్న నీ-కన్న నామీద నెన
రున్నవారేకి నా-యన్న రామప్రభో॥ పాహి॥

౧౪

నిన్నె కాక వేఱె-యన్యులంగాన నా
గన్నతండ్రివి మా-యన్న రామప్రభో!

వెన్నదొంగిలితిన్న-చిన్నకృష్ణమ్మ ని
న్నెన్నఁగా వశమె రా-జన్య రామప్రభో॥ పాహి॥

౧౫

ఎన్నెన్నో జన్మముల-నెత్తగా జాలనిక
నిన్నె నెప్పుదని వ-ర్ణింతు రామప్రభో!
ఎన్ని విధములనైన-నిన్నె నమ్మినవాని
మన్నించి దయచేయు-మన్న రామప్రభో॥ పాహి॥

౧౬

పన్నగాధిప శయన-భావనాతీత సం
పన్న నామనవి విన-వన్న రామప్రభో!
ఏటివాక్యంబు మీ సాటిదైవంబు ము
మ్మాటికిని భువి లేదు-మేటి రామప్రభో॥ పాహి॥

౧౭

పాడుదు న్నిమ్ము గొని-యాడుదు న్వోపమున
వేడుదు న్నన్నుగా-పాడు రామప్రభో!
వేడుకోగానె నీ-జోడుకాడును నీవు
కూడిరారయ్య నా-తోడ రామప్రభో॥ పాహి॥

౧౮

నేడు నాకోర్కు లీ-డేరగా జేసి కా
పాడరా కరినేలు-జాడ రామప్రభో!
మూడుమూర్తులకాత్మ-మూలమై చెన్నొంది
నాడవని శ్రుతుల వి-న్నాడ రామప్రభో॥ పాహి॥

౧౯

చూడుమీభక్తులను-గూడుమీ రిపుల గో
రాడుమీ విశ్లె గో-వింద రామప్రభో!

పుండరీకాక్ష మా-ర్తాండవంశోద్భవా-
ఖండలస్తుత్య కో-దండ రామప్రభో॥ పాహి॥

౨౦

కుండలీశయనభూ-మండలోద్ధరణపా
షండజనహరణ కో-దండ రామప్రభో!
నిండుదయతోడనా-యండ బాయకయనీ
వుండీ కాపాడు కో-దండ రామప్రభో॥ పాహి॥

౨౧

జాత కౌతూహలం-సేతుకృత్వారమా
పూత సీతాపతే! ధాత-రామప్రభో!
పాతకులలో మొదటి-పాతకుడ నావంటి
పాతకుని గాచుటే-ఖ్యాతి రామప్రభో॥ పాహి॥

౨౨

భూతనాథునివిల్లు-ఖ్యాతిగా ఖండించి
సీతపైకొన్న వి-ఖ్యాత రామప్రభో!
పూతనారి ల్లబ్ధమాతనాశ త్రుసం
ఘాతనా సీతాస-మేత రామప్రభో॥ పాహి॥

౨౩

జాతినీతులు లేక-భూతలంబున దిరుగు
ఘాతుకులబరిమార్చు-నేత రామప్రభో!
ఎప్పుడుగంటికిక-జెప్పవలెగ చిన
నొప్పిప్పగాగావు మా-యప్ప రామప్రభో! పాహి॥

౨౪

ఏదయానీదయా-మోదయాంభోనిధీ!
యాది లేదయ్యనా-మీద రామప్రభో!

మోదమునసీవున-న్నా దుకోవయ్య గో
దావరీతీర భ-ద్రాద్రిరామప్రభో! పాహి॥

౨౫

నీదు బాణంబులను-నాదుశత్రుల బిట్టు
బాధింపకున్నా వ-దేమి రామప్రభో!
ఆదిమధ్యాంతబహి-రంత రాత్ముడవ నుచు
వాదింతునేజగ-న్నాథ రామప్రభో! పాహి॥

౨౬

చాలదే మీపదా-బ్జాతములసాటి పదు
నాల్గులోకంబులును-గూడిరామప్రభో!
ఏల యీలాగు జా-గేచేసెదవు మ
మ్మేలుకోవయ్య మా-పాలి రామప్రభో! పాహి॥

౨౭

పాలువెన్నయుమ్రచ్చి-లించితంచుయశోద
రోలఁగట్టినమాయ-జాల రామప్రభో!
కొల్లలుగ వ్రేపల్లె-పల్ల వాధరలతో
నల్లిబిల్లిగను రం-జిల్లు రామప్రభో! పాహి॥

౨౮

వాలినొక్కమ్మునను-గూలనేసినశౌర్య
శాలి యీ నినుదలతు-జాల రామప్రభో!
మేలోర్వలేక బలు-జాలిబడి తిరుగుదు
ర్జాలమును భేదింపు-మయ్య రామప్రభో! పాహి॥

౨౯

సాలభంజికలని-ర్మాలంబు జేయఁగా
జాలితివిగోపాల-బాల రామప్రభో!

తాళవృక్షములొక్క-కోల ధరకూలంగ
దూలనేసినబాహు-శాలిరామప్రభో! పాహి॥

30

శిలయైనయహల్య-శ్రీపాదములు సోకి
నెలతయై మిమ్మమది-దలచె రామప్రభో!
వినవయ్యనువిగ్రహ-కోనవయ్య తిప్పలం
గనక యయ్యసమ్మతి-గ్గానుచు రామప్రభో! పాహి॥

31

దానధర్మంబులును-దపజపంబులును నీ
నామకీర్తనకు సరి-రావు రామప్రభో!
మానావమానములు-మహినినీవైయుండ
నీయెడను జింతమా-కేల? రామప్రభో! పాహి॥

32

జ్ఞానయోగాభ్యాస-ములనునుండెడివారి
కానందమయుడవై-నావు రామప్రభో!
భానువంశమునందు-మానవాధిపుడవై
దానవుని బరిమార్చి-నావు రామప్రభో! పాహి॥

33

అణురేణు పూర్ణమా-హృదివాస నామనవి
విను దేవ దేవకీ-తనయ రామప్రభో
మాన్యమై యాశ్రితవ-దాన్యమై సుజనస
మ్మాన్యమై వెలుగు మూ-ర్ధన్య రామప్రభో! పాహి॥

34

నిత్యమై సత్యమై-నిర్మలంబైన యా-
దిత్యవంశోత్తంస-మైనరామప్రభో!

సేవ్యమైమీకథ-ల్భావ్యమై సజ్జన
శ్రావ్యమై యుండునో-దివ్య రామప్రభో! పాహి॥

౩౫

గట్టిగా నీవునా- పట్టుగావిహితమా
పట్టుగామమ్ము చే-పట్టు రామప్రభో!
దిట్టయగు తాటకను-గొట్టివేగమె గాధి
పట్టియాగముగాచి-నట్టి రామప్రభో! పాహి॥

౩౬

చుట్టుకొని కాళింగు డట్టహాసము సేయ
పట్టుకొని తలకెక్కి-నట్టిరామప్రభో!
సంతతము నన్ను ర-క్షింతు వని నమ్మి మి
మ్మెంతునో జానకీ-కాంత రామప్రభో! పాహి॥

౩౭

పంతమునమీపాద-చింతనము సేయ నా
వంతలన్నియుమాను-టెంత రామప్రభో!
వింతగాదయ్య నే-నింతనాడాదిగా
పంతమునమిమ్ముభా-వింతురామప్రభో! పాహి॥

౩౮

శాంతమూర్తివి రమా-కాంతుండ వని చాల
సంతతంబును సన్ను-తింతు రామప్రభో!
అక్షయం బైననీ-కుక్షిలోలోకముల
రక్షించితివి లక్ష్మీపతీ రామప్రభో! పాహి॥

౩౯

దంతివత్సలభక్త-చింతామణివి విశ్వ
మంతయునునీవుర-క్షింతురామప్రభో!

పక్షివాహనశత్రు-విక్షేపణా నన్ను
రక్షించు మోక్షప్ర-దాత రామప్రభో! పాహి॥

౪౦

రక్షింపు సజ్జనుల-శిక్షింపు దుర్జనుల
వీక్షించి మము గటా-క్షింపు రామప్రభో!
రక్షకుడవై జగ-ద్రక్షణము సేయగా
రాక్షసుల శిక్షించినావు రామప్రభో! పాహి॥

౪౧

లక్ష్మీకటాక్షవీ-క్షణసుధావృష్టి మా
కక్షయంబుగ గటా-క్షించు రామప్రభో!
రావయా యభయంబు-లీవయా మాస్వామి
నీవ మాగతి దేవ-రాయ రామప్రభో! పాహి॥

౪౨

కావుకావుమటంచు- గాకాసురుడు రాగ
కాచిరక్షించినా-వయ్య రామప్రభో!
దేవదేవోత్తమా-దేవేంద్రసన్నుతా
కావవే నన్ను శ్రీ-రామచంద్రప్రభో! పాహి॥

౪౩

భావజజనక నా-బాధలన్నియు మాన్పి
యేవిధంబున నైన నేలు రామప్రభో !
శ్రీవైష్ణవులపాలి-చింతామణివి చాల
సేవగైకొని కరుణ-సేయు రామప్రభో! పాహి॥

౪౪

భావమున మిముభక్తి-సేవించు సుజనులకు
కైవల్యమొసగు శ్రీ రామచంద్రప్రభో!

గోపాలబాలురను-గూడి యావుల మేపి
యాపదుద్ధారకుడ-వైనరామప్రభో! పాహి॥

౪౫

నాపాలిశ్రీరామ-భూపాలకా నన్ను
గాపాడవయ్యగో-పాల రామప్రభో!
సారమౌ శౌర్యవి-స్తారమానుంద రా
కార సద్భక్తమం-దార రామప్రభో! పాహి॥

౪౬

శరణాగతత్రాణ-బిరుదాంకితంబైన
వరము నాకొసగు మే-మఱక రామప్రభో!
శ్రీరామనీనామ-చింతనామృతపాన
సారమే నాదుమది-గోరు రామప్రభో! పాహి॥

౪౭

చేరి మీ పాదప-ద్మారాధనము సేయ
గోరినానయ్య శ్రీ-రామచంద్రప్రభో!
ఘోరరాక్షసగర్వ-హార విశ్వంభర రా
భూరిగుణసాంద్రవిస్తార రామప్రభో! పాహి॥

౪౮

మారీచమాయాని-వారశరసంధాన
ధారుణీతనయావి-హార రామప్రభో!
పరవాసుదేవ యు-ష్మయభక్తి మాకొసగి
యరసిపోషింపగద-వయ్య రామప్రభో! పాహి॥

౪౯

పరధనంబుల పర-స్త్రీలను నపేక్షించు
నరులకబ్బునె మోక్ష-మరయ రామప్రభో!

కామాదిదుర్గుణ-స్తోమం బడంగ మీ
నామామృత మెదిక్కు-స్వామి రామప్రభో! పాహి॥

౫౦

దుష్టులగు దానవుల-నష్టంబుగా జేయు
బుట్టితివి కౌసల్య-పట్టి రామప్రభో!
కష్టపడినానయ్య-వట్టాభిరామ నా
కిష్టసంపదలిచ్చి-యేలు రామప్రభో! పాహి॥

౫౧

కేశవాయనిన భవ-పాశముల్దొలగు స
ర్వేశ కోటిశశిప్ర-కాశ రామప్రభో!
నారాయణా నీదు-నామామృతంబెపుడు
పారణము సేయ దయ-సేయు రామప్రభో! పాహి॥

౫౨

మాధవాయనుచు స-మ్మోదమునమిముగొల్తు
సాధుసజ్జనదయాంభోధి రామప్రభో!
గోవింద గోవింద-గోపాల కృష్ణయని
గోపకులు గొనియాడు-గోప రామప్రభో! పాహి॥

౫౩

విష్ణునా సర్వవ-ర్ధిష్ణునా తత్త్వభూ
యిష్ణునా నిర్జితం-కృష్ణ రామప్రభో
శ్రీధరా శ్రీకరా-శ్రీనారసింహ గం
గాధరస్తోత్రయా-నంద రామప్రభో! పాహి॥

౫౪

మత్స్యమై జలధిలో-చొచ్చి సోమకుద్రుంచి
తెచ్చి వేదము లజున-కిచ్చు రామప్రభో!

కూర్మరూపమునొంది-కొండమూపునదాల్చి
కూర్మితో నమృతంబు గూర్చు రామప్రభో! పాహి॥

౫౫

వారాహరూపమున-వసుధ గొమ్మున నెత్తి
సురల రక్షించు దా-శరథి రామప్రభో!
శరణన్న ప్రహ్లాదు-గరుణించి రక్షింప
నరసింహమూర్తి-వైనట్టి రామప్రభో! పాహి॥

౫౬

వామనత్వమున భూ-దానమడిగియు బలిని
భూమిక్రింద నడంచి-పొల్చు రామప్రభో!
పరశురాముడవంగ నరపాలకులనెల్ల
నరసిహరిగొన్న దా-శరథి రామప్రభో! పాహి।

౫౭

శ్రీరామమూర్తివై-యా రావణునితలల్
ధారుణింబడగూల్చి-నావు రామప్రభో!
హాలధరుడవైధరా-స్థలిపాలకులనెల్లఁ
బొలివుచ్చి వెలుగునా-పాలి రామప్రభో! పాహి॥

౫౮

సిద్ధసన్మునిమనో-బద్ధుండవై నీవు
బుద్ధుండవైతి ప్ర-బుద్ధ రామప్రభో
కల్కిరూపముదాల్చి కలియుగంబుననీవు
వెలసితివి భద్రాద్రి-నిలయ రామప్రభో! పాహి॥

౫౯

అవ్యయుడవైననీ-యవతారములదలచి
దివ్యులైనారు మును-లయ్య రామప్రభో!

శ్రీరామనీనామమే-వేళస్మరియింతు
స్వామి దయసేయు సంతోసదలు రామప్రభో! పాహి॥

౬౦

సర్వశేషశయాన-యెప్పుడును నిను మఱవ
నొప్పుగాబ్రోవు వర-దప్ప రామప్రభో!
పట్టాభిరామ నిను-బ్రభుడవని నమ్మితిని
కష్టపెట్టకను చే-పట్టు రామప్రభో! పాహి॥

౬౧

పాహి శ్రీరామనీ-పాదపద్మాశ్రయుడ
పాలింపుమీ భద్ర-శైలరామప్రభో!
పాహి రామప్రభో-పాహిరామప్రభో!
పాహిభద్రాద్రివై-దేహిరామప్రభో! పాహి॥

౬. ఇవ్విధంబున రాములంగూర్చి స్తుతింపుచుండ నాథ క్తపరాధీనుం డగురాముండు దాసున కదృశ్యుండై యాచోరులం దఱుమగా వారు చనిరి. రామదాసుగారిది రామానుగ్రహంబని తలంచి 'నన్ను రక్షించినావు నీవంటి దయాళులెవ్వరు స్వామీ' యని స్తోత్రము సేయుచున్నారు.

రాగము - నాథనామక్రియ - ఏకతాళము.

రాముడేగలడు-నాపాలిశ్రీ-రాముడేగలడు
రాముడార్తి-విరాముడాహవ
భీముడానందధాముడైనశ్రీ॥ రాము॥

౧

నల్లనీరూపు-దాసుల నేలు-చల్లనిచూపు-
ఉల్లమునరంజిల్ల గృపవెద
జల్లుచును విలసిల్లు సీతా రాము॥

౨

తమ్ముడునుదానూ-విల్లమ్ములు
దాల్చిదయతోను-గ్రమ్మి యిరుపా-ర్శ్వమ్ములను జేరి
నెమ్మినీకు భయమ్ము లేదను రాము॥

౩

మెఱుచిఱునవ్వు-జిగిముడివిడ-జాఱుసిగపువ్వు
సొరుగులుకు బంగారుతమ్ములను
గెరుపదమ్ముల దారినను జేరు రాము॥

౪

కింతు సేయకను-రామదాసు
జంటబాయకను-వెంటనంటియే వేళను-గృపతో
కంటికినిఱెప్పగాచుగతిబ్రోచు రాముడే॥

వ. మఱియు నేమని వేడుకొనుచున్నారు.

రాగము - సావేరి - ఆదితాళము.

ప్రత్యక్షముగాననునీవేళబ్రతికించితివయ్యా
సత్యముసత్యము నీవేనా-దైవము సదయరామచంద్రా

౧

ఝుమ్మనుచీకటిలో-వాన-ఝురఝుర గురియగను
ఇమ్మగుసొమ్ముల నిమ్మని క త్తిని-గుమ్మదలపగాను
సొమ్మసిల్లుచును-నాచి త్తమ్ముసొలసిఝల్లుమనగా
నమ్మదగిననా దైవమునీవని-నమ్మినందుకిపుడు ప్రత్య॥

౨

ఉబ్బులిలో దారి-నెఱుగకత-బ్బిబ్బుగనడువగను
అబ్బురముగనాకు చోరులునుందుగ-గనబడి యారదీయ
గొబ్బునన స్త్రముచే నాపైనిక-దెబ్బవేయరాగా
అబ్బాయనక శ్రీరామాయనినే-శరణంటిని అపుడు॥ప్రత్య॥

3

అంతనవాలోవింతాచోరుని-రంతువంతోవింతా
పంతముచెడియాచోరులుపాఱిరి-పరమపురుషస్వామి
అంతటవేగమున నేను-నుంతభయములేకా
దంతిరక్షకాదాసపోషకా-దయగలనాస్వామి॥ ప్రత్య॥

ఇవ్విధంబునం బరమసంతోషభరితుండయి యానంద నృత్యంబు సలుపుచు భక్తిపరవశంబున రాములం బొగడుచు భద్రాద్రియందుఁ బ్రవేశించి గౌతమీస్నానంబు గావించి యాగిరిశిఖరంబున వసించిజనులకిష్టఫలంబుల నొసఁగూర్చు సీతారాములం దలంచి యిట్లని యనుచున్నారు.

రాగము - కాంభోజి - అటతాళము.

బహుకాలమునకు శ్రీ-భద్రాచలేశునకు
పాదసేవకుడనైతి!
అహాహానాజన్మ-సఫలమాయె నేటికిని
అనుమానములు దీఱెనూ బహు॥

౧

తల్లి గర్భమునందు-మలమూత్రములమునిగి
ధరణిపై జన్మించితి

కల్లలాడుచు పాపకర్మములకొడిగట్టి
కాపురుషులను జేరితీ- నీవేగతి బహు॥

౨

కోపుడను పాపుడను-గుణహీనుడను నేను
క్రూరుడను కుత్సితుడను
రావు సేయక నన్ను-రక్షింపదలచు శ్రీ
రామచంద్రుల భారమూ బహు॥

౩

అఖిలలోకంబులకు- నాధారమైయున్న
యాదిపురుషోత్తముండూ
సఖితోడగూడిన-సమయమందున జేరి
సన్నుతులు సేయగలిగె-కలిగె. బహు॥

౪

రామదాసుని నేలుకొనుటకు శ్రీభద్రాద్రి
ధాములై యుదయించిరీ
యేమిగొదవలుమనకు-నెఱుకగలుగగ జేసె
నేహ్యాంబు లితరమెల్లా-కల్లా బహు॥

వ. ఇవ్విధంబున సంతోషించుచు మఱియును నారాముల
నేమని కొనియాడుచున్నారనిన.

రాగము - కన్నడ - చాపుతాళము.

హరిహరి రామ నన్నరమరజూడకు
నిరతమునీనామస్మరణయేమఱను హరి॥

౧

దశరథనందన-దశముఖమర్దన
పశుపతిరంజన-పాపవిమోచన హరి॥

౨

మణిమయభూషణ-మంజులభాషణ
రణజయభీషణ-రఘుకులపోషణ హరి॥

౩

పతితపావనరామ-భద్రశైలధామ
సతతముశ్రీరామదాసుడనికనేలు॥ హరి॥

౬. అని యివ్విధంబున నుతింపుచు రామదాసుగారిన్ని దినం బులనుండి నిన్నాశ్రయించియున్నాఁడగాన నీదర్శనం బి మ్మని కీర్తనము చేయుచున్నారు.

రాగము - అసావేరి - ఏకతాళము.

రామా నీముద్దుమోము - జూపరా సుందరరామా
నీముద్దుమోముజూపరా రామా
భద్రాచలధామా-తారకనామా రామా రామా॥

౧.

నీముద్దుమోము నే గంటిగా-నిన్ను-
చాలా నెరనమ్మియున్నానుగా-నే
నితరదైవముల వేడబోనుగా
విడువనిబిరుదుగట్టుకొన్న నిన్నే కాని
యొట్టుబెట్టుకొంటినొప్పులకుప్పవంటి రామా॥

౨

మురిపెంపుకొప్పుబిగి పీడగా-ఆణి
ముత్యాలసిరు లల్లల్లాడగా-లేమి
కిరవయిన నడుమసియాడగా-అక్కై
బిరబిరవచ్చి మీ-పినతల్లి సుమిత్ర
స్థిరముగకస్తూరి-తిలకముదిద్దిన రామా॥

౩

డాలైనవల్లెవాటుగుల్కగా-నిండ్ర
నీలాలగుంపుసొంపు గుల్కగా-నిల్లు
హేలాదిబ్రహ్మమని పల్కగా-చిన్ని
బాలుడవయినట్టి-జాబిల్లికూనవంటి రామా॥

౪

ముక్కునముత్తెమింపుమీఱగా-నును
జెక్కుటద్దము ముద్దుగుల్కగా-చను
ముక్కన పాలధారలొల్కగా-ప్రేను
మిక్కుటమునవచ్చి-మీతల్లికౌసల్య
యక్కునజేర్చి నెల-బాలు జూపినయట్టి॥ రామా॥

౫

ముద్దుగపురనింపొందగా-మోద-
మందించుచును లా-లింపగా-ముద్దు
లన్నా! రమ్మనిదీవింపగా-సురలు
వెన్నుడేరాముడని-వినుతించిభద్రాద్రి
చెన్నుడవయినట్టి-చిన్నారిబాలుడ రామా॥

ఈతీరున స్తుతింపుచు రామదాసుగారు తానీషా యిచ్చిన వరహాలు జాగీరుఫర్మానాలుశాల్వాలుభూషణంబులు మొదలయిన సమస్తంబును దీసికొని గృహంబునకు బోవుటకు ముందు హృదయకమలనివాసుఁడగు రాముని నివాసంబునకుం జని సమర్పించి దర్శనంబొనర్చి రావలయునని వచ్చుచుండ నాభద్రాచలమున నివసించుభక్తసమూహంబులు తంబురచిటితాళమృదంగాదు లగుగానసాధనంబులం గొని పరమాంతరంగభక్తుం డగురామదాసుగారిని దర్శించుటకయి గంధ పుష్ప తాంబూలఫలద్రవ్యంబులంగొనియెదురేఁగియాభక్తునకునమర్త్తిమీఱ నందఱును సాష్టాంగదండనమస్కారంబు లొనర్చిన, వారింగూడుకొని నామకీర్తనంబులు పాడుచు భద్రశైలంబునకు బోవుచున్నారు.

రాగము - పున్నాగవరాళి - ఆదితాళము.

జానకీరమణా-కల్యాణగుణ సజ్జనావననిపుణా
ఓనామాలు వ్రాయగానే నీనామమేతోచు జా॥

౧

ఎందుచూచిననీదు-అందమే గానవచ్చు
ముద్దుమోమునుజూచి-మునులెల్ల మోహించిరి జా॥

౨

దుష్టులునిన్ను జూడ-దృష్టితాకునుగాని
ఎన్నిజన్మాలెత్తిన-నిన్నే భజింపనీవే జా॥

౩

ముక్తినేనొల్లనీదు-భక్తిమాత్రముచాలు
జాతినాతిగ జేసె-నీతిరువడిగ శేగదా జా॥

౪

నారదాదిమునులు-పరమందిరిగదా
సత్యస్వరూపమున ప్రత్యక్షమైనావు
భద్రాచలనివాస-పాలితరామదాస జానకీ॥

వ. ఈగతి హరిదాసులం గూడుకొని పరమానందమున రామ భజనమును సేయుచు భద్రశైలశిఖరముఁ జేర నంతకుఁబూర్వమే యర్చకులు రామదాసుగారికిదర్శనంబొసంగుటకయి గుడిబీగములు దీయించి సమస్తపూజాద్రవ్యములు నాయత్తముఁ జేసికొని కాచియుండుతఱి నా రామదాసు గోపురద్వారప్రవేశము చేయుచు, నానందబాష్పములు దొరుఁగ నింతకాలంబునకు రాములఁ గనుఁగొనఁ గలిగెఁగదా యని కీర్తనము చేయుచున్నాఁ డెటువలెనూ.

రాగము - పంతువరాళి - ఆదితాళము.

రామనామముబల్కవే-పాపపుజిహ్వా
రామనామము బల్కవే

౧

రామనామమునీవు-ప్రేమతోబల్కిన
స్వామియెల్లప్పటికి-కామితార్థము లిచ్చు రామ॥

౨

మతిలేనివారలెల్లా-సీతాపతిని
సతతముదలచినమా
హితవుగవారిపూర్వ-కృతము లెల్లమాన్పి
అతులితసామ్రాజ్యా-నంద మొందజేయు రామ॥

3

మారసుందరాకారు-వేసారకెపుడు
కోరిభజింపుచుండునీ
భూరికృతకల్మష-దోషములన్నియు
చేరనియ్యక కొట్టి-పాఱదోలెడి రఘు రామ॥

౪

దాసులనుబ్రోచుచు-భద్రగిరిని
వాసుడయి జగము లేలుచు
దోసములెల్లబాపి-వాసిగధరలో రామ
దాసులహృదయని-వాసుడైనసీతా రామ॥

౫. ఇవ్విధంబున మానసనియమనపూర్వకముగా స్తుతిఁజేయుచు ప్రాకారప్రదక్షిణము సేయుచు ధ్వజస్తంభముకడ నిలువంబడి కీర్తనము సేయుచున్నారు.

రాగము - నాథనామక్రియ - ఆదితాళము.

భజరే శ్రీరామం-హేమానస
భజరే రఘురామం

౧

భజరే రఘురామం భండనభీమం
రజనిచరౌఘవిరామం రామం భజ॥

౨

వనరుహనయనం-కనదహిశయనం
మనసిజకోటిసమానం-మానం భజ॥

౩

తారక నామం-దశరథ రామం
శ్రీతులసీదళ-శ్రీకర ధామం భజ॥

౪

శ్యామలగాత్రం-సత్యచరిత్రం
రామదాసహృ-ద్భద్రజీవమిత్రం భజ॥

వ. అని యివ్విధమున కీర్తనము జేసి సాష్టాంగనమస్కారముఁ జేయుచున్నా రెట్లనిన.

శ్లో॥ హేరామ భద్రాశ్రయ హేకృపాళో!
హేభక్తలోకైకశరణ్యమూర్తే!
పునాతు మాం త్వచ్చరణారవిందం
జగత్పవిత్రం శరణం మమాస్తు॥

వ. ఇవ్విధంబున ధ్వజస్తంభమువద్ద వందనంబొనర్చి రామదాసుగారు దాసులం గూడి ప్రాకారప్రదక్షిణం బొనర్చుచుఁ గీర్తనంబుఁ జేయుచున్నారు.

రాగము - కన్నడ - ఏకతాళము.

రామరామరామసీతా-రామరామరామసీతా

౧

యాదిలేదానామీద-నింకనయిన దయరాద
పాదములకు మ్రొక్కెద-పలు-మాఱువిన్నవించెద రామ॥

౨

తప్పులెంచబోకునీకు-గొప్పతనము చెల్లదు
ఎప్పుడునిన్నే నమ్మితి-తప్పక నన్నురక్షించు రామ॥



గోపన్న శ్రీరామచంద్రులను సేవించి ఆనందభరితులగుట.

ఏల ప్రత్యక్షముకావయ్యా-యేమిసేతు రామయ్యా
జాలము సేయకుమయ్యా-శరణంటినిగదయ్యా॥ రామ॥

౪

ఎంతబలమొ నీదుమాయ-యెవ్వటికి తెలియదాయె
అంతరంగము తెలియదాయె ఆపదలుతొలగవాయె॥ రామ॥

౫

పతితపావనబిరుదు పాలించుకోమోస-పోకుమితరులను వేడ
నీకు జగదీశ్వరా ఏలరాకు॥ రామ॥

౬

నమ్మనేర్తునిన్నెకాని-నాచెలినేమా నీకృపలేక
నిన్నునునే వేడెందాని-మిసామైనపరాక॥ రామ॥

౭

ఇక్ష్వాకువంశమునబుట్టి-యేమయ్యానను జేపట్టి
రక్షింపవి దేన్యాయమో-దశరథుపట్టీ॥ రామ॥

౮

భద్రగిరి ధామరామ-పాదభక్తివదలలేమా
క్షుద్రదైవములగొలిచేమా-చూడుమిని సమయమటవేమా॥ రా॥

వ. ఇవ్విధంబునఁ బ్రాకారప్రదక్షిణంబు గావించిగర్భగృహాం బులోపలంబ్రవేశించి శ్రీసీతాలక్ష్మణసహితుండై నివసించి యున్న రాములం జూచి యానందపరవశుండై కన్నుల నానంద బాష్పంబులు దొరుఁగ మైమఱచి మనంబును రామమూర్తియందు లీనంబుచేసి చిత్రించిన చిత్రంబుకై వడి గొంతదడవు నిలిచి గద్గదస్వరంబున ని ట్లని కీర్తించు చున్నారు.

రాగము-నాథనామక్రియ-ఆదితాళము.

కంటి నేడూ-మా రాముల-గనుగొంటి నేడు

౧

కంటి నేడుభక్త-గణములపాలిమా
పంటభద్రగిరి-నంటియున్నవాని॥ కంటి॥

౨

చెలువొప్పుచున్నట్టి-సీతాసమేతుని
కొలువుదీరినమన-కోదండరాముని॥ కంటి॥

౩

కస్తూరితిలకము - ఘననీలగాత్రము
కరుణారసముగురియు-కందోయిగలవాని॥ కంటి॥

౪

హారుమంజుముత్యాల-సరములు మెఱయఁగ
మురిపెంపు చిరునవ్వు-మోముగల్గినవాని॥ కంటి॥

ఘులుఘుల్లుమని పైడి-గజ్జెలందెలు మ్రోయ
తళుకుబెళుకు పాద-తలములుగల్గినవాని॥ కంటి॥

౬

కిరుకుబంగరుచేల-కాంతి జగముగప్ప
శరచాపములు కేల-ధరియించుస్వామిని॥ కంటి॥

౭

ధరణిని శ్రీరామ-దాసునిరక్షించు
పరమపురుషుఁడైన-భద్రగిరీశుని॥ కంటి॥

వ ఇవ్విధంబునం గీర్తనంబుఁ జేసి నిలువంబడియున్న రామదాసుగారికి రాములవారిదర్శనం బిప్పించుటకై యున్న

యర్చకులు రాములవారికి షోడశోపచారపూజలు గావించి; తులసీసహస్రార్చనంబుఁ జేసి ధూపదీపంబులొసంగి తీర్థతిరు మాలశతకోపంబులు నారామదాసున కొసంగిన నతండు శ్రీరాములనుగూర్చి యిట్లని కీర్తనము సేయుచున్నారు.

౧

శ్లో. శ్రీరామచంద్ర! కరుణాకర దీనబంధో!
సీతాసమేత! భరతాగ్రజ రాఘవేశ!
పాపార్తిభంజన! భయాతురదీనబంధో
పాపాంబుధౌ పతిత ముద్ధర మామనాథమ్॥

౨

వందే రామ మనాదిపూరుషమజం వందే రమానాయకం
వందే హారకిరీటకుండలధరం వందేంద్రనీలద్యుతిమ్।
వందే చాపకలంబకోజ్జ్వలకరం వందే జగన్మంగళం
వందే పఙ్క్తిరథాత్మజం మమగురుం వందే సదా రాఘవమ్॥

౩

వందే శౌనకగౌతమాద్యభినుతం వందే ఘనశ్యామలం
వందే తారకపీఠమధ్యనిలయం వందే జగన్నాయకమ్।
వందే భక్తజనౌఘదేవవిటపిం వందే ధనుర్వల్లభం
వందే తత్త్వమసీతివాక్యజనకం వందే సదా రాఘవమ్॥

౪

వందే సూర్యశశాంకలోచనయుగం వందే జగత్పావనం
వందే సత్రసహస్రపద్మనిలయం వందే పురారిప్రియమ్।
వందే రాక్షసవంశనాశనకరం వందే సుధాశీతలం
వందే దేవ కపీంద్రకోటివినుతం వందే సదా రాఘవమ్॥

౫

వందే సాగరగర్వభంగవిశిఖం వందే జగజ్జీవనం
వందే కౌశికయాగరక్షణకరం వందే గురూణాంగురుమ్ ।
వందే బాణశరాసనోజ్జ్వలకరం వందే జటావల్కలం
వందే లక్ష్మణభూమిజాన్వితకరం వందే సదారాఘవమ్॥

౬

వందే పాండురపుండరీకనయనం వందేబ్జబింబాననం
వందే కంబుగళం కరాబ్జయుగళం వందే లలాటోజ్జ్వలమ్ ।
వందే పీతదుకూల మంబుదనిభం వందే జగన్మోహనం
వందే కారణమానుషోజ్జ్వలతనుం వందే సదారాఘవమ్॥

౭

వందే నీలసరోజకోమలరుచిం వందే జగద్వందితం
వందే సూర్యకులాబ్ధికౌస్తుభమణిం వందే సురారాధితమ్॥
వందే సాధకపంచకప్రహరణం వందే జగత్కారణం
వందే వింశతిపంచతత్త్వరహితం వందే సదారాఘవమ్॥

౮

వందే సాధకవర్గకల్పకతరుం వందే త్రిమూర్త్యాత్మకం
వందే నాదలయాంతకస్థలగతం వందే త్రివర్గాత్మకమ్ ।
వందే రాగవిహీన చిత్తసులభం వందే సభానాయకం
వందే పూర్ణదయామృతార్ణవమహంవందేసదారాఘవమ్

౯

వందే సాత్త్వికతత్త్వముద్రితతనుం వందే సదానాయకం
వందే చారుచతుర్భుజం మణినిభం వందే షడబ్జస్థితమ్।

వందే బ్రహ్మపిపీలికాదినిలయం వందే విరాడ్విగ్రహం
వందే పన్నగతల్పశాయిన మహం వందే సదారాఘవమ్॥

వ. ఇవ్విధంబున శ్రీరాములవారిదర్శనం బొనర్చి పరమసంతోషంబున గృహంబునకుఁ బోవుటకై మరలివచ్చునపుడు హరిదాసులం గూడుకొని భగవద్గుణానుకీర్తనంబుఁ జేయుచు వచ్చుచున్నారు.

రాగము - సౌరాష్ట్రము - ఆదితాళము.

రామచంద్ర నన్నేలవో-రక్షించేవూ నేనే మెఱుగా
ఏచిత్తాము నాభాగ్యము-ఏన్నో నెఱనమ్మితీ

౧

భరతునివలెను నేనూ-పాదుకలు పూజింపనేర
కోరీ లక్ష్మణునివలె కొల్వగానేరా
ఓర్పుతోను గుహునివలె-ఓ...నదుపగ నేరను
నేర్పుతో నావాలివలెపి-న్నెఱుగగానేరా॥ రామ॥

౨

అంగదునివలె నేను-అడపమును పట్ట నేర
సంగరమున సుగ్రీవునివలె-సాధిం నే...
గాలిపక్షివలె నేను-దాలిమిగ మోవ నేర
బలిమితో హనుమంతునివలె-బ...నేరా॥ రామ॥

౩

లీలతో శబరివలె-లాలించివిందిడ నే...
మేలిమిగ సీతవలె-మెప్పించ నేరా!

గజరాజువలెనేను-గట్టిగామొఱబెట్టనేరా
విజయునిసతివలెనిన్నూ-వినుతింపానేరా॥ రామ॥

౪

గుఱిగాజాంబవంతునివలె-గోరిభజియింపనేర
చేరి విభీషణునివలె-శరణననేరా
పరగజటాయువలె-బ్రాణములేనియ్యనేర
తిరముగానహల్యవలెకీ-ర్తింపగానేరా॥ రామ॥

౫

నేను రామదాసునివలె-పూనిమిముభజియింపనేరా
దీనుని రక్షించు భద్రా-చలరామ ధీరా॥ రామ॥

రాగము - మోహన - ఆదితాళము.

రామా సుధాంధిధామారామానాపై
నెందుకు దయ రాదురా ?
వేమఱువినయముతో-వివరించినానాదు
విన్నపమూవినవేమిరా ? రామ॥

౧

మక్కువనేనెంత-బ్రతిమాలుకొన్ననీ
మనసు కరగ దేమిరా ?
నిక్కముగాతల్లి-తండ్రివి నీవని
నెఱనమ్మి యున్నానురా॥ రామ॥

౨

దిక్కునీవనియున్న దయజూడవిక మాకు
దిక్కెవ్వా రున్నారు రా

యెక్కడనున్నావో-నామొఱాలకించ
వింత పరాకేల రా॥ రామ॥

౩

ప్రతిదినముదరపో-షణ సేయుటే దొడ్డ
వ్రతమని తిరిగితిరా
మతిలేనిధనికులే-గతియని దినము నే
నుతిసేయా సాగితిరా॥ రామ॥

౪

సతతముమాయ సం-సారమునమ్మి దు
ర్గతి నొంద పాలైతిరా
పతితపావనచాల-వెతనొంది వచ్చితి
గతిచూపి రక్షించరా॥ రామ॥

౫

నీపాదసేవజేసెసజ్జనులకు నే
పాపము లంటవురా
తాపత్రయవ్యథలు-మాన్పి నన్ను నీ
దరిచేర్చి కావవేరా? రామ॥

౬

ఈపట్ల రక్షించి-కాపాడకున్న నే
నెవరివాడనౌదురా?
ఆపద్బాంధవ భద్రాద్రి రామదాసు
డనుచూ నన్నేలు కోరా॥ రామ॥

వ. మఱియు నాగిరిరాజంబు డిగ్గి రాజవీథులందు భక్తులంగూడుకొని భద్రగిరిశైలంబునకుఁ బ్రదక్షిణంబు సేయుచు రామదాసుగా రానందనృత్యంబు సలుపుచున్నా రెట్లనినా॥

రాగము - వరాళి - రూపకతాళము.

శ్రీరాములదివ్యనామ స్మరణ సేయుచున్న జాలు
ఘోరమైనతపములను గోరనేటికే? మనసా!

౧

తారక శ్రీరామనామ-ధ్యానము నేసిన జాలు
వేయువేయుదేవములను-వేసనేటికే మనసా! శ్రీ॥

భాగవతులపాదజలము-పైసిజల్లుకొన్న జాలు
బాగుమీఱినట్టియమృత-పాననేటికే మనసా! శ్రీ॥

౩

పరులహింస సేయకున్నా-పరమధర్మమంతేచాలు
పరులను రక్షింతునని-పల్క నేటికే మనసా! శ్రీ॥

౪

దొరకొనిపరులధనము-దోచకున్నా వంటేచాలు
గుఱుతుగాను గోపురములు-గూర్ప నేటికే మనసా! శ్రీ॥

౫

పరగదీనజనుల యందు-పక్షముంచితం తేచాలు
పరమాత్మునియందు ప్రీతి-పెట్టనేటికే మనసా! శ్రీ॥

హరిదాసులకుపూజ-లాచరించినను జాలు
హరినిపూజ సేతునసే-యహామ దేటికే మనసా! శ్రీ॥

౭

జపతపోనుష్ఠానములు- చేసిరిమూఢులకై బుధులు
జగదీశునిదివ్యనామ-చింతకోసమై మనసా ! శ్రీ॥

౮

చపలము లేక యేవేళ -జింతించేమహాత్ములకు
జపతపోనుష్ఠానములు- సేయనేటికే మనసా ! శ్రీ॥

౯

అతిథివచ్చియాకలన్న -నన్నమిడిన దేచాలు
క్రతువుసేయవలయుననెడి- కాంతులేటికే మనసా! శ్రీ॥

౧౦

సతతము మా భద్రగిరి-స్వామిని నమ్మినజాలు
ఇతరమతములనియేటి- వెతలవేటికే మనసా ! శ్రీ॥

వ. లోకైకనాథుండగు శ్రీమన్నారాయణుని గొల్వక జన్మసాఫల్యంబు గాదని కీర్తించుచున్నారు.

రాగము - జంఝూటి - చాపుతాళము.

నరహరినినమ్మక-నరులను నమ్మితే
నరజన్మ మీడేరునా?
చెఱకులుండగ వెఱ్ఱి - చెఱకులునమలితే
జిహ్వకు రుచి పుట్టునా మనసా॥ నర॥

౧

కాళ్లుండగ మోకాళ్లతో నడిచితే
కాశికి పోవచ్చునా?
నీళ్లుండగ నుమ్మి-నీళ్లనుమ్రింగితే
బిందుదాహముదీఱునా మనసా! ॥ నర॥

కొమ్మయుండగకొయ్య-బొమ్మతోఁగలసి తే
కోరిక కొనసాగునా
అమ్మడుండగ పె-ద్దమ్మను గోరి తే
యర్థము చేకూరునా మనసా! పర॥

౩

అన్నముండగ నాను-బియ్యముదినినంత
నాకలివెతదీఱునా?
నిన్నలుండగ చిన్ని-కన్నెలగలసితే
కామమువ్యథ తీఱునా మనసా! పర॥

౪

తంద్రబాధల చేను-పద్రవంపడు వేళ
నిద్ర కంటికి వచ్చునా
భద్రగిరీశుని-భక్తిలేనినరుడు
పరమును గననేర్చునా మనసా! పర॥

వ ఈతీరునఁ గీర్తనంబు సేయుచు రామదాసుగారు స్వాగ్రహం
బునకు ముందు నిలువంబడి యిట్లని కీర్తింపుచున్నారు.

రాగము - మోహన - ఏకతాళము

మానసమా నీవు మఱవకుమీ-పెన్ని-
ధానము రాముమం-త్రానుసంధానము మానసమా॥

౧

సారరిపుగురుభక్తి-మిఱకుమీ-సం
సారఘోరాటవిలో-మాఱకుమీ-దరి

చేరనికోర్కులగోరకుమీ-అయి
వాటింటివెనువెంటపోఅకుమీ-భ్రష్ట    మానసమా॥

2

సర్వదైవతములకు మ్రొక్కకుమీ-లోల
సరసిజముఖులకు దక్కకుమీ-ఘోర
నరకదుఃఖములెల్ల బాయుసుమీ-దా-
శరథికథామృతమూ గోలుసుమీ    మానసమా॥

3

చిద్రూపము వెలుగొందుసుమీ-అజ
రుద్రాదులకెల్ల విందుసుమీ-దా
రిద్ర్యవ్యాధికిమంచిమందుసుమీ-శ్రీ
భద్రాచలరామ-దాసపోషభక్త    మానసమా॥

వ. ఇవ్విధంబున భగవద్దర్శనంబు జేసి నెమ్మదింజెంది రేయుం బవళ్ళు రామదాసుగారు హరినామస్మరణంబు గావించుచు విప్రుల భోజనంబులఁ దృప్తులం జేయుచు సరమానందంబున నుండ నచ్చట భద్రగిరియందు సీతాదేవి రాములం జూచి యిట్టియంతరంగభక్తుఁడగు రామదాసునకు దర్శనం బొసంగక మ్లేచ్ఛుఁడగు తానీషాకు దర్శనం బొసంగితిరిది కపటకృత్యం బనాదగా మీయందు నిత్యంబయ్యె నిటులు చేయుటకుఁ గతంబెఱింగింపుఁడనిన శ్రీరాముఁడు మొగంబునఁ జిఱునగ వంకురింప సీతాదేవి కిట్లనుచున్నారు.

తానీషాపూర్వజన్మవృత్తాంతము.

క. గంగానదియుత్తరమున
శృంగారంబై చెలంగుశివునకు భక్తిన్

గంగాజలమున దినమును
మంగళస్నానంబు గడఁగి । మనుజుఁడు సేయన్.

క. దేవేంద్రపదవిఁ జెందును
దీవ్రంబుగ ననుచుఁ బలుకు । దృఢవాక్యంబుల్
కోవిదుఁ డొకవిప్రుఁడు విని
యావిధి నొనరించుచుండె । నాయన మెలమిన్.

క. ఒకదినము కొఱఁత గలనాఁ
డికఁ బరమేశ్వరుఁడు గలుగఁ । డీయెడ ననుచున్
వికలముగఁ దలఁచి విప్రుం
డొకజలఘట మీశుశిరము । పైఁ బడ వైచెన్.

ఉ. నిండు వెలుంగుమూర్తిఁ గమ । నీయభుజంగమరాజకుండలీ
మండను నర్ధచంద్రపరి । మండితమస్తకుఁ జారుమల్లికా
పాండురవర్ణుఁ జండతర । భండను హేమగిరీంద్రచాపకో
దండు మహేశుఁ గంధగజ । దానవఖండనుఁ గాంచె మున్ ద్విజున్.

వ. ఇట్లు ప్రత్యక్షం బైనయీశుఁ బలువిధంబులఁ గొనియా
డఁ దొడంగె.

రగడ.

జయజయ శంకర । సాధువశంకర
జయజయరిపుభట । జయనాశంకర
శరణు నిరంజన । సజ్జనరంజన
శరణు ప్రభంజన । జగదవభంజన
పాహిపురాపహ । బంధురవిక్రమ
పాహియవిద్యా । పంకరవిక్రమ

యచ్చుగ నిను దెలియవు తొలిచదువులు
మెచ్చిన నిత్తువు మేలగుపదములు
నీకెవ్వరిపై నిల్వదు కోపము
లోకుల కెంత దెలుపుదు ప్రతాపము
పగఁడు స్వజనుఁడను భావవిభేదము
పొరయదు నీమది పూర్ణామోదం
బభవుని భవునిస్సమితటి యూపగు
నభినుతింపబ్రహ్మాదులు నోపరు
ఖలుఁడ మదాంధుఁడఁ గలుషోత్కృష్టుఁడఁ
జలచిత్తుఁడఁ గడుజడుఁడ నికృష్టుఁడ
నే నిను పొగడగ నెంతటివాఁడను
స్వామి మదమతిఁ శరణాన్నుడను
నీదాసుఁడనిఁక నేరము లెంచకు
నాదుష్కృతి మనసంబున నుంచకు
ఎఱుఁగక చేసితి నీయపచారము
శరణాన్నుగడ వచదె విచారము
వలసితి నీ సేవకుల మహత్త్వము
తెలిసితి నీయెడ దేవరసత్త్వము
నీకును దెలుచిర నెగడును జగములు
నీకనుమూసిన నిలువవు జగములు
ఇట్టినీకు సరి యేనని మెచ్చితిఁ
బొట్టికొవ్వున పొగడఁగ వచ్చితి

నాగుణమెంచక నను బాలింపుము
నీగుణమెంచెద నీవాలింపుము

వ. అని యిట్లనేకప్రకారంబులఁ బ్రార్థించిన.

క. తామసమతి మ్లేచ్ఛుఁడవై
భూమండలిఁ బుట్టి దీవు భూమిశుఁడవై
సామజవరదుని దర్శన
మా మెయి నీకబ్బు నాదుమన్నన గలుగున్.

వ. అని యానతిచ్చి యంతర్హితుం డైన.

క. ఆతఁడు మ్లేచ్ఛకులంబున
భూతలమున జాత మొంది భూమిశుం డై
ఖ్యాతిగ రాజ్యం బేలెను
ప్రీతిగ తానీష యనెడు పేరిల నిగుడన్.

వ. ఓసీతా! అతనికి దర్శనంబు గలుగునటులు పశుపతివరం బగుటఁ జేసి దర్శనం బొసంగెతి నిఁక రామదాసుపూర్వ జన్మవృత్తాంతంబు విను మని యిట్లనియె.

(శ్రీరామదాసు పూర్వజన్మ వృత్తాంతము.)

ఉ. పూర్వభవంబునందు బహుపుణ్యము చేతఁ బొసఁగి భూసురా
శీర్వచనానుమోదితవిశేషవికాసిత చిత్తపద్ముఁ డై
శార్వరిచంద్రుపోల్కి నిలఁ జాఁ బ్రసిద్ధికినెక్కి పేర్మితో
శర్వునిపూజ సేయుచును శాసితదుష్కృతుఁ డై చెలంగుచున్.

శా. క్రీడాసక్తత నొక్క కీరమును దాఁ గ్రహించి దక్షుఁడై తెచ్చి మేల్
జాడం బొల్పగు గూఁటనుంచి ఫలము ల్పాల్యన్నముం బెట్టియా

నీడాగారకు లేంద్రముం బెనిచి బల్ నీతిజ్ఞుఁడై రామయం
చాడన్నేరిపిచిల్కపల్కుల కెవన్ జాలంబ్రియంబందుచున్.

గీ. ఉన్నకతమున నీజన్మమందు నాదు
భక్తి యాదవెను జిల్క నిర్బంధపెట్టి
నందునను బంధిఖానల నొందవలసె
నిప్పుడాకర్మ శేషంబు నీగె మగువ.

క. ఆకర్మశేష మిప్పటి
కీకరణిం దీఱెఁ గాన నీతండిఁక నా
కేకాంతభక్తుఁడై తుదిఁ
గోకస్తని నాదుపదము గూడుతుగఁ జేరున్.

వ. కావున నితం డింతపర్యాయాసకు లోనయ్యె. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభం" అని యున్నదిగావునఁ గర్మములు శేషించియుండెనేని నాకు పరమభక్తుండైనను జన్మాంకురకారి యగుటం జేసి యితనికి జన్మంబు లేకుండఁ జేయు తలంపునఁ బూర్వజన్మకృతదోషంబుల ననుభవింపఁ జేసితి ననియె నంత భద్రాద్రియందు రామదాసుగారు ప్రతిదినంబును రామభజనంబు సేయుచు భక్తులతోడం గూడి రామనామప్రభావంబును వర్ణించు టెట్టు లనిన.

రాగము - ధన్యాసి - చాపుతాళము.

అబ్బబ్బా రామనామం—అత్యద్భుతం
గొబ్బున నేభాగ్యశాలి—కబ్బునో శ్రీరామనామం॥అబ్బ॥

౧

సారహీనసంసారసాగరమీదే-రామనామం
పాఱదోలుమున్నూఱుయువది-భవరోగములన్నీ
చేరిసంచేంద్రియములన్ని-చేరకపోదోలునామం
ఘోరమైనయమదూతలను-కొట్టెటినామం॥ అబ్బ॥

౨

దినదినముజిహ్వాకింపై-తియ్యగానుండేటినామం
ధనకనకవస్తువులూ-దయసేయునామం
అనలుకొనలునెక్కనుశ-మాభివృద్ధిజేయునామం
తనువును రెండనుచూ మదిని-తారకనామం॥ అబ్బ॥

౩

ముక్కంటిసతికి శాశ్వత-కీర్తినిచ్చేరామనామం
యెక్కువైన వాల్మీకిఋషి-యెప్పుడనుస్థానం
ఒక్కసారి రామాయంటే-ఒంభూన్వహాపాపములన్నీ
మొక్కిరెండుమాఱులంటే-మోక్షమిచ్చే రామనామం॥

౪

దగ్గఱరాదుమన్మధుని-దవులనుండు రామనామం
గొబ్బునమోహపాశముల దెగ-గోసేటినామం
మబ్బుదూదికొండవంటి-మొయలుపుట్టిన పాపములన్నీ
అగ్నిమిణుగురువలె కాల్చు-నారామనామం॥ అబ్బ॥

౫

కామక్రోధలోభమోహ-గర్వమడచేరామనామం
స్వామిభద్రాద్రీశునితోడి-సద్గతినామం

నీమములతో బలికితేను-నిత్యమోక్షపదవినామం
రామదాసు నేలినట్టి-శ్రీరామనామం॥ అబ్బ॥

ఈతీరున భాగవతకులాలంకారుండు భజనంబు సేయుచుండ కొందఱు మూఢజనులు గోవును జంపి చెప్పులదాన మని చెప్పినట్లు అతండు రాజద్రోహంబు చేసి యీరాతికి నలంకారము సేయ నేమిఫలంబు గాంచునని వీధులం దను కొనుచుండుటఁ గొందఱుహరిభక్తులు విని రామదాసు గారితోఁజెప్ప నతం డిట్లనుచున్నాఁడు.

రాగము - బిలహరి - ఆదితాళము.

ఎవరుదూషించిన నేమి-మెచ్చి
యెవరుభూషించిన నేమి
అవగుణంబులు మాన్పి-యార్చేరాతీర్చేరా?
నవనీత చోరుడు - నారాయణుఁ డుండ॥ ఎవ॥

పిమ్మటలాడిన నేమి-మంచి-ప్రియములుపల్కిన నేమి
కొమ్మరోరమ్మని కోరికలొసఁగెడి-సమ్మతినాపాలిసర్వే
శుండుండ॥ ఎవ॥

వానిషంతమువూ కేల-వట్టి-వాదులతోడ పోరేలా
దూషించేవారితో పలుమాఱుపొందేల-కాచిరక్షించెడి
ఘనుడు రాముఁడుండ॥ ఎవ॥

౩

అపరాధముల నెంచువారు-మాకు-ఉపకారులైయున్న వారు
విపరీతచరితలు వినుచు నెల్లప్పుడు-కపటనాటకథారి
కనిపెట్టియుండగ॥ ఎవ॥

౪

వాసివన్నెలుసల్ప నేల-మూఁడు-వాసనలనుభ్రమయ నేల
వాసిగభద్రాద్రివాసుడై నిరతము-భాసురముగ
రామదాసుడై యుండంగ॥ ఎవ॥

వ. ఇవ్విధంబున వారల నాశ్వాసించి యిట్టిజనులకు భగవద్భక్తి కలుగునటుల నైనఁ జెల్వందంగాక యని మృదంగాదిసాధనములు గొని సన్నాహమున పురవీథులందు హరినామకీర్తనము చేయుచు నోజనులారా! నిఖిలభవరోగహారం బగునారామజోగిమందు గొనుం డని కీర్తనముఁ జేయుచున్నారు.

భాస్కరవిలసితవృత్తము.

రాముఁడు సరుఁడని చూచి దు
రాచారాదినటనలజనులు మన్నైరా
రాముఁడు గురుఁడని చూచి సదా
చారాదినటనల బుధులుమనినారీ
భూమినిబరమపదంబు విచారిం
పుఁడుకనఁబడు తెలివిని దగ వ్యా
ద్ధాముని హరిని వినా యణుమాత్రం
బేమియు జగతిఁ గలుగ దని చూడన్.

రాగము - నాథనామక్రియ - ఆదితాళము.

రామజోగిమందు కొనరే!-పామరులారా
రామజోగిమందుకొనరే!

౧

రామజోగిమందుమీరు-ప్రేమతోభుజియించినపుడే
కామక్రోధముల నెల్ల - కడకుపాఱదోలుమందు॥ రామ॥

౨

మదమత్సరలోభములను-మాటలో నిలిపేటిమందు
గుదిగొన్న కర్మములను-గూడకి యెడదోలుమందు॥ రామ॥

౩

కాటుకకొండలవంటి - కర్మమూ లెడబాపుమందు
సాటి లేదుజగమునందు-స్వామిరామజోగిమందు॥ రామ॥

౪

కోటిధనము లిత్తునని - కొన్ననూ దొరకనిమందు
సాటిలేనిభాగవతులు - స్మరణ జేసితలచుమందు॥ రామ॥

౫

ముదముతో భద్రాద్రియందు-ముక్తిని పొందించేమందు
సదయుడైన రామదాసు-సద్భక్తితో గోలిచేమందు॥

వ. ఇవ్విధంబున సమస్తజనుల కాహ్లాదము సంధిల్ల పరమ శాంత స్వరూపుం డయి రామదాసుగారు వర్తింపుచుండ నారాముల బ్రహ్మోత్సవాంకురార్పణదినం బగుచైత్ర శుద్ధప్రతిపదాదిగా బ్రహ్మోత్సవంబు సాంగముగా పాంచ రాత్రోక్తప్రకారంబున జరిపించి సీతాకల్యాణంబునుంగా వించి బ్రాహ్మణులనుభోజనంబులం దృప్తిఁ జెందించి

యవరోహణదినంబునఁ గలశోద్వాసనంబును జేయించిన పిమ్మట నర్చకు లారామదాసునకు శ్రీశఠకోపమును దీర్థ తిరుమాలలు నొసంగి గీతవాద్యములతో గృహమునకుఁ బంపునపుడు రామదాసుగారేమని కీర్తింపుచున్నారు.

రాగము - నాథనామక్రియ - ఆదితాళము.

ఆనంద మానంద మాయెను-శ్రీ
జానకీపతిస్మరణ సేయను-నే
డార్యులకృపమాకు గల్గెను - ఇప్పు
డిరువై యేడిటనున్న-పరమాత్మ్మజూడగానె॥ ఆనంద॥

౧

పరమభక్తిశ్రద్ధగల్గెను-బహు
దురితజాలము లెల్ల దొలగెను-పటు
రాగద్వేషము లెల్ల వీడెను-అట్టి
రాజయోగంబున-రాజు జూడగానె॥ ఆనంద॥

౨

పూర్వపుణ్యము లొనగూడెను-శ్రీ
పార్వతీజపమంత్ర మిడెను-ఆ
పూర్వాకృతిని గనబడెను - పరమ
పావనమైన శ్రీహరిసేవ గల్గినేడు॥ ఆనంద॥

3

సామాన్యుల చెంత జేరము-వట్టి
పామరజనులనిక గూడము-విషయ

తామరసబుద్ధుల వేడము - మాకు
హరినామస్మరణ జేయు - భాగవతులెదిక్కు॥ ఆనంద॥

౪

రామభక్తుల జేరగలైను - ఇతర
కామములెల్ల వీడగలైను-పర
భామలపయిభ్రాంతిదొలగెను-మేము
పరులు దోషములెన్న-నేదురాడము॥ ఆనం॥

౫

ఇతరచింతన లిక చేయము-ఇతర
దైవములగొనియాడము-ధరా
పతులకు జిక్కి చింతసేయము-ఇన
కులచంద్రుడౌ భద్రా-దలరాము సేవింతు॥ ఆనం॥

౬

భద్రాద్రిస్వామిమాకుదైవము-వేఱు
క్షుద్రదేవతలను దలపము-దా
రిద్ర్యములెల్ల మదినెంచము - భద్ర
గిరి రామదాసు నేలు-పరమదయాళుడుగలై॥ ఆనంద॥

౮. ఈప్రకారంబున రామదాసుగారు ప్రతిసంవత్సరంబును శ్రీరాములవారి బ్రహ్మోత్సవముఁ జేయుచు భగవత్కైంకర్యమునందు బ్రాహ్మణపూజనములయం దాసక్తచిత్తుం డయి యుండం గొన్నిదినంబుల కారామదాసుగారికిఁ గాలునొప్పి నుపించిన భద్రశైలంబునకుం బోయి స్వాములవారిదర్శనముఁ జేయుటకు శక్తిచాలక రామదాసుగారు విచారగ్రస్తులై యిట్లని చింతింపుచున్నారు.

రాగము - కాంభోజి - ఆదితాళము

ఎక్కడికర్మము లడ్డపడెనో-ఏమి సేతునే రామా
అక్కటనాకిన్నులనెప్పుడు హరినిజూతునో రామా॥

౧

సృకటమాయె పాపమెటుల బాధకోర్తు రామా
సకలలోక రాజ్యపదవి సన్నుతింప రామా॥ ఎక్క॥

౨

పృథివిలోన పూర్వజన్మ పూజలింతెకా
వ్రతముగదుపవలయు విషయ వాంఛవదలక॥ ఎక్క॥

౩

మూడు నెలలాయె రామునిముందు నిల్వక
ఎన్నడిట్లుండి నేను నెఱుగ రాఘవా॥ ఎక్క॥

౪

కోరిభద్రాచలము రాముని కొలుతునంటినీ
రామదాసునికొక్కలొసగి-రక్షించుమంటినీ॥ ఎక్క॥

వ. ఇవ్విధంబునఁ జింతించి రామనామస్మరణముఁ జేయుచున్న వాఁడే కృతార్థుండనియు నటులు సేయనివానిజన్మము నిరర్థకం బనియుఁ జెప్పుచున్నారు.

రాగము - కల్యాణి - రూపకతాళము.

రామరామయనినోట-రవ్వంతసేపైన
నీమముతప్పక మంచి-నీతి బల్కనివాడు
మత్తుడూ మూఢచిత్తుడూ॥ రామ

దేవా మశాశ్వతమని-తెలియక దుర్బుద్ధిచేత
సాహసమున సాధుజనుల-సంకటపెట్టెటివాడు
పాతకీ-బ్రహ్మఘాతకీ! రామ॥

౩

కొండలు పెంచుచు నేను-పండితవాడ ననుచు చాల
పండితనముగలిగి పరుల-దండనగోరేటివాడు
నిక్కునా-భువిలో దక్కునా? రామ॥

౨

మన్ననతో పిన్న పెద్దల-కన్నులగానకను భాగ్య
మున్నదనిగర్వమున-నన్నము బెట్టనివాడు
హీనుడూ దుస్సంధానుడూ! రామ॥

౪

ధనమెంతో కలిగియున్న-దానధర్మము లేనివాడు
హీనుడెయ్యభూమిలోను - మానుగానెన్నాళ్లుబ్రతికిన
నేటికీ తా మున్నాటికీ? రామ॥

౫

పరిపాటి తెలియకను-పరులద్రవ్యమపహరించి
కరుణలేకా పేదసాదల-కష్టము పెట్టెటివాడు
తట్టునా-తుదముట్టునా! రామ॥

౬

దూరభారము దెలియ లేక-దుర్బుద్ధితలపోసి
మేరదప్పి పరులసతుల-మెల్లనపొం దేటివానికి
మోసమూ చాలాదోసము! రామ॥

౭

స్నేహము జేసినవానికి-ద్రోహము జేసినవానికి
కూహకమున యమునిదూతలు-కులిశమునను మెండుకత్తుల
గోతురూ - కొఱితలవేతురూ! రామ॥

౮

రామదాసుని నేలినట్టి-ప్రేమతో శ్రీభద్రశైల
ధామసీతా రామచంద్రుల-గామించి కొలువకున్నా
గొబ్బునా-మోక్షమబ్బునా? రామ॥

వ. ఇవ్విధంబున రామనామమహాత్మ్యంబు చెప్పి యప్పటికి నాకాళ్లనొప్పిబాధ విశేషమగుచుండఁగా రామదాసుగారు గర్భముఁ జొచ్చినది మొదలు పడినబాధలను దలఁచుకొని యిట్లని యనుచున్నారు.

రాగము - వరాళి - రూపకతాళము.

అయ్యయ్యో నే జెల్ల యీజీవునకు సుఖ
మెయ్యెడ లేదుగదా-జన్మాలు-ఎన్నెన్నో కలవూగదా॥

౧

చయ్యన రఘుకులసార్వభౌమ యే
చందాన బ్రోచెదవో-రామయ్య॥ అయ్య॥

౨

వనజనాభునిమాయ-తెలియక నే వెఱ్ఱి
వగల బొందుచునుంటిగా-కొన్నాళ్లు
మునుపు చేసిన పాపపుణ్యసంఘములచే
మునిగి తేలుచునుంటిగా-కొన్నాళ్లు

ఎనుబదినాల్గుల-క్షలయోనులందెల్ల
వేసరకపుట్టితిగా-కొన్నాళ్లు
అనయము నరకము లనుభవించి స్వర్గ
మంతట జొచ్చితిగా-ఓరామ॥ అయ్యా॥

౩

ఆలంబనములేక - యాకాశమందున
నలసట నొందితిగా-కొన్నాళ్లు
మేలుదెలియలేక-మంచులోపలజిక్కి
మినుకుచునుంటిగదా-కొన్నాళ్లు
ఈలాగుతావచ్చి - మేఘమధ్యమునందు
నిడుమల బడుచుంటిగా-కొన్నాళ్లు
జాలినొంది సూర్య-కిరణములోజొచ్చి
చలనము నొందితిగా-ఓరామ॥ అయ్యా॥

౪

వర్షములో జిక్కి-వసుమతిమీద నే
వర్తింపుచుంటిగద-కొన్నాళ్లు
వసునశేషసస్య-గతమయినధాన్యముల
వరలి వర్తించితిగా కొన్నాళ్లు
పురుషుడారగించు నన్నముతోడనే
పొట్టజేరియుంటిగా-కొన్నాళ్లు
వరసరుని రేతస్సు-వల్ల నారీగర్భ
నరకాన బడియుంటిగా-ఓరామ॥ అయ్యా॥

౫

త్రిప్పుచుతి త్తిలో-పల దినదినము వృ
వర్ధిల్లుచుంటిగదా-కొన్నాళ్లు
అప్పుడు మాతల్లి-యుప్పవులును దిన
నంగలార్చుచుంటిగా-కొన్నాళ్లు
ఎప్పుడే నిందుండి-బయలువెళ్లుదు నని
యెదురుచూచుచుంటిగా-కొన్నాళ్లు
చెప్పరానియట్టి-ద్వారములోనుండి
జననము నొందితిగా-ఓరామ॥ అ॥

౬

పొరలుచుదుర్గంధ-పా త్తిలిరోదగిలి
పొదలుచునుంటిగదా-కొన్నాళ్లు
పెరుగుచు బాల్యావస్థల కొన్ని దినములు
పరుగులాడుచుంటిగా-కొన్నాళ్లు
తరుణులతో గూడి-మదమత్సరములను
తన్నెఱుగనయితిగదా-కొన్నాళ్లు
తరువాత దారపు-త్రాదిమోహానుల
దగిలి వర్తించితిగా-ఓరామా॥ అ॥

౭

తలతెల్లనై దం-తము లూడి వణకుచు
తడబడుచుంటిగదా-కొన్నాళ్లు
తలుపుదగ్గఱజేరి-బలిభిక్షుకులనెల్ల
తగిలి తిట్టుచునుంటిగ-కొన్నాళ్లు

పిలచినరాని పెండ్లాముబిడ్డలచేత
నిడుమలబడుచుంటిగా-కొన్నాళ్లు
బలిమిదీఱి కండ్లు పొరలుగప్పి-పరుల
బతిమాలుచుంటిగద-ఓరామా॥ అయ్యో॥

౮

అంతటమృతిబొంది-యలయుచు యమునిచే
అతిబాధలొందితిగా-కొన్నాళ్లు
వింతగా నీరీతి పుట్టుచుగిట్టుచు
వేదనబడుచుంటిగా-కొన్నాళ్లు
కంతుజనకభద్రా-చలపతివని నిన్ను
గనలేక తిరిగితిగా-కొన్నాళ్లు
వింతగనే రామ-దాసుడనై తిసి
ఇకనెట్లు బ్రోచెదవో-ఓరామా॥ అయ్యయ్యో॥

శా. బాలత్వంబునఁ గొన్నినాళ్లు పిదపన్
భామాకుచాలింగనా
లోలాభ్యస్నతిఁ గొన్నినాళ్లుమఱియు
ల్లున్ ముంగిలిన్ గొన్నినా
ళ్లీలీలన్ విహరించితిన్ సుఖఫలం
బెందేమియున్ లేదుగా
హాళిన్నీపదసేవ చేసెదను రా
మా యార్తరక్షామణీ!

వ. ఇవ్విధంబున రామదాసుగారు జీవులకుఁగలిగెడి గర్భవేద
నాదిక్లేశంబులు విచారించి తన కికఁ జన్మములేకుండునటుల

దయచేసి కాపాడుమని శ్రీరామునిం దలంచి కీర్తింపు చున్నారు

రాగము - వరాళి - ఏకతాళము.

ఎన్ని జన్మము లెత్తగవలయునో
యేలాగు తాళుదునూ-ఓరామా

౧

నన్నింతకిన్నడ-సేయుటనీకిక
న్యాయముకాదుసుమీ-ఓరామా
మొదటినిబంధన-మునసగమాయువు
నిదురపాలై పోయెగా-ఓరామా
పదపడితక్కిన-సగములో పదియేండ్లు
బాలత్వమున బోయెగా-ఓరామా॥ ఎ॥

౨

వదలకయావన-మున పరభామల
వలల దగులనాయెగా-ఓరామా
ముదిసిసంసారాంధకూపములో జిక్కి-
మునిగి తేలగ నాయెగా-ఓరామా
తనువస్థిరంబని తారకనామము
తలపోయలేనైతిగా-ఓరామా
దినదినమును బొట్ట-కొఱకు దీనులవేడి
దీనత్వ మొందితిగా-ఓరామా
అనుదినమును గురునుపదేశయోగము
నభ్యసింపనైతిగా-ఓరామా॥

3

ఎనసి నిమిషమైన మీపాదములపైని
మనసు నిల్పగనైతిగా-ఓరామా
వాసిగనిసాములో-బడినపాటులెల్ల
పాసినపాళముగా-ఓరామా
మీసేవ చేసియు-మిమ్మేనమ్మినభవ
పాశము లంటవుగా-ఓరామా
లేశమైనకృప-జేసిభద్రశైల
వాసకావగరావుగా-ఓరామా
ఆశతో నే రామదాసుడనని మీకు
దోసిలి యొగ్గితిగా-ఓరామా॥ ఎన్నె॥

తోహారా

ఇఁక నీసంసారాంబుధిలోఁ బడికయిడుములనేఁ బడజాల
నకలంకా! నీపదమున జేరిచికఆదరింప వేల. 117

—ఇది వినరయ్యా.

5. అని యివ్విధంబునఁ గొంతవడి చింతించి శ్రీరామచంద్ర పదార్చనం బొనర్చెడినా కిఁక భీతినొందనేల సకలంబున ను రాముఁడే గలఁడని నిశ్చయించి రామదాసు పలుదెఱఁగుల నుతిసేయుచున్నా రెటువలె ననిన.

—: చతుర్వింశతినామప్రతిపాదక మైనచూర్ణిక. :—

శ్రీమ దఖిలాండకోటి బ్రహ్మాండభాండ
తండోపతండ కరండమండలకాంతోద్దీపిత సగుణ

నిర్గుణాతీత సచ్చిదానంద పరాత్పరతారకబ్రహ్మ వ్యాయ దశదిశాప్రకాశం - సకల చరాచరాధీశం; కమలసంభవ శచీధవప్రముఖ నిఖిలబృందారకబృంద వంద్యమానసందీప్త దివ్యచరణారవిందం- శ్రీముకుందం ; దుష్టనిగ్రహ శిష్టపరిపాలనోత్కట కపటనాటకసూత్ర చరిత్రాంచిత బహువిధావతారం - శ్రీరఘువీరం;

కౌసల్యాదశరథ మనోరథామందానంద కందళితనిరూఢ క్రీడావిలోలస శైశవం - శ్రీకేశవం;

విశ్వామిత్ర యజ్ఞవిఘ్న కారణోత్కట తాటకా సుబాహుబాహుబలవిదళన బాణ ప్రవీణ కోపపరాయణం-శ్రీమన్నారాయణం;

నిజపాదజలజరజఃకణస్పర్శనీయ శిలారూప శాపవిముక్త గౌతమసతీవినుత మహీధవం శ్రీమాధవం;

ఖండేందుధర ప్రచండకోదండ ఖండనోద్దండదోర్దండ కౌశికిలోచనోత్సవ జనకచక్రేశ్వరసమర్పిత సీతావివాహోత్సహానందం - శ్రీగోవిందం;

పరశురామభుజాఖర్వగర్వ నిర్వాపణతానుగతరణ విజయవరిష్ణుం-శ్రీవిష్ణుం;

పితృవాక్య పరిపాలనోత్కట జటావల్క
లోపేత సీతా లక్ష్మణసహిత మహిత రాజ్యా
భిమత దృఢవ్రత కలితప్రయాణరంగ ద్గంగా
వతరణసాధనం-శ్రీమధుసూదనం.

భారద్వాజోపచార నివారిత శ్రమక్రమ
నిరాఘాట చిత్రకూటప్రవేశక్రమం - శ్రీత్రి
విక్రమం.

జనకవియోగశోకాకులిత భరతశత్రుఘ్న
లాలనానుకూలబన్ధుపాదుకాప్రదానసుధానిర్జి
తాంతఃకరణ దుష్టచేష్టాయమాన క్రూరకా
కాసుర గర్వోపశమనం-శ్రీవామనం.

దండకాగమన విరోధ క్రోధవిరాధా
నలజ్వాలానిర్వాపణజలధరం శ్రీధరం.

శరభంగ సుతీక్ష్ణాత్రిదర్శనాశీర్వాద ని
ర్వ్యాజకుంభసంభవ వత్సపాలబ్ధ మహాదివ్యా
స్త్రసముదయార్జితప్రకాశం-శ్రీహృషీకేశం.

పంచవటీతటీసంఘటిత విశాలపర్ణశాలా
గత శూర్పణఖానాసికాచ్ఛేదనావమానావ
బోధన మహాహవారంభణవిజృంభణ రావణని
యోగ మాయామృగసంహారకార్యార్థలాభం
శ్రీపద్మనాభం.

రాత్రించరవరవంచనాపహృత సీతాన్వే
షణపథన జీర్ణరథయోధ శిథిలీకృతపక్షజటాయు

మోహ బంధుప్రియావసాన నిర్బంధనబంధవ
క్రోధర శరీరనిరోధనం-శ్రీదామోదరం.

శబర్యుపదేశసంపాతట హనుమత్సుగ్రీవ
సంభాషిత బంధురోద్బంధుర దుందుభికళేబరో
త్పతన సప్తసాలచ్ఛేదన వాలివిదారణప్రసన్న
సుగ్రీవసామ్రాజ్యసుఖమర్షణం-శ్రీసంకర్షణం.

సుగ్రీవాంగదనీలజాంబవత్పనస కేసరిప్ర
ముఖ నిఖలకపినాయక సేనాసముదయార్చిత
దేవం-శ్రీవాసుదేవం.

నిజచిత్త ముద్రికా జాగ్రత్సమగ్రాంజనే
య వినయవచన రచనాంబుధిలంఘనోల్లంఘిత
లంఖిణీ ప్రాణోల్లంఘన జనకజాదర్శనాతుకు
మార మారణలంకాపురీదహన తత్ప్రతిష్ఠిత సు
ఖప్రసంగ ధృష్టద్యుమ్నం-శ్రీప్రద్యుమ్నం.

అగ్రజోదగ్రసువాగ్నిగ్రహ పలాయ
మానావ మాననీయ నిజశరణ్యాగణ్య పుణ్యా
నయ విభీషణాభయ ప్రదానానిరుద్ధం-శ్రీమద
నిరుద్ధం.

అపార లవణపారావార సముజ్జృంభితో
త్కారణ గర్వ నిర్వాపణదీక్ష సమర్థసేతుని
ర్మాణ ప్రవీణాఖిల తరుచరోత్తమం-శ్రీపురుషో
త్తమం.

నిస్తుల ప్రహస్త కుంభకర్ణేంద్రజిత్కుంభనికుంభాగ్నివర్ణాతికాయ మహోదరమహాపార్శ్వాదిదనుజతను ఖండనాయమాన కోదండగుణ శ్రవణశోషణ హతశేష రాక్షసవ్రజం శ్రీఅధోక్షజం.

అకుంఠిత రణోపకంఠ సముత్క్రాంతదనుజ కంఠీరవ కంఠ లుంఠనాయమాన జయసమారంభం శ్రీనారసింహం.

దశగ్రీవానుజ పట్టభద్రత్వాశక్యవిభవ లంకాపురీస్ఫురణ సకలసామ్రాజ్య సుఖాచ్యుతం-శ్రీమదచ్యుతం.

సకలసురాసురాద్భుత ప్రజ్వలితపావకముఖ పూతాయమాన సీతాలక్ష్మణానుగత మహానీల పుష్పకాధిరోహణ నందిగ్రామస్థిత భ్రాతృభిర్యుత జటావల్కలపరిత్యజనాంబర భూషణాలంకృత శ్రేయోవివర్ధనం-శ్రీజనార్దనం.

అయోధ్యానగర పట్టాభిషేక విశేష మహోత్సవ నిరంతరదిగంతవిశ్రాంత హార హీర కర్పూర పయఃపారావార పారదవాణీ కుందేందు మందాకినీ చందనసురధేను శరదంబుదాళీ దరవంభోళిశతధారా ధావళ్య శుభకీర్తి చ్ఛటాంతర పాండురీభూత సభావిభ్రా

జమాన నిఖిల భువనైకయశస్సాంద్రం-శ్రీమ
దుపేంద్రం.

భక్తజనతా సంరక్షణ దీక్షాకటాక్ష
విజృంభమాణశుభోదయ సముజ్జ్వ రిం-శ్రీహరిం.

కేశవాది చతుర్వింశతినామగర్భసందర్భి
త నిజకథాంగీకృత మేధావర్ధిష్ణుం-శ్రీవిష్ణుం.

సర్వానుసర్వ పార్వతీహృదయ కమలతా
రక బ్రహ్మనామం సంపూర్ణకామం రామం.

భవతరణానుగుణసాంద్రం భవజనితభ
యోచ్ఛేదచ్ఛిద్రమచ్ఛిద్రం, భక్తజనమనోర
థోన్నిద్రం॥ శ్రీమద్భద్రాచల రామభద్రం
రామదాస సుప్రసన్నం భజేహం భజేహం
భజేహం భజేహమ్॥

వ. అని యిట్లు బహువిధంబుల వినుతించి మఱియుం గృష్ణ
నామాభివర్ణనంబు సేయుచున్నా రెట్లనినా.

రాగము-అసావేరి - చాపుతాళము.

కలయే గోపాలం-కస్తూరీ
తిలకసుఫాలం-కుండలరుచి-లలితకపోలం
జలదసన్నిభ కాంతికాంతం
జగన్నాథపురనిశాంతం॥ కల॥

౧

అనుపమరూపం-మహితమణి
కనకకలాపం-విగతగోప వనితానుతాపం

మునిమనోసీ రేజతరణిం
వనజసన్నిభ చారుచరణం॥ కల॥

౨

అవితద్విజాతం-కరాంభోజ
నవనవనీతం-కమలభవ-భవమునిగీతం
వివిధకుసుమాలంకారం
విమలబృందావనవిహారం॥ కల॥

౩

భాసితభానుం-భద్రాద్రిని
వాసనిదానం-దివ్యానంద-భాసురగానం
రాసకేళివిరాజమానం
రామదాసస్తుతినిదానం॥ కలయే॥

వ. మఱియు నేమని వేఁడుకొనుచున్నారనిన.

రాగము - మణిరంగు - ఆదితాళము.

నందబాలం-భజరే-నందబాలం
బృందావన వాసుదేవ-బృందలోలం॥ నందబాలం॥

౧

జలజసంభవాదివినుత-చరణారవిందం-కృష్ణ
లలితమోహనరాధావదన-నళినమిళిందం॥ నందబాలం॥

౨

నిటలతటస్ఫుటకుటిల-నీలాలకబృందం- కృష్ణ
ఘటితశోభితగోపికా-ధరమకరందం॥ నందబాలం॥

3

గోదావరీతీరవాసం-గోపికాకామం-కృష్ణ
ఆదిత్యవంశాబ్ధిసోమం-భద్రాద్రిధామం ॥నందబాలం॥

వ. ఈప్రకారంబుగా రామదాసుగారు రాముని వినుతింపుచున్న సమయంబునందు.

తోహరా.

అతులితనుతివిని యార్తశరణ్యుండిద్దృశ్యుండై వేగముగా
సుతుడానీవికసోలకుము మెచ్చితినేసుఖపడుమిచ్చెదబాగ
అని జగదీశుడు రాముండిచ్చెనునేనడిగినవరముల నన్నీ
విను వత్సా! యీభూమిలో నుండుమునేనీ వస్త్రంబులు కొన్నీ
ఆవలనీమనంగీకరించుటకునేనంపెద సుమి-రథమేనూ,
భువనంబులు వోగిడెందరమ్మానాభువనమునకురయమునను.
——ఇది వినరయ్యా.

వ. అని యిట్లద్దృశ్యుండై యాదేవుండానతిచ్చినమధురవచనంబులు కర్ణగోచరంబులగుటయు రామదాసుగారందువలనం గలిగిన యానందాతిశయంబునం బరవశులై రామనామం బఖిలజగన్మయం బని వచింపుచున్నారు

రాగము - వరాళి - ఆదితాళము.

అంతా రామమయం-బీజగ
మంతా రామమయం

౧

అంతరంగమున-నాత్మారాముడ
నంతరూపముల-వింతలు సలుపగ

సోమసూర్యులును- సురలు తారలును
ఆమహాంబుధులు-నవనీజంబులు॥ అంతా॥

౨

అండాండంబులు-పిండాండంబులు
బ్రహ్మాండంబులు.బ్రహ్మలు మొదలుగ
నదులువనంబులు-నానామృగములు
విదితకర్మములు-వేదశాస్త్రములు॥ అంతా॥

౩

అష్టదిక్కులును-నాదిశేషుండును
అష్టవసువులును-నరిషడ్వర్గము
ధీరుడు భద్రా-చలరామదాసుని
కోరికెలొసగెడి-తారకనామము॥ అంతా॥

మ. స్ఫుటకోదండకరసివాసముల దుష్టపీడ్రజం
భద్వేషిజన్యంబు తా
రకముల్ మౌనినుతంబు నాజకులమం
త్రంబా సురధ్వంసముల్
సకలార్థావసముల్ జగత్ప్రకటముల్ స
న్ముక్తిమార్గంబు మా
మక షడ్వర్గహరంబు రామ విల స
న్మంత్రంబు న న్బ్రోవుతన్.

వ. ఇట్లు రామనామాభివర్ణనంబాచరించితదీయజపసిద్ధికాధికార
ణంబగు వైరాగ్యంబత్యుత్తమంబని విశదపఱచుచున్నారు.

రాగము—సావేరి—ఆదితాళము.

భళిరా వైరాగ్య మెంతో-బాగై యున్నా దీ-చం
చలమైన నామనసుని-శ్చలమై యున్నాదీ॥ భళి॥

౧

అరిషడ్వర్గములున-న్నంటకున్నా వి-శ్రీ
హరినామస్మరణ జిహ్వ-కిసుస్థైయున్నాది॥ భళి॥

౨

గురుధ్యానమందే మనసు-కుదురైయున్నాది-చిత్త
మిరువదియాఱింటిమీద-నిరవై యున్నాదీ॥ భళి॥

౩

పరులధనముజూచి మెచ్చు-పెరుగకున్నాదీ—అల
పరభామలయందు మాతృ-భావమున్నాదీ॥ భళి॥

౪

పరమశాంత మెన్నగను-బాగైయున్నాదీ-మాకు
పరతత్త్వమందే బుద్ధి-పట్టియున్నాదీ॥ భళి॥

౫

విరసము వేరులేని-విధమైయున్నాదీ—ప్రకృతి
తెరబాసి మోక్షమునకు-తెరువైయున్నాదీ॥ భళి॥

౬

గుణభద్రాద్రీశునందే-గుఱుతైయున్నాదీ-యెప్పు
డరలేక రామదాసు-డనదగి యున్నాదీ॥ భళి॥

ఉ. తతభోగానువిహారచిత్తులకు బొం
దదూరమై భక్తిసం

యుతయోగీంద్రులకెల్ల దాపగుచు వే
ద్యుండై చిదానందుడై
శ్రితపుత్రీ హృదయప్రమోదకరుడై
చెల్వొందు శ్రీరామునిన్
సతతంబున్ శరణంబు వేడెదను మో
క్షశ్రీసమాకాంక్షినై.

5. ఇవ్విధంబున వైరాగ్యప్రభావం బభివర్ణించుచు విషయసుఖం బులయం దాసక్తిలేక వ్యర్థకం బంచలంచల రానున్నయది జరాభారంబు చే బీడింపబడకమున్నె భగవత్సాన్నిధ్యంబు చేరగలిగెడినో కో! యని రామదాసుగారు కీర్తనంబు చేయుచున్నారట!

రాగము - మోహన - చాపు తాళము.

గో వింద సుందర మోహన-దీన
మందార గరుడవాహన-భవ
బంధాదిదుష్కష్టదాహన-భక్త
. వత్సల త్రైలోక్యపావనా॥ గోవిం॥

౧

సతిసుతులపై ప్రేమరోసితి-సత
తమునీపై భారము వేసితి-మది
మిము గనులజూడగోరితి, మీ
దయ కెప్పు డెదురుచూచితి॥ గోవిం॥

రిని గాచినహరివి కావేమో-రామదా
సుని మొఱవినివేగ రావేమో॥ గోవింద॥

రాగము - కల్యాణి - ఆదితాళము.

రామకృష్ణగోవింద నారాయణా-శ్రీ
రామకృష్ణగోవింద నారాయణా॥ రామ॥

౧
రామకృష్ణాయని ప్రేమతో పిలిచిన
మోమునుజూపవేమి నారాయణా॥ రామ॥

౨
అండజవాహన పుండరీకాక్ష నీ
యండ జేరినానయ్య నారాయణా॥ రామ॥

౩
మాధవవిష్ణుమధుసూదనశ్రీధర
శేషశయన శ్రీమన్నారాయణా॥ రామ॥

౪
వాసుదేవముకుంద-వనమాలిచక్రధర
నారసింహాచ్యుత నారాయణా॥ రామ॥

౫
పతితుడని మిమ్ము-బతిమాలుకొన్న సీతా
పతి నన్ను గావవేమి-నారాయణా॥ రామ॥

౬
రామదాసుని బ్రోవ-ప్రేమతో భద్రాచల
ధాముడవైన శ్రీమన్నారాయణా॥ రామ॥

వ. అని యివ్విధంబున రామదాసుగారు నిర్మలచిత్తంబున దేహాద్యభిమానంబులు వదలి రాముని యనంతనామంబుల వర్ణనంబు సేయుచున్నారు.

తోహరా.

కరుణాకరునానతిక్రమము మెప్పఁగైకొనెడపె రామదాసిలలోన్
పరమపదంబును జేరుప దా పుష్పకముం బెను దాసునకున్.
రథముఁజూచియా రామదాసుఁడతిరమ్యముగానందతికిన్
సప నుతిఁ జెప్పుచు సన్నుతి జేయుచు సాగెను శ్రీహరిపురికిన్

—ఇది వినరయ్యా

వ. ఇట్లు విమానరాజంబు శ్రీహరిప్రేరితంబై సాక్షాత్కరించిన నా తుమావంతుం డత్యంత సంతుష్టాంతరంగుఁడై కృతార్థుండ నైతి నింక నీవిమానంబు నధిరోహించి మహీకుమారికా మనోనాయకుని పాదారవిందంబు లర్చింపం జనియెదం గాకయని సకలేంద్రియంబులను వశ్యంబుఁ జేసికొని మోహంబు నిర్మూలంబు చేసి సత్పురుషుల కాశ్రితావనంబు సేయుట నైజంబు గావున బహుదినంబులనుండి తనకు శుశ్రూషల సేయుచు నాశ్రయించియున్న తనభార్యం బిలిచిన నాసాధ్వి కొంచెము పనియున్న దివచ్చెదనని నీవు ప్రస్థంబింతియయని విమానంబుపయిం గూర్చుండి పురంబు నందలిభగవద్భక్తులం గని యిట్లని యనుచున్నారు.

రాగము - పున్నాగవరాళి - ఆదితాళము.

తర్లి పోతాము చాలా దయలుంచండి-ఇకను
మళ్లీ జన్మాలకు రాము-మదిలోనుంచండి॥ తర్లీ।

౧

బార్లుగట్టిభక్తవరులు-భజనలు సేయగా-మూడు
ఏర్లుగలసినట్టిదారి. నెఱిగి వేగముగ॥
సోహమనియెడి కత్తిదీసి-చేత నేపూనీ-అట్టె
మోహపాశములనెల్ల - మొదటికే త్రుంచీ॥ తర్లి॥

౨

ఈషణత్రయములనెల్ల -నిలలో నేడించీ-సం
తోషసాగరమునందే సంచరించుచూ
తారకమంత్రోపధ ధారలనుగ్రోలీ-ఏపు
మీఱగను మోక్షపదవి-హెచ్చి నేగాంచి॥ తర్లి॥

౩

ఆరుకమలములమీద-నద్భుతమైనా-సహ
స్రారకమలమునుచేరి-సంతసింపుచూ
చక్రనిభ ద్రాద్రిరామ-స్వామికృపనూ-పం
పెక్క రామదాసుడను-పేరుచేతనూ॥ తర్లి పోతాము॥

శా. గాలం దూలిన వానిచేఁ బడిసినన్
గాఢాగ్నిచేఁ గ్రాగినన్
వ్యాళంబాత్మవిముక్తకించుకముపై
వ్యామోహముం దాల్పక
ట్లాలోలాంగముపై నిరూఢమమతా
హంకారముల్ లేకయా
త్త్రాలోకస్థితినుండెఁ బండితుఁడు ని
త్యానందమున్ బొందుచున్.

తోహార.

సలలితముగ శ్రీరామదాసుఁడిల సద్గతి కేఁగఁగ వేగా
అలరులవర్షము గురిసిరి యమరులు హర్షముతో బాగా.

—ఇదివిరయ్యా

వ. ఇవ్విధంబున రామదాసుండు.

చ. కరయుగళీవ్రదీప్తశర
కార్ముకుఁడై రిపునాశకారియై
స్ఫురితజటాశిరస్కుఁడయి
భూమిసుతాయుతుఁడై శ్రితార్తిసం
హారుఁడయి తారహారధరుఁ
డై సహలక్ష్మణుఁడై చరించుసు
స్థిరు రఘురామసంస్మరణ
చేసి యభీష్టము నొందె ధీరుఁడై.

వ. అంత నా రామదాసుభార్య తనపెనిమిటి పిలిచినపుడు చేయుచున్న గృహకృత్యమును దీర్చుకొని వెలపలికివచ్చి విమానముం జూచుచు నూర్ధ్వముఖులై యుండెడిపురజనంబుంజూచి కొంతవడియూరక నిలిచియుండి పిదప తన భర్తపరమపదంబునకుం బోవుచు నన్నుఁ బిలుచుట దెలిసికొని పెక్కుకాలం బన్మహాత్ముని సేవఁజేయు నానేరమిం జేసి తుదకునిర్భాగ్యదశనొందితిఁగదా యని చింతించి గృహమును పరిత్యజించి భద్రశైలశిఖరంబున శ్రీరామదేవునియాలయ ముఖమంటపంబునందుఁ జేరి యిట్లని మొఱఁబెట్టుచున్నది.

రాగము - సావేరి - ఆదితాళము.

అయ్యయ్యో నే నేరనైతినీ-ఆది
నా రాయణుని దెలియనైతినీ
వెయ్యేలు జన్మాల-వెతలజెందితిగాని
చెయ్యెన సద్గతి-సాధింపలేనైతి॥ అయ్య॥

౧

మోసమేమనితలచియుందు-దోష
వాసనలతగిలి నేనిందు
ఆశాపాశములను-నరసిపొంచియుందు
వాసిగ వైరాగ్య-వాసన గననైతి॥ అయ్య॥

౨

మూఢుమేలనినమ్మియుంటి-నిరు
మూడుశత్రులగూడియుంటి
మూటిరెంటిని ద్రెచ్చి-మూటికెక్కుడవైన
కూటస్థుబోడగని-కూడగ లేనైతి॥ అయ్య॥

౩

బంధములు దుంచి వేసి-భద్ర
గిరిరాఘవులలో నేగలసి
సదయుడై నెలకొన్న-శ్రీరామదాసుని
స్థిరముగ చేపట్టి-పోషించుమననైతి॥ అయ్య॥

ఇవ్విధంబునఁ జింతించి యార్తశరణ్యుఁడు నన్నునాభర్తను గూర్చికపోయె నేని నే నీముఖమున బనంబునం గూర్చుండి నిరశనవ్రతంబున నసువుల విడిచి రామదాసుగారిసాన్నిధ్యం

బు చేరెద నని పరమదృఢీభూతచిత్తురాలైయున్న యామెచిత్తంబు రాముఁ డెఱింగి యామెకు ప్రత్యక్షంబై శీఘ్రకాలంబున పరమపదంబిచ్చెద నిచ్చటికోవెలలో ధర్మకార్యములు నెఱవేర్చుచు నీసుతుండీధర్మంబులను పరిపాలనంబు సేయునట్టి ప్రాయంబువచ్చుపర్యంతం బీభద్రశైలంబున తులసీవనకైంకర్యంబు చేయుచుండు మని యాజ్ఞాపించి యంతర్హితుండై నంత నాయమయును రామాజ్ఞాప్రకారంబున తులసీకైంకర్యంబుఁ జేయుచు ప్రారబ్ధంబు ననుభవించి పరమపదంబుఁ జేరెను.

తోహరా.

రామదాసుకథ వరుస రామదాసే విరచియించెను చూడనగా
ప్రేమతోడ సింగరిదాసీకథ ప్రకటనపఱచెను బాగా. 123
ఈ చరిత్రమును ఇంపుగ విని పఠియించినవారలకెల్ల
జేకూరును దివ్యపదవి సీతారాములదయవల్లన్. 124
ఇదివినరయ్యా శ్రీహరికి గోవిందా యనరయ్యా జనులూ
సదయులై శ్రీరామదాసుని కథవిని సద్గతిగనరయ నరులూ.
శ్రీకరముగ భద్రాచలమందున వెలుగు శ్రీరాములకృపనూ
ప్రాకటముగ రామదాసఘనుడు చేరె పరమపదంబునకూనూ.

—ఇది వినరయ్యా.

—: గ్రంథాంతమున మంగళపద్యము :—

శ్లో. మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥

వేద వేదాంత వేద్యాయ మేఘశ్యామలమూర్తయే
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళం॥

క. ప్రకటితకోసలేంద్రునకు
భవ్యగుణాబ్ధికిఁ జక్రవర్తిపు
త్రకునకు సార్వభౌమునకు
రామునకున్ నిగమాంత వేద్యుకున్
సకిమలమేఘవర్ణునకు
సర్వజగజ్జనమోహనస్వరూ
పకునకుఁ బుణ్యకీర్తికిఁ గృ
పానిధి కెప్పుడు భద్రమయ్యెడున్.

## మంగళహారతులు.

(౧. వ మంగళహారతి.)

రామచంద్రాయ జనక-రాజజామనోహరాయ
మామకాభీష్టదాయ-మహితమంగళం॥ రామ॥

౧

కోసలేయాయ మంద-హాసదాసపోషణాయ
వాసవాదినుత-సద్వరద మంగళం॥ రామ॥

౨

చారుకుంకుమోపేత-చందనానుచర్చితాయ
హారకటకశోభితాయ-భూరిమంగళం॥ రామ॥

౩

లలితరత్న కుండలాయ-తులసీవనమాలికాయ
జలజసదృశ దేహాయ-చారుమంగళం॥ రామ॥

౪

దేవకీపుత్రాయ-దేవదేవోత్తమాయ
భావజాతగురువరాయ భవ్యమంగళం॥ రామ॥

౫

పుండరీకాక్షాయ-పూర్ణచంద్రాననాయ
అండజాతవాహనాయ-యతులమంగళం॥ రామ॥

౬

విమలరూపాయవివిధ-వేదాంతవేద్యాయ
సుజనచిత్తకామితాయ-సుభగమంగళం॥ రామ॥

౭

రామదాసమృదులహృదయ-తామరసనివాసాయ
స్వామి భద్రగిరివరాయ-సర్వమంగళం॥ రామ॥

(౨. వ మంగళహారతి.)

జయమంగళం నిత్య శుభమంగళం

౧

ధీరునకు వనధిగం-భీరునకు దుష్టసం
హారునకు ఘనమణీ - హారునకునూ
హారడిండీరనీ-హార హీర పటీర
తారాళి కీర్తివి-స్తారునకునూ॥ జయమంగళం

౨

మంగళము రామునకు-మహితగుణధామునకు
మంగళము క్షీరాబ్ధి-మందిరునకూ
మంగళము మునిబృంద-మానస నివాసునకు
మంగళము సర్వగుణ-మందిరునకూ॥ జయమంగళం॥

౩

ఆద్యునకు బ్రహ్మాది-వేద్యునకు దుర్జనో
ఛేద్యునకు భవరుజా-వైద్యునకునూ
సద్యోగిఫలప్రదున-కాద్యంతరహితునకు
విద్యావివేకజన-హృద్యునకునూ॥ జయమంగళం॥

౪

జైత్రునకు సౌమిత్రి-మిత్రునకు భక్తవన
చైత్రునకు నవపద్మ-నేత్రునకునూ
మిత్రవంశాబ్జస-న్మిత్రునకు-సురవినుతి
పాత్రునకు జగదవన-సూత్రునకునూ॥ జయమంగళం॥

౩ వ మంగళహారతి.

మంగళం మంగళం మంగళం-శుభ
మంగళాలయ భవతే! మం॥

౧

కోటిమన్మథసమరూపా-శత కోటికీర్తికలాపా
హాటకాంబర తాటకాంతక-ఘోటకాదినిశాటసంహార॥ మం॥

౨

నారదగానవిలోలా-బుధ-సూరిజనావనశీలా
హారహీరపటీరశరమం-దారకీర్తివిహార గిరిధర॥ మం॥

౩

సోమధరనుతచరితా-గుణ-ధామా పద్మజవినుతా
కామజనక రమామనోహర-భీమదనుజవిరామవిక్రమ
మంగళం మంగళం మంగళం-శుభ - మంగళాయభవతే॥

జోలపాట.

జో రవికులశుభాంగ-జో సన్నుతాంగా
రార కరుణాపాంగ-రమ్యాంతరంగా॥ జోజో॥

౧

శ్రీవెలయు పాలవా-రిధిబవ్వళింపా
దేవబృందములెల్ల-దివిసన్నుతింపా
భావ మెంచినవారి-భక్తిపాలింపా
దైవరాయా మాకు-తరమె వర్ణింపా॥ జోజో॥

౨

గురుతిరంబుగ ధర్మ-గుణము చేపట్టి
దురితదానవకోటి-దురములో గొట్టి
శరణాగతత్రాణ-బిరుదు చేపట్టి
కరుణతో కౌసల్య-గర్భమున బుట్టి॥ జోజో॥

౩

కమలసంభవవినుత-ఘనసుగుణసాంద్రా
అమితదుష్టభుజంగ-యహితుండికేంద్రా

విమలవైభవముల-వెలయు దేవేంద్రా
రమణతో వెలసితివి-రఘురామచంద్రా॥ జో॥జో॥

## హెచ్చరిక.

హెచ్చరిక శ్రీరామ-హెచ్చరిక రామా
హెచ్చరిక రఘురామ-హెచ్చరిక రామా॥ జే॥జే॥

౧

బంగారుగిన్నియల-పొంగుదీరినపాలు
అంగనలు దెచ్చినా-రన్న హెచ్చరికా
పచ్చకపురపువిడెము-హెచ్చుగా సీతా
ఇచ్చుచున్నది రామ-దేవ హెచ్చరికా॥ జే॥జే॥

౨

పరగబంగరుపిల్ల-గలచామరాల్ భక్త
పరులేయుచున్నారు-వరద హెచ్చరికా
పరిమళద్రవ్యములు-పన్నీరు లివిగో
పరమదయగొను సార్వ-భౌమ హెచ్చరికా॥ జే॥జే॥

౩

ఖోటు లిరువురువీణె-మీటి పాడంగా
నీటుగను వినునట్టి-మేటి హెచ్చరికా
వాసిగా నరసింహ-దాసపోషా శ్రీని
వాసుడా భద్రాద్రి-ధీశ హెచ్చరికా॥ జే॥జే॥

# రామాయణకథానిబద్ధమంగళ

## సీ స మా లి క.

దశరథసుతుఁడై తాటక మర్దించి
గాధేయుసవనంబుఁ గాచి పిదప
నాతి నాతిగఁ జేసి రాజశేఖరువిల్లు
జగము మెచ్చఁగ విఱిచి చెలువుగాంచి
సీతను బెండ్లాడి శివశిష్యుఁడైనట్టి
పరశురామునిప్రజ్ఞ భంగపఱిచి
తండ్రియానతి గాని తమ్ముఁడు దోడరా
వైదేహితోఁగూడ వనముకేఁగి
రక్కసి చెవులును ముక్కును గోయించి
ఖరదూషణాది రాక్షసులఁ ద్రుంచి
మాయామృగంబును మాటలోన వధించి
వనితను గోల్పోయి యినజుఁ గూడి
వనమున వెదకుచు వనరగా నొకచోట
గృధ్రరాజుకుఁ బరక్రియ లొనర్చి
శబరి యిచ్చినపండ్లఁ జవి చూచి భక్షించి
కిష్కింధ కేతెంచి కీశనాథు
వాలిని వధియించి వనచరరాజ్యంబు
సుగ్రీవున కొసంగి సుగుణి యైన
వాయునందనుచేత వైదేహి యున్నట్టి
చోటు నెఱింగి వనాటకోటి

కొలువఁగా నడిచివే జలధికూలముఁ జేరి
సేతుబంధ మొనర్చి శీఘ్రముగను
రావణాదిక సర్వరాక్షసులను జంపి
లంకకు విభీషణు రాజుఁ జేసి

తే. భూమిజను గూడి సాకేతపురముఁ జేరి
ధరణిలోపల సింగరిదానుఁ బ్రోవఁ
బట్టభద్రుండవై నట్టిపరమ రామ
దయను కృతిఁ బ్రోవు మాచంద్రతారకముగ.

శ్రీ భద్రాచలరామదాసుచరిత్రము

సంపూర్ణము.

# రామదాసుచరిత్ర-కీర్తనల అనుక్రమణిక.

వ

# రామదాసుచరిత్రపద్యాలఅనుక్రమణిక.



## అ



## ఆ

## గ



## ఘ



## జ



## త



## ద

## భ



## మ



## ర



## వ

## హా



## స